# Sreeramakathamrutamu

BY

INALA VENKATASWAMY NAIDU,
*Author of "Hamsadwadasakatha Manjari,"*
*"Upanyasa Chandrika,"*
*"Ajamileeyamu, Rajakumari" etc.*

*FIRST IMPRESSION*

PRINTED AT SREE RAMA PRESS,
RAJAHMUNDRY.

*Price 10 annas]* *[Postage extra*

# శ్రీరామకథామృతము



ఇయ్యది

సర్వజనుల కత్యంతోపయోగముగ నుండునటులు

"హంసద్వాదశి కథామంజరి," "ఉపన్యాసచంద్రిక,"

"అజామిళీయము," "రాజకుమారి"

ఇత్యాది గ్రంథకర్తయగు

## అయినాల వేంకటస్వామినాయనిచే

విరచితము.



రాజమహేంద్రవరమున:

పిల్లారిశెట్టి ప్రకాశరావునాయుడు అండ్ బ్రదర్సువారి

శ్రీ రామముద్రాక్షరశాలయందు ముద్రితము.

వెల 10 అణాలు]  [పోస్టేజీ కాక

# శ్రీరామస్తవము.

ఉ. జానకితోడఁ దాఁ గనక
సన్మణిపీఠముపై వసింప సే
వానత మారుతియై హనుమ
పాదతలంబును గొల్చుచుండ మో
దాన నిజానుజన్ములు సి
తంబగు ఛత్రము చామరంబులున్
బూని భజింప భక్తతతిఁ
బ్రోచెడి శ్రీరఘురాముఁ గొల్చెదన్

# ఉపోద్ఘాతము.

లోకోత్తరమహాపురుష చరిత్రములును, భారతీయధర్మ సాంప్రదాయనిధానములునైన భారతరామాయణాదులు, సంస్కృతభాషయెఱుఁగని దేశీయులకు అనభిగమ్యములుగానుంటచే, లోకశ్రేయము నభిలషించి, పూర్వకవులాయుగ్రంథములను దెనిఁగించి, మూలమునందలి పరమార్థమును గొంతవఱకు సుబోధముచేసిరి. కాని వారిరచనలు ప్రౌఢకావ్యములై యుండుటవలన, సాహితీసంపన్నులైనవారికి మాత్రమే సువేద్యములై సామాన్యులకు నందరానివయ్యెను. ఆసాహిత్యపరులు, ఏదేవాలయములోనో, ఏరచ్చపట్టుననో, తీరికవేళల నల్వురను జేర్చి, యాపెద్దపుస్తకములను జదివి యర్థము వివరింపఁగా వినుటమాత్రముతోనే జనులు సంతోషింపవలసినవారైరి. ప్రజలు చదువను, వ్రాయను ఎఱుఁగనినాళ్లలో అట్టిపురాణశ్రవణమే విద్యాశిక్షగా నెగడుచుండెడిది. కాలక్రమమున నిరక్షరకుక్షులైనజనులు అక్షరాస్యులగుట తటస్థించును. అయినను, వారు సాధారణభాషాజ్ఞానము కలవారేయగుదురు గాని పండితులు మాత్రము కాఁజాలరు. ఏదేశమందైనను, జనులందఱో, కొందఱో విద్యావాసనగలవారు కావచ్చును గాని విద్యానిధులగుటమాత్రము కల్ల. ఎప్పుడు అక్షరజ్ఞానము

లభించునో, అప్పుడేజనము, పుస్తకశ్రవణము నెడకంటెను, పుస్తకపఠనము నెడ నెక్కువ కుతూహలపడును. వారికుతూహలము తీరవలెనన్న విద్యావంతులైన గ్రంథకర్తలు, సర్వసుబోధములైన వచనరచనలు చేయవలెను. ఆవచనములు, చదువ నేర్చిన ప్రజాసామాన్యము యొక్క తనివి తీర్చుటకేకాక, దేశభాషా వ్యాప్తికిఁగూడ హేతుభూతములగును.

ఆంధ్రనాయకరాజులు, చోళపాండ్యదేశముల నేలిన కాలములో, పదునేడవశతాబ్దిని, అట్టి వచనరచన ప్రయత్నము కొంతవఱకుసాగినది. ప్రజలబాగును, తమయభ్యుదయమును సమముగా గుర్తించిన నాయకరాజులు, తాముస్వయముగా వ్రాసియు, తమయాస్థానకవీశ్వరులచే వ్రాయించియు వచన వాఙ్మయమును బెంపొందఁజేసిరి. సారస్వతాంగముగా మన ముచెప్పి చూపుకొనఁదగిన వచనరచనకు, ఆనాటి జైమినీభారతవచనము, రామాయణవచనము, భారతవచనములోనగు గ్రంథములే నాందీవాక్యములు. ఆగ్రంథములవలననైనను, వారనుకొన్నఫలము లభించినదని నాకు నమ్మకములేదు. ఏమన, వారిరచనలు సయితము పూర్వకవుల పద్యగ్రంథముల వలెనే ప్రౌఢములైయున్నవేకాని, సుబోధముగా లేవు. కాని, పద్యగ్రంథములఁగల, అన్వయక్లేశములోనగు చిక్కులులేక పోవుటచే, వానిని, సుళువుగా, ధారాళముగా, పల్వురు చదివి కొనియుందురు. నిజమారసినచో ఎల్లరకును దెలియఁదగి, తేలికగానుండు వచనములు మనభాషలో ఆధునికకాలముననే

వెలసినవని చెప్పవలెను. ఆంగ్లపాఠశాలలోని విద్యార్థిజనమున కుపయోగపడుటకే సరళమైన వచనరచనయావిర్భవించెను.

ఈగ్రంథకర్త, అయినాల వేంకటస్వామినాయఁడు గారు, విద్యార్థులయుపయోగముకొఱకే, ఈవఱకు, అజామిళీయము, ఉపన్యాసచంద్రిక మొదలగు కొన్నివచనగ్రంథములు వ్రాసి ప్రకటించిరి. వానిని విద్యార్థులకు బోధించిన యుపాధ్యాయులు పెక్కురు వానిగుణమును మిక్కిలి శ్లాఘించిరి. సలక్షణమైనభాషలో, ఉత్తమకథలనురచించి, సుకుమారబుద్ధులైన విద్యార్థులకు ధర్మబోధయు, భాషాజ్ఞానమును గలిగింపవలెనని నాయఁడుగారి సంకల్పమట. ఇదికొనియాడఁదగిన పూన్కి కాదని యెవరనగలరు.

ఏతత్సంకల్పపూర్వకమైనదే యీ శ్రీరామకథామృతమనెడిరచనయు. పూర్వరామాయణకథయంతయు, మూలానుసారము, సంక్షిప్తముగా వచనమున అనువదింపఁబడుటచే, దీనిని, వచనసంగ్రహరామాయణమని చెప్పనొప్పును. ఇందలి భాష నిరుపమమై అంతకఠినమును, అంతతేలికయుఁగాక సమస్థితిని ఒప్పుచున్నది. ఇది విద్యార్థులకు మిక్కిలి యుపకరించుననియు, గ్రంథకర్తసంకల్పము ఫలించుననియు ఆసించుచున్నాను.

పింగళి లక్ష్మీకాంతం ఎమ్. ఏ.,
ఆంధ్రవిశ్వకలాపరిషత్ప్రధానాంధ్రోపన్యాసకులు,
విశాఖపట్టణము.

# పీఠిక.

ఈభరతఖండమునందలి హిందువులందఱిచేఁ బూజనీయముగ గౌరవింపబడుచున్న మహాకవి ప్రణీతములగు గ్రంథసముదాయములలో శ్రీమద్రామాయణమువంటి సత్కథను దెలుపునట్టియు, శ్రీమహాభారతమువలె ధర్మములు బోధించునట్టియు, శ్రీమద్భాగవతమువలె భక్తిఁ గలిగించునట్టియు సర్వోత్కృష్టములైన గ్రంథరాజములు లేవని చెప్పవచ్చును. మన భరతవర్షమునందలి ప్రాచీనకవికృత కావ్యములన్నింటిలోను ఆదికావ్యమగు శ్రీమద్రామాయణ మహాకావ్యంబు సుధారసపేశలంబై, నిఖిలపురుషార్థప్రదాయకంబై సకలవిద్వజ్జనసేవ్యంబై విరాజిల్లుచున్నది. శ్రీరాముఁ డీమ్మహాకావ్యకథానాయకుఁడు. ఈమహనీయుని యద్భుతచరిత్రము గీర్వాణభాషం బ్రౌఢశైలిని విరచించి జగంబున వెలయించిన వారిలో వాల్మీకి మహర్షిపుంగవుఁడు ప్రథముఁడు. ఈకథ సంస్కృతమునందేకాక యనేకదేశభాషలలోఁ గావ్యనాటకాది బహురూపములఁ బొంది పండితపామర సామాన్యముగా లోకంబున సుప్రసిద్ధంబై యున్నది.

భారతీయులకు రామనామము పవిత్రము — ముక్తిప్రదము. వారి గృహములు సీతారామలక్ష్మణవిగ్రహ సుశోభితములు — అం దెల్లప్పుడును శ్రీరామశబ్దము తాండవమాడు

చుండును. ఇంతయేల, హిందువులలో నల్పముగనో యధిక
ముగనో రామకథ నెఱుఁగనివారుండరని నుడువుట యొక
వింతకాదు. జగద్విఖ్యాతకీర్తియగు సీరామదేవుని కథను
ఆబాలవృద్ధమునకు సుబోధమగు శైలిలో సంగ్రహవచన
కావ్యముగా వ్రాయుమని కొంతకాలము క్రిందట నందందుఁ
గల భక్తులును, రసజ్ఞులు నగు మన్మిత్రులు కొందఱు నన్నుఁ
బ్రోత్సహించుటచే,

ఉ. భ్రాజితకీర్తియైన రఘు ♦ రాము చరిత్రము సత్కవీశ్వరుల్
తేజమెలర్పఁజెప్పుట మ ♦ దిఁగని క్రమ్మఱఁజెప్పనేల? నా
భూజనకల్పకంబగుచు ♦ భోగములుబ్బుగ డాయఁజేయు నా
రాజితసత్త్వుఁడైన రఘు ♦ రాముభజించిన నొప్పకుండునే!

అను న్యాయముంబ్రమాణముగాఁ దీసికొని శక్త్యశక్తులను విచారింపక బుద్ధిచాపల్యముచేతఁ గించిద్జ్ఞుఁడనగు నేను వేగిరపడి యీ గ్రంథమునువ్రాయ నుపక్రమించితిని. దీనివ్రాయుటలో నాకమూల్యనీతిరత్నముల కాలవాలమైన శ్రీమద్వాల్మీకిరామాయణము ముఖ్యాధారమైనప్పటికి నింక ననేకగ్రంథములఁ బరిశోధించి యందలి సారమంతయు సందర్భానుసారముగ నిందుఁ బొందుపఱచితిని. ఇది మానవ సత్ప్రవర్తనమునకుఁ బ్రధానములైన నీతుల నుద్బోధించు రామావతారకథ. ఇందు రామునిపితృభక్తి, ఏకపత్నీవ్రతము, సీతాపాతివ్రత్యము, భరతలక్ష్మణుల భ్రాతృభక్తిభావము మున్నగునవి మనోహరముగ వర్ణింపఁబడినవి.

రావణాది క్రూరరాక్షస సంహారణార్థంబు లోకంబున మాయామనుష్యావతారంబులెత్తి యమానుషంబులగుకృత్యం బులు సలిపిన లక్ష్మీనారాయణులగు శ్రీసీతారాముల కథా సుధాలహరి యెవ్వరికపేయంబగు! విష్ణ్వంశసంభూతుఁడగు శ్రీరాముని చరిత్ర మిహపరపురుషార్థప్రదంబగుటంజేసి యెన్ని మారులు చదివినను క్రొత్తక్రొత్తగాఁ దోఁచుచుఁ బాఠకుల మనమున కానందము గలిగించుచుండును. కావున భాషాభి మానులెల్లరును జ్ఞానభక్తిసాధనంబైన యీగ్రంథమును బెల్లు గాఁజదివి యానందింతురుగాక! ఇది సర్వజనసమాదరణీయమై వెలయుఁగాక!

మఱియు నీగ్రంథంబంతయు నామూలాగ్రంబుగం జదివి, దీనిముద్రించుటకు నన్ను ప్రోత్సాహపఱచి ఇయ్యది యచ్చు వేయఁబడుచుండఁగ నెక్కుడు శ్రద్ధతో నక్షరప్రమాదాది జనితదోషరహితంబుగఁ బ్రూఫులు (Proofs) దిద్ది యత్యంత సహాయం బొనరించిన నాప్రియమిత్రులగు బ్రహ్మశ్రీ కవి భూషణ, దివాకర్ల వేంకటావధాని, ఎమ్.ఏ., ఆనర్సు, గారికిఁ గృతజ్ఞతాపూర్వకవందనంబు లర్పించుచున్నాఁడ.

అయినాల వేంకటస్వామినాయఁడు,

గ్రంథకర్త.

# పండితాభిప్రాయములు.

## శ్రీ కింకవీంద్రఘటాపంచాననేత్యాది బిరుదాంకితులును, శతావధానులునగు బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రులు గారు వ్రాయించి యంపినది.

అయ్యా! తాము నా మిత్రుని ద్వారమున నంపిన, "శ్రీరామకథామృతము" అను గద్యకావ్యమును జాలవఱకుఁ జదివి చూచితిని. ఇయ్యది యాంధ్రభాషాభ్యసన కుతూహలులగు విద్యార్థులకుఁ జాల నుపయోగకారి యని నాకుఁ బూర్తిగాఁ దోఁచినది. సాధ్యమైనంత త్వరలో దీనిని ముద్రింపించి ప్రకటింతురుగాక!

చ. సొగసు దలిర్చు వాక్యములు ♦ సొంపులు నింపు సమాసముల్, కడుం
దగడి యలంకృతుల్, మృదు ప ♦ దంబులు, చక్కని శయ్య, నీతులన్
బొగడికఁ గన్న కల్పనలుఁ ♦ బొల్పగు సామెత లెందు దోష శూ
న్యగతియుఁ గల్గి మీ కవిత ♦ నాకు ముదం బిడె నన్ని భంగులన్.

---

## విశాఖపట్టణవాస్తవ్యులు, హైకోర్టువకీలు, హూణాంధ్రగీర్వాణ భాషాపాండిత్య శోభితులు, బ్రహ్మశ్రీ ప్రభల లక్ష్మీనరసింహము, బి. ఏ., బి. ఎల్., గారనుగ్రహించినది.

శ్రీయుత అయినాల వెంకటస్వామినాయుఁడుగా రాంధ్రవిద్వల్లోకమునకు చిరపరిచితులు. మాతృభాషాసేవ నొనరించుటయందమితోత్సాహము, కార్యదీక్షగలవారు. విద్యార్థుల కుపయోగించు నెన్నో గ్రంథముల రచించి ప్రసిద్ధిఁ బడసిరి. వీరిచే రచింపఁబడిన, "అజామిళీయము", "రాజకుమారి", "ఉపన్యాసచంద్రిక" మొదలగునవి నేఁటికిని ప్రచారములోనుండి ఎమువరుల నాకర్షించుచున్నవి. ఇరువది వత్సరముల క్రిందట రచింపఁబడిన యజామిళీయమున వీరి మృదుమధురశైలిని గూర్చియు, పాండిత్యమును గూర్చియు, భాషా

శీనను గూర్చియు నా యభిప్రాయమును సీతిక రూపమున వెలిబుచ్చియుంటిని. అందు సూచించిన రీతిని మాతృభాషకు వెలలేని యలంకారములుగ నూత్న పద్ధతి నెన్నియేని కబ్బములు కూర్పఁబడినవి. వయఃపరిణతిచే భావములు పరివర్తనము నొందుటయు ననుభవము విస్తరించుటయు లోకనిజమంతయుగు పరాత్పరుని నిత్యవిభూతి యెల్లగ హృదయముల నాకర్షించుటయు సహజములై యుండును. కవితాగానము గోలిన ప్రతిమానపుడును శ్రీరామచంద్రుని దివ్యగుణ కీర్తనము గావించి యిహపరముల సాధింపనెంచుట, యాలోకాభిరాముని దివ్యగుణ మహిమయే కాని కవుల దోషము కానేరదని జయదేవమహాకవి యుద్ఘోషించియున్నాఁడు. కులగిరు లున్నంతకాలమును రామకథ కీర్తిఁగాంచు నను వాల్మీకిమహర్షి ప్రతిజ్ఞయు సత్యమై యున్నది. అట్టి శ్రీరామచంద్రుని లీలామానుష దివ్యచారిత్రము నాబాలగోపాలము నాస్వాదించి ధన్యతఁ జెందు కొఱకు నామిత్రులు శ్రీయుత వెంకటస్వామినాయుఁడుగా రాంధ్రమున సులభగ్రాహ్యమును, హృద్యమును, సద్యఃపద్యాత్మకమును నగు నొక చిన్న పొత్తము రచించి జన్మపవిత్రతను, కవితాసాఫల్యమును గడించిరి. ఆర్యనాగరికత వింత పరిణామములఁ జెందుచుండు నీకాలమున, భారతీయయువకుల మనోవికాసము విదేశనష్టవ్యామోహమున నాత్మశక్తిని విస్మరించి యుండు తరుణమున, నానాప్రపంచము విశ్వమానవ సౌభ్రాతృత్వమును బోకడచి స్వార్థపరత్వమున బరస్పరస్పర్ధలతో మోహాంబుధి మునిఁగియుండుపట్టున, భారతీయుల యున్నత నాగరికత కాదర్శపురుషులగువారి జీవితములఁ బ్రకటించుట కొంతవఱకైనఁ బ్రజల హృదయముల నాకర్షింపకమానదు. అట్టి యాదర్శపురుషులలో నన్ని తెఱగుల నుత్తమోత్తముఁడుగా నుండుటయే కాక పరమేశ్వరుని దివ్యావతారమూర్తియై భూలోకమున రామరాజ్యమును నెలకొల్పి ధర్మము నుద్ధరించిన శ్రీరామచంద్రుని యద్భుతచారిత్ర మెల్లరకును సుబోధమగు రీతిని వర్ణించుట లోకకల్యాణమునకుఁ దోడ్పడు ననుటలో సందియము లేదు. భూమిపై రామరాజ్యమును స్థాపించుటయే ధర్మప్రవృద్ధికి మూలము. మానవయత్నము లన్నియు కేంద్రీభూతములయి యచటనే సఫలములగును. అట్టి మహోదర్కమునకుఁ దోడ్పడు నల్పయత్నమైనను శ్లాఘా

పాత్రమగును. ఈ దృఢతరభక్తితో నీగ్రంథమును రచించిన నాయుఁడుగారిని శ్రీరామచంద్రుఁడు కరుణించి బ్రోచుగాత! ఆంధ్రవిద్యార్థిసుజన మీగ్రంథమును బఠించి కృతకృత్యతఁ గాంచుగాక!

---

ఎ. వి. యన్. కాలేజీ ప్రధానాంధ్ర పండితులగు బ్రహ్మశ్రీ కవిభూషణ దివాకర్ల వేంకటావధాని, ఎమ్. ఏ., ఆనర్సుగారు కరుణించినది.

ఉ. రామకథాసుధం గలుగు ♦ రంజకతా రమణీయతల్ మహో
ద్దామ ముదంబు నాకొసఁగఁ ♦ దద్రసవక్రమ మిట్టిదంచు నే
నేమని చెప్పఁ జేనియల ♦ నిక్కువ సమ్మను శక్యమౌనె దివా
కోమృత ధారలన్ దగడు ♦ రంగు రసాంచిత సూక్తులన్నియున్.

చ. చరితము రాఘవేశ్వరుని ♦ సన్నుతిపుంజము యాటు భక్తికిన్
విరచనశైలిలోకృతను ♦ వేతము నప్పొ సాంచితమ్మునై
వరలుట వాఙ్మయాధ్యయన ♦ వాంఛయుఁ బోషకమైన యీ మనో
హరకృతి రెండు లోకముల ♦ యందు సుఖంబిడుఁ బారకాళికిన్.

---

సి. బి. యమ్. హైస్కూల్ తెలుఁగు పండితులును, విశాఖ పత్రికా సంపాదకులు నగు బ్రహ్మశ్రీ ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణగారు కృపతో నొసంగినది.

బాలురకును, భక్తులకును, అత్యంతోపయుక్తంబులగు అనేక సద్గ్రంథములను రచించిన శ్రీయుత అయినాల వేంకటస్వామినాయనిగారిచే నవీనముగా విరచింపఁబడిన శ్రీరామకథామృతమను భక్తిరసప్రధానమగు గద్యకావ్యము నామూలాగ్రముగాఁ జూచితి. మృదుమధురశైలి గలిగి లలితపద గుంభితంబై గ్రంథమంతయుఁ ననర్గళమగు ధారాశుద్ధితో నలరారుచున్నది. ఈగ్రంథమునందు శ్రీరామకథయందలి భక్తిభావము మిక్కలి చక్కఁగా

ఘోషింపఁబడినది. ఇయ్యది మధ్యమోన్నతపాఠశాలల యందలి విద్యార్థులకు పాఠ్యపుస్తకముగా నిర్ణయింపఁబడుట కనుకూలముగా నున్నదని నా యభిప్రాయము.

శ్రీరామ భక్తులు తమ యిండ్లయందు పారాయణ గ్రంథముగా నుపయోగించుకొనుటకు నిది తగియున్నదనియు నాయుద్దేశము. ఇందు సందర్భానుసారముగా రచింపఁబడిన రసవంతములగు పద్యము లక్కడక్కడఁగలవు.

---

## విశాఖపట్టణము హైస్కూల్ ఆంధ్రోపాధ్యాయులగు బ్రహ్మశ్రీ విద్వాన్ నిరోగి రామమూర్తి శాస్త్రిగారు ఈరీతి వ్రాసిరి.

క. "శ్రీరామకథామృతమును"
నారూపపు భక్తితోడ ♦ నందఱు మెచ్చన్
ధారాళమైన పదముల
చారుత రచియించితీవు ♦ చక్కని శైలిన్.

గీ. మీరలిచ్చిన పాత్రము ♦ మిగుల వేడ్కఁ
బఠన మొనరింపఁ జిత్తమ్ము ♦ పల్లవించె
నందు నాశ్చర్య మేమియు ♦ నరయలేదు
అమృతపూరం బదేరికి ♦ హాయినిడదు!

---

## ఆంధ్రవిశ్వకలాపరిషత్కలాశాలాంధ్రోపన్యాసకులగు బ్రహ్మశ్రీ విద్వాన్ గంటి జోగిసోమయాజి, ఎమ్. ఏ., ఎల్. టి., గారనుగ్రహించినది.

శ్రీ అయినాల వేంకటస్వామినాయనిగారిచే వ్రాయఁబడిన "శ్రీరామకథామృతము" అను గ్రంథమును స్థాలీపులాకన్యాయంబునం జూచితిని. ఇందలి శైలి కడుంగడు రమణీయము. కథారచన మింపు గొల్పుచున్నయది. ఈగ్రంథము విద్యార్థులకుఁ బఠనీయము, భక్తుల కానందజనకము నయి యున్నదనుటకు మిక్కిలి సంతసించుచున్నాను.

కృష్ణాజిల్లా బందరుపురవాస్తవ్యులును, సరస చతుర్విధ కవితా సామ్రాజ్య ధురంధరులు నగు బ్రహ్మశ్రీ నాదెళ్ల పురుషోత్తమశాస్త్రిలుగారు సదయులై యంపినది.

ఉ. మున్నల చిన్నపుస్తకమె ♦ ముద్దుగ నున్నదటంచు నెన్ను నా
కన్నివిధంబుల న్మిగుల ♦ నందముగాఁ దగియున్న దీని నే
నెన్నికచేసినాఁడ నన ♦ నెచ్చె! మహా ముద మొప్ప నింక ని
క్లెన్నియొ వ్రాయనైన దశ ♦ యీకవి కొప్పెడు నందు నిచ్చలున్.

తే. ఇంచుకంతైనఁ గాఠిన్య ♦ మిందు లేదు
లసదలంకార చతురత ♦ యొసఁగు చుండు;
కలవు సమయోచితము లగు ♦ పలుకు లహహా!
పద్దెములు ననువుగఁ దగి ♦ పటిమ మీను.

విశాఖపట్టణవాసులగు బ్రహ్మశ్రీ స్థానాపతి సత్యనారాయణ శాస్త్రిగారు పంపినది.

మ॥రా॥శ్రీ అయినాల వేంకటస్వామినాయఁడుగారు రచించిన "శ్రీరామ కథామృతము," అను గద్యపద్యకావ్యమును చదివి యానందించితిని. ఇది,

"నియతికృత నియమ రహితాం
హ్లాదైకమయీ మనన్య పరతంత్రామ్
నవరస రుచిరాం నిర్మితి
మాదధతు భారతీ కవేః"

అను మమ్మటుని యభిమతము ననుసరించి యున్నది. శ్రీరామచంద్రుని పవిత్ర చరిత్రము నత్యంత మృదుమధురశైలిని రచించిన శ్రీనాయఁడుగారు మిగుల స్తవనీయులు.

ఇయ్యది బాలురు, స్త్రీలు, వృద్ధులు నత్యంతముఁ బఠింపఁదగియున్నది. ఇట్టి సద్గ్రంథము లింకను వారురచించునట్లు పరమేశ్వరుఁడనుగ్రహించుఁగాక!

కర్నూలుజిల్లా గిద్దలూరు వాసులు బ్రహ్మశ్రీ బసూరు త్యాగరాయశాస్త్రిగా రాశీర్వచన పూర్వకముగా నిట్లువ్రాసి యంపిరి.

మిత్రసత్తమా ! భవత్ప్రేషితమ్మగు "శ్రీరామకథామృతము," అను గ్రంథమును సమగ్రముగాఁ జదివితిని. అత్యానందము నొందితిని. బహునీతి బోధకంబును, భక్తజనమనోల్లాస జనకంబును, సకలజనపఠనీయంబును, లలిత మృదుమధుర పదరచనా విరాజితంబును, లోకోక్తిపరిపూరితంబును, కథా సందర్భానుకూల పద్యవిభాసితంబును, భక్తిరసప్రధానంబును నగు నీగ్రంథమును రచించిన మీకు భక్తవత్సలుండైన శ్రీమన్నారాయణుం డాయురారోగ్యైశ్వర్యములనిచ్చి రక్షించును గాక !

---

*Mrs.* ఎ. వి. యన్. కాలేజీ యందలి హైస్కూల్ ప్రథానాంధ్రోపాధ్యాయులగు బ్రహ్మశ్రీ విద్వాన్ మాధా-రాయఁడు శాస్త్రిగా రొసంగినది.

తే. శ్రీమదయినాల వేంకట ♦ స్వామి కవికృ
తమును బాలకస్వాంత హృ ♦ ద్యమును దురిత
హారమునైన శ్రీరామ క ♦ థామృతమను
గ్రంథమును బఠించితి సమ ♦ గ్రముగ నేను.

క. మృదుపద బంధంబగు నీ
యది విద్యార్థి వితతి పఠ ♦ నార్హంబని నా
హృదయాంబుజ మందుఁ దలం
చెద నీతియుతంబును జన ♦ హృద్యము నగుటన్.

చ. అతిరమణీయ లక్షణ స ♦ మన్విత మండన యుక్తమైన యీ
కృతి లలనన్ జగంబున వి ♦ కీర్ణముగా నొసరించి యీవలన్
కృతికరు నిట్టి కబ్బముల ♦ నింకను గూర్చెడు వానిఁగా నుమా
పతి యొసరించి సౌఖ్యము ల ♦ పారముగా నిడుగాక! నిచ్చలున్.

## ఆంధ్రయూనివర్సిటీ కాలేజీ ఆంధ్రోపాధ్యాయులు బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రులుగారు కృపనొసంగినది.

మ. రా. శ్రీ అయినాల వేంకటస్వామినాయనివారు రచియించిన శ్రీరామకథామృత మందందు చదివితిని. శైలి మృదుమధురమై సరళమై యొప్పుచున్నది. భాషనిర్దుష్టము. కథ పరమపావనము. ఇట్టి యీ గ్రంథము ముద్రితమై విద్యార్థివర్గమునకును, భాషాభిమానిలోకమునకును సంతోషదాయకమగుఁగాక!

## విశాఖపట్టణపు గవర్నమెంట్ బోధనాభ్యసన పాఠశాలయందు ఆంధ్రోపాధ్యాయులగు బ్రహ్మశ్రీ పాకల సూర్యనారాయణ శాస్త్రిగారు దయచేసినది.

గీ. శ్రీమదయినాల వంశాబ్ధి ♦ శీతధామ!
సజ్జన విధేయ! వేంకట ♦ స్వామినాయ
శార్య! భవదీయ రామక ♦ థామృతంబుఁ
గ్రోలి మద్భావ మిట్టులు ♦ కుదురు పఱతు.

చ. సరససమాన విగ్రహప్ర ♦ శస్తతరాన్వయ భావసందల్
సరళ పదావళీరచన సత్కవి సమ్మత ద్రాక్షపాక వి
స్తృత శుభశైలి ధన్యతమ ♦ సన్ముని వందిత రామసత్కథల్
వగలుఁగ పండిత ప్రకర ♦ పాఠక హస్తములన్ జయంబునన్.

చ. లలిత శిరీషపుష్ప మృదు ♦ లంబు, రసాల రసైక మాధురీ
విలసిత ముత్తమోత్తమము ♦ విస్ఫుట నూతన భావవైభవో
జ్జ్వలము, జనానుకూలము, భ ♦ వత్కృతి రత్నము భవ్యమంజులో
క్తుల వెలయున్ యశోన్నతుల ♦ తో విబుధప్రకరాళి వంద్యమై.

సీ. పదగుంభనప్రౌఢి ♦ పండిత పామర,
జనరంజకంబై ప్ర ♦ శస్తిఁ గాంచు,
విషయంబు బహునీతి ♦ విభవమై లోకోప,
కారానుమతమూచాఁ ♦ గ్రాలుచుండు,
లాలిత ధారా వి ♦ లాసంబు పరికింపఁ,
ద్రిదశ గంగాభమై ♦ తేజరిల్లుఁ,
బరమార్థ గౌరవ ♦ పటిమ పాఠకులకు,
మతిబుద్ధికుశలత ♦ సమరఁజేయు,
గీ. శీఘ్రముగ ముద్రితంబై ప్ర ♦ సిద్ధిఁ బొంది,
యవనిఁ ద్వత్కృత రామ క ♦ థామృతంబు,
తనరుఁ గావుత నాచంద్ర ♦ తారకముగ,
భారతికమూల్యహా సలం ♦ కారమగుచు.

---

రాజమహేంద్రవరస్థిత ఆంధ్రయువతీ సంస్కృతకళాశాలయందలి
ప్రధానాంధ్రపండితులగు బ్రహ్మశ్రీ పాత్రుని
వెంకటసోమయాజి బి. ఏ, (ఆనర్సు) గారు
దయతో నొసంగినది.

శ్రీ అయినాల వేంకటస్వామినాయఁడుగారి "శ్రీరామకథామృతము" సాంతముగాఁ జదివి చూచితిని. అందలి శైలి సులలితమై మనోహరమై యొప్పారుచున్నది. అందందుఁ గూర్పఁబడిన పద్యములు సమయానుగుణములై రసవంతములై యున్నవి. ఈపుస్తకము పాఠశాలలయందలి విద్యార్థులకే కాక భక్తులకు సైతము పఠన పాఠములకు యోగ్యమై యున్నదని తలంచెదను.

---

శ్రీ

# రామాయణ పాత్ర శీల వర్ణనము.

**దశరథుఁడు:**—రఘుమహారాజునకుఁ బౌత్రుఁడు - అజమహారాజునకుఁ బుత్రుఁడు - శ్రీరాముని తండ్రి.

**కౌసల్య:**—దశరథుని పట్టమహిషి - శ్రీరామునిఁగన్నతల్లి.

**సుమిత్ర:**—దశరథుని ద్వితీయభార్య - ఈమెయందు లక్ష్మణ, శత్రుఘ్నులు (కవలలుగ) జన్మించిరి.

**శ్రీరాముఁడు:**—దశరథుని జ్యేష్ఠభార్యయగు కౌసల్యయందు జ్యేష్ఠకుమారుఁడై యవతరించెను - ఇతఁడు రామాయణ కథానాయకుఁడు.

**లక్ష్మణుఁడు:**—సుమిత్రా పుత్రుఁడు - బాల్యమునుండియు శ్రీరామునియందు నిర్వ్యాజమగు భక్తిఁ గలఁవాడు - ఈతని సోదరభక్తి వర్ణనాతీతము.

**భరతుఁడు:**—కైకేయీ పుత్రుఁడు - రామభక్తాగ్రగణ్యుఁడు.

**శత్రుఘ్నుఁడు:**—సుమిత్రా పుత్రుఁడు - భరతానువర్తనపరుఁడు.

**సీత:**—మిథిలాధినాథుఁ డగు జనకరాజు యజ్ఞభూమిని దున్నించుచుండఁగా నాఁగటి చాలులో దొరికినందున నీమెకు 'సీత', (అనఁగా నాఁగటి చాలు) యని

పేరిడి పుత్రికఁగాఁ బెంచెను - ఈమె యయోనిజ - శివ దనుఃఖండన మొనర్చి శ్రీరాముఁ డీమెను బెండ్లి యాఁడెను - ఈమె శ్రీమద్రామాయణ కావ్యనాయిక.

కాకాసురుఁడు:—ఒకరక్కసుఁడు - ఇతఁడు కాకరూపంబుఁ దాల్చి మందాకినీతీరంబునకుంజని యచ్చోట నిద్రించుచున్న సీతనుగాంచి యామె పయ్యెదను ముక్కుతోఁ జిమ్మి, గోళ్ళతో స్తనములను గీరెను - దానిం జూచి రాముఁడు వానిమీఁదఁ బ్రయోగించిన యిషీకంబున ముల్లోకంబులం దిరిగివచ్చి యాతనిశరణంబు సొచ్చె - అపుడతఁడు తనయిషీకం బమోఘంబు గావున నొక యవయవంబు నిచ్చి తప్పించుకొనుమనఁగ నొక్క నేత్రం బా యిషీకమున కాహుతిఁగా నిచ్చి చనియె.

జటాయువు:—పురాణప్రసిద్ధమగు పక్షి - శ్వేనికిని, అనూరునకును బుత్రుఁడు - రాక్షసేశ్వరుఁడైన రావణుఁడు సీతను లంకకుఁ గొనిపోవుచుండఁగా మార్గమధ్యంబున వాని నెదిర్చి వానితోఁ బవరంబుసలిపి, పక్షములు గోలుపోయి ధరణింబడి ప్రాణావశిష్టుఁడై యుండెను. అట్టితఱి లక్ష్మణసహితుఁడై సీతను వెదకి నరుదెంచిన శ్రీరామునకు సీతావృత్తాంతం బెఱింగించి విగతప్రాణుఁ డయ్యె. ఆమృతకళేబరమును జితిపైఁబెట్టి శ్రీరాముఁడే దహనసంస్కారము గావించి ఋశ్యమూకంబునకుం జనియె.

సంపాతి:—జటాయుని యన్న - సుగ్రీవ నియోగంబున సీతా
న్వేషణార్థంబు వెడలిన వానరులదేవి నెఱుంగం గానక
సుగ్రీవునాజ్ఞకు వెఱచి ప్రాయోపవిష్టులై యుండిరి -
వారి సంభాషణమువలన నిజ భ్రాతృవధంబు విని
వారల కితఁడు రావణుఁడు సీతం గొనిపోయినవృత్తాం
తంబుఁ దెలియఁ జెప్పె.

సుమంత్రుఁడు:—దశరథుని యొక్క యష్టమంత్రులలోఁ బ్రధా
నుఁడు.

వసిష్ఠుఁడు:—ఆర్యులచే నిత్యులని సమ్మతింపఁబడు సప్తర్షులలో
నొకఁడు - ఇక్ష్వాకు వంశమునకుఁ బురోహితుఁడు.

వాలి:—కిష్కింధాదేశపు రాజు - శ్రీరాములవారిచేఁ జంపఁ
బడెను.

సుగ్రీవుఁడు:—ఇతఁడు తన యన్నయగు వాలి యనంతరమునఁ
గిష్కింధ నేలిన ప్రభువు.

హనుమంతుఁడు:—వాయుపుత్రుఁడు - సుగ్రీవుని మంత్రి -
మిగుల విద్వాంసుఁడు - బుద్ధిమంతుఁడు - రామాయణ
కథాపురుషులలోఁ బ్రధానుఁడు.

జాంబవంతుఁడు:—సుగ్రీవుని సైనికవీరులలో వృద్ధు.

నీలుఁడు:—సేనాధిపతి.

సుషేణుఁడు:—భిషగ్వరుఁడు.

రావణుఁడు:—లంకా రాజ్యమునకుఁ బ్రభువు - బహుపరాక్రమవంతుఁడు - పరస్త్రీలోలుఁడు.

కుంభకర్ణుఁడు:—ఇతఁడు రావణాదిసోదరులు ముగ్గురిలో రెండవవాఁడు - బలపరాక్రమములు గలవాఁడు - అతినిద్ర గలవాఁడు - రావణుని పనుపున యుద్ధమున కేగి శ్రీరాముని చే సంహరింపఁ బడెను.

విభీషణుఁడు:—రావణుని తమ్ముఁడు - పరమభక్తుఁడు - శ్రీరాములవారివలన లంకారాజ్యమున నభిషిక్తుఁడాయెను.

మండోదరి:—రావణుని పట్టమహిషి.

ఇంద్రజిత్తు:—మండోదరి పుత్రుఁడు - యువరాజు - యుద్ధమున లక్ష్మణునిచేఁ జంపఁబడెను.

సరమ:—విభీషణుని భార్య - అధైర్యచిత్తయై, తీవ్రమనోవేదనను బొందుచున్న సీతకు సత్యబుద్ధితో భయనివారణంబుఁగావింప సాయపడిన మృదుల హృదయ.

త్రిజట:—జనకతనయ లంకలోనున్నప్పుడద్దేవికి రావణునివలనఁ గలుగనున్న యపాయంబు నుపాయంబునఁ దప్పించి యాయమ కింతంతనరాని మహోపకారమ్మొనరించిన పరమపుణ్య - ఈమెయే విభీషణుని పుత్రి.

శ్రీరస్తు.

# ఇష్టదేవతాగురుప్రార్థనము.

శా. శ్రీయున్ ధీయును భుక్తిముక్తులును జే
సేతన్ లభింపంగ నేఁ
జేయంబూనితి భక్తకోటికిల ని
శ్చింతన్ గడున్ భక్తి మీ
రేయుక్తుల్ పచరింపఁబోక కొనిరం
డీ పైఁడి టంకంబు లం
చీ యుర్విం గలవారిఁ బిల్చు వృషశై
లేశున్ మదిం గొల్చెదన్.

క. అని శ్రీనివాసు భక్తిం
గొనియాడి గురున్ భజించి ♦ కోవిదకోటిన్
వినయము తోడుత మ్రొక్కియుఁ
జనఁగ మదీయాన్వయంబు ♦ సరణి నుడివెదన్.

---

## కృతికర్తృ వంశానుక్రమణిక.

క. శ్రీమత్పురుషోత్తమ పద
తామరసోద్భవులనంగఁ ♦ దనరిన సాంద్ర
స్తోమమున నాదివెలమలు
తామయ నయవిద్యలందుఁ ♦ దనరిరి ప్రభులై.

తే. వారిలోపల నయినాల ♦ వంశవార్ధి
చంద్రుఁ డుపమితభోగదే ♦ వేంద్రుఁ డతుల
యశము వహియించి నారాయ ♦ ణాంశజాతుఁ
డనఁగ నారాయణయ్య నా ♦ యఁడు సెలంగె.

క. అతనికి నాల్గు బుజాలన
సుతు లుదయము నొందిరతుల ♦ సూనృత వాణీ
పతులై వారల లోపల
నతభృత్యుఁడు రామకృష్ణ ♦ నాయఁడు వెలసెన్.

క. రామపదార్చితుఁడగు నా
ధీమంతుఁడు గనియె సుతుల ♦ ధృతిమంతుల శ్రీ
రామస్వామిని, లక్ష్మణ
నాముని, నరసింహు వైరి ♦ నాగనృసింహున్.

ఆ. అందు నగ్రజాతుఁ ♦ డతుల గుణోపేతుఁ
డార్యవర్తనుండు ♦ ధైర్యవిజిత
శైలరాజు రామ ♦ సామినాయఁడు రఘు
రామభక్తిపరుఁడు ♦ శ్రీమహితుఁడు.

తే. అతని తమ్ముఁడు లక్ష్మయ్య ♦ యతిసుశీల
నార్య ననురూప గుణరూప ♦ నర్థిఁ బెండ్లి
యయ్యె రామానుజమ్మ నా ♦ నలరు సాధ్వి
నర్థితనుజాతఁ బుండరీ ♦ కాక్షునట్లు.

క. ఆబంధు కల్పకంబుల
కాబలివిధ్వంసి కశ్య ♦ పాత్మజుఁడైన
ట్లే బాపనయ్య నాయఁడు
ధీబలముల్ వెలయఁ బుట్టె ♦ ధిషణాసముఁడునై.

తే. అతఁడు రామానుజమ్మయన్ ♦ సతి వరించె
ధరణి రామానుజుండు వై ♦ దర్భిఁ బోలెఁ

గలిమిబలుములఁ దనబోలు ♦ ఘనులయింటఁ
బుట్టి చెలువొందునట్టి పూఁ ♦ బోఁడి నరి.

క. ఆదంపతు లతుల మనో
మోదంబున శిష్టజనులు ♦ మోదింప ధృతిన్
శ్రీదయితుని వేంకటశై
లోదవసితు వేంకటేశు ♦ నొగిసేవింపన్.

క. సంకటములఁ బాపంగల
వేంకటశైలేశు కరుణ ♦ వెలయఁగనిరి వా
ర్వేంకటసామియు, లక్ష్మ
య్యాంకుండును, రామసామి ♦ యను నందనులన్.

క. వారలయం దగ్రజుఁడను
దారదయాశరథి వృషభ ♦ ధరనిలయుని స
త్కారుణ్యంబునఁ గవితా
ధోరణి మొక్కింతయొదవఁ ♦ దొడఁగి కవితకున్.

క. ధర శ్రీరామనృపాలుని
చరితం బనిశంబు నియతిఁ ♦ జదివెడు వారల్
సరిసరి యన నొనరించెద
గరిమం గైకొనుఁడు కరుణఁ ♦ గవివరులారా.

తే. తప్పు లెన్నైనియుండు నిం ♦ దొప్పుఁజూడ
బాలభాషితమదిగదా ♦ లాలితంబు
బాలునన్ గృపమన్నించి ♦ పాలుగొని జ
లంబు దొలఁపరె విబుధ హం ♦ సంబులారా.

# విషయసూచిక.


| విషయము. | | | పుట. |
|---|---|---|---|
| **బాలకాండము.** | | | |
| కథాప్రారంభము | ... | ... | 2 |
| దశరథుఁడు పుత్త్రకామేష్టి సలుపుట | ... | ... | ,, |
| రావణ కుంభకర్ణాదుల జననము | | | 7 |
| [illegible] | | | 9 |
| రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నుల జననము | | ... | 15 |
| విశ్వామిత్రుఁడు దశరథుని యెడకేతెంచుట | | ... | 17 |
| విశ్వామిత్రుఁడు క్రతురక్షణార్థమై రాముని దనకొసంగఁ గోరుట | | ... | 18 |
| దశరథుఁడు క్రతురక్షకై రామలక్ష్మణులం బంచుట | | | 21 |
| రామలక్ష్మణులు విశ్వామిత్రునివెంటఁ జనుట | | ... | 22 |
| రాముఁడు తాటకను సంహరించుట | ... | ... | ,, |
| అహల్య శాపవిముక్త యగుట | ... | ... | 27 |
| రాముఁడు శివధనువు భగ్నము సేయుట | | ... | 32 |
| సీతాకల్యాణ మహోత్సవము | ... | ... | 35 |
| శ్రీరాముఁడు పరశురాముని జయించుట | | ... | 39 |

విషయము. | పుట.

## అయోధ్యాకాండము.

శ్రీరామ పట్టాభిషేక ప్రయత్నము ... ... 42
కైకేయి దశరథుని వరద్వయం బడుగుట ... 46
సీతారామలక్ష్మణుల వనవాసము ... ... 48
శ్రీరాముఁడు చిత్రకూటమున కరుగుట ... ... 51
దశరథుఁడు స్వర్గస్థుఁడగుట ... ... 53
భరతుఁడు రామాశ్రమంబుఁ గనుంగొనుట ... 58
పాదుకాపట్టాభిషేకము ... ... 60

## అరణ్యకాండము.

సీతారామలక్ష్మణులు శరభంగుని సందర్శించుట ... 62
విరాధుని వధ ... ... 64
రాముఁ డగస్త్యమహర్షిని సందర్శించుట ... ... 65
శూర్పణఖ వృత్తాంతము ... ... 67
ఖరదూషణులు యుద్ధసన్నద్ధులై వెడలుట ... ... 69
శూర్పణఖ లంకాపురంబునకుఁ బోవుట ... ... 70
రావణుఁడు మారీచుని దనకు సహాయుని గమ్మనుట 72
జటాయువు రావణునితో యుద్ధముసేయుట ... 80
శ్రీరాముఁడు కబంధుని వధించుట ... ... 87
శబరిని దర్శించుట ... ... 89

విషయము. | పుట

## కిష్కింధాకాండము.


| | | |
|---|---|---|
| హనుమంతుఁడు రామలక్ష్మణుల సందర్శించుట | ... | 91 |
| శ్రీరామ సుగ్రీవుల సఖ్యము | ... ... | 93 |
| వాలి రామబాణపీడితుఁడై నేలంబడుట... | ... | 95 |
| సుగ్రీవుని పట్టాభిషేకము | ... ... | 98 |
| హనుమదాదులను దక్షిణదిక్కునకుఁ బంపుట | ... | 101 |
| అంగదాదులు సంపాతిం గాంచుట | ... ... | 103 |


## సుందరకాండము.


| | | |
|---|---|---|
| హనుమంతుఁడు లంకకుఁబోవుటకు నుద్యుక్తుఁడగుట | | 110 |
| హనుమంతుఁ డశోకవనమందు సీతం జూచుట | ... | 112 |
| హనుమంతుఁడు రామువృత్తాంతము సీతకుఁజెప్పుట | | 120 |
| అశోకవనభంగము | ... ... | 124 |
| హనుమంతుఁడు మరల సముద్రమునుదాఁటి అంగదాదులం గలసికొనుట | ... | 128 |
| హనుమంతుఁడు సీతావృత్తాంతము రామునకుఁ జెప్పుట | | 129 |
| రాముఁడు సేతుబంధనము గావించుట | ... ... | 131 |


## యుద్ధకాండము.


| | | |
|---|---|---|
| విభీషణుఁడు రాముని శరణు జొచ్చుట | ... ... | 133 |
| రాముఁడు లంకాపట్టణంబుఁ జొచ్చుట | ... ... | 136 |

విషయము. పుట.

రామలక్ష్మణులు మూర్ఛిల్లుట ... ... 140

లక్ష్మణుఁడు మూర్ఛదేఱుట ... ... 142

రామరావణయుద్ధము ... ... ,,

రావణుఁడు నిహతుఁడగుట ... ... 144

మండోదరి రావణునిఁజూచి దుఃఖించుట ... ... 145

రాముఁడు విభీషణుని లంకారాజ్యపట్టాభిషిక్తునిఁ జేయుట 147

రాముఁడు సీతను దనసన్నిధికిఁ బిలిపించుట ... ... 148

సీత యగ్నిప్రవేశము సేయుట ... ... 149

బ్రహ్మాదులు శ్రీరాముని నుతించుట ... ... 152

రాముఁడు నందిగ్రామమున కేగుట ... ... 154

హనుమంతుఁడు భరతునకు రామాగమనంబుఁ జెప్పుట. 155

రాముఁ డయోధ్యఁ బ్రవేశించుట ... ... 157

శ్రీరామచంద్రుని పట్టాభిషేకము ... ... 158

శ్రీరస్తు.

శ్రీ వేంకటరమణ పరబ్రహ్మణేనమః.

# శ్రీరామకథామృతము.



శా. శ్రీరామా! సుగుణాభిరామ! త్రిజగత్
క్షేమంకరా! భక్తమం
దారా! దాశరథీ! కృపాజలనిధీ!
దైత్యారి! సీతాపతీ!
ఘోరాఘౌఘలతాలవిత్ర! వరదా!
గోవింద! భక్తప్రియా!
క్షీరాంభోధిశయాన! మమ్మొగిని ర
క్షింపంగదే ప్రీతిమై.

## బాలకాండము.

శ్రీసీతారాములకు సమర్పితంబుగా నారచియింపం బూనిన "శ్రీరామకథామృతంబను" పురాణపుణ్యకథావిశేషంబునకుం గథాక్రమం బెట్టిదనిన.

## క థా ప్రా ర ం భ ము.

పరమపావనియగు నీ భూదేవికిఁ దిలకాయమానంబగు కోసలదేశంబున సకల సంపత్సంతానంబునకు సంతానంబై, యిక్ష్వాకువంశంబునకు నాకరంబై, యీడులేని చక్కని మేడలతోఁ నొప్పారు నయోధ్యాపురవరం బొండలరారుచుండు. అప్పురంబునంగల సర్వమానవులును దీర్ఘాయుష్మంతులై, కళత్రవంతులై, పుత్రపౌత్రసహితులై, సత్యధర్మరతులై వఱలుచుందురు. అప్పీట నజమహారాజతనయుండగు దశరథుఁడను ధారుణీకాంతుండుండె. ఆతనికిఁ "కౌసల్య" "సుమిత్ర" "కైకేయి" నాఁబరఁగు ముగ్గురు గుణవతులగు సతులుండిరి. అమ్మహారాజశేఖరుండు బాల్యంబున నిఖలశాస్త్రంబులను జక్కఁగాఁ బఠించి బుద్ధివైభవంబున నసమానుండై యస్త్ర, శస్త్రవిద్యలను గ్రహించి శ్రీమంతుండును, ధర్మరతుండును, త్రిలోకవిశ్రుతుండును, బరాక్రమవంతుండునై యనేకరాజ్యంబులను దనయేలుబడికి లోఁబఱచుకొని చారముఖంబున స్వపరరాష్ట్రకృత్యంబులెఱింగి ధర్మంబునఁ బ్రజల రక్షించుచుఁ బరితాపనిహతకంటకుండై యేకచ్ఛత్రాధిపతిగాఁ బ్రభుత్వంబు సాగించుచుండె.

## దశరథుఁడు పుత్రకామేష్టి సలుపుట.

ఇవ్విధంబున సకలజనానురాగంబుగ రాజ్యంబు నిరంతరపూజ్యంబై తనరారుచుండఁ బెద్దకాలంబు చనుటయుఁ

బురాకృతకర్మవశమ్మున ననపత్యుండగుటం జేసి దశరథుం డత్యంత చింతాక్రాంతస్వాంతుండయి బహుప్రకారంబులం దలపోసి

ఆ. వె. వైభవంబులున్న ♦ వలపె చ్చుసతులున్న
మేడలున్నఁ బెద్ద ♦ మిద్దెలున్నఁ
దగినవసతులున్న ♦ ధనరాసులున్నను
గొడుకులేకయుంట ♦ కొసవకాదె!

కావునఁ బుత్రుఁడు లేని విభవంబులేల యని నిర్వే దించి సంతానార్థంబు నిరంతరము దైవమును బ్రార్థించుచు, నానావిధపూజలు గావించుచుఁ జిత్తమునఁ బుత్రకామేష్టి యను యాగంబుఁ గావింప నుద్యుక్తుండై యొకనాఁ డష్టిపేటఁ గల వేదపారగులైన సుయజ్ఞ, వామదేవ, జాబాలి, కాశ్య పాదిమహామునిపుంగవులను, బ్రాహ్మణోత్తములను రావించి నిండోలగంబున నాలోచింప సభామంటపస్థిత జనులంద రేక వాక్యంబున నవ్వసుంధరాధిపు మనోరథంబుఁ జేకూర్ప నియ్య కొనిరి.

అంత మంత్రిపుంగవుండగు సుమంత్రుండు నృపాలుని యంతికంబుఁ జేరి వినయ మలరఁ గేల్దోయిమోడ్చి యిట్లనియె. "రాజేంద్రా! మీరాత్మఁదలంచిన యర్థంబు సాధించుట కొక యంశంబు నెఱింగింతు నాకర్ణింపుఁడు. దాన భవదీయ సంశయ

నివృత్తి యయ్యెడు. పూర్వ మొకప్పుడు సనత్కుమార మహాని వర్యుఁడు మీఁదు నందను లుదయించుటను గూర్చి మునిసభా మధ్యమం దిట్లు నుడివియున్నాఁడు. అంగదేశమును రోమపాదుండను భూమీశుం డేలఁగలఁడు. అధర్మపరిపాలనంబుచే నతని రాష్ట్రంబునఁ బెక్కు వత్సరంబులనావృష్టి కలుగఁ గలదు. దాన నయ్యనంతా కాంతుఁడు దురంతసంతాపాధీనమానసుండయి కర్తవ్యమును నిర్ణయించుటకుఁ బురమునందలి మహో తపఃప్రభావిభాసురులగు భూసురులను రావించి కొలువుఁదీర్చి యాలోచించును. అంత వారందఱు నద్ధరారమణునిం జూచి యాతని రాజ్యంబునం దట్టి కాలవిపర్యాసంబు సంభవించుట కధర్మమే ముఖ్యకారణమనియుఁ దన్నివారణార్థంబు నవయౌవనహాసలావణ్యాతిశయాభిరామయగు కాంతాలలామంబు నొకర్తుకను విమలాంబరాభరణశోభితం గావించి రజతపాత్రికులయందు బహువిధ భోజనపదార్థముల నునిచి విభాండక మునిపుత్త్రుఁడగు ఋశ్యశృంగమహర్షి చెంత కనిపిన మూర్తీభవించిన బ్రహ్మచర్యమ్ము నాఁగ్రాలు నమ్మునిపుంగవు నయ్యాలినీలకుంతల తన సహజసౌందర్య వాగ్విలాసముల నల్లన వశ కఱుచుకొని పురంబునకుఁ దోడ్తేరఁ గలదనియు, దానం జేసి యాతని రాష్ట్రంబున ధర్మవిప్లవంబు దొలంగుననియుఁ జెప్ప నయ్యవనీశ్వరోత్తముండు సంతోషతరంగితాంతరంగుండై రూపయౌవనసంపన్నయుఁ గడు నేర్పరియు నగు నొక వేశ్యాంగనం బిలువంబంచి తా నేర్చిన విధంబున ఋశ్యశృంగుం బ్రబోధించి

యిచ్చుటకుం దోడ్కొని రమ్మని నియోగించు. అంత నలం
కృతయై యయ్యంగన యొయ్యన నమ్మహర్షి యాశ్రమంబు
నకు మెఱుంగారు సోయగంబునం దద్దయుం గ్రాలుచుం జని,

తే. గీ. సంతసంబున మౌనికుం ♦ జరుని గాంచి
తాను దెచ్చిన బహుపదా ♦ ర్థంబులెల్ల
వాని సన్నిధినుంచి వై ♦ భవమెలర్ప
సరగఁ జాగిలి మ్రొక్కి హ ♦ స్తములు మొగిచి.

యమ్మునిమౌళి నిలిచిన నతండమ్ముగ్ధాంగనం గాంచి సంభ్రమంబునం దాపసియనుతలంపునం బ్రత్యుత్థానం బొనర్చి యాతిథ్యంబొసంగి దోడ్తెచ్చి ఉచితాసనమర్పించి సత్కరించు. వెండియు నాతండింతకుమున్నెన్నఁడును జవిచూచియెఱుంగని యమృతోపమానంబులగు సద్ద్రవ్యభక్ష్యంబుల గ్రహించి రతి దేవికిం బ్రతిరూపమైన యయ్యంగనామణిచే వంచింపఁబడి తదీయాశ్రమంబుం జూడ నుద్యుక్తుండై యవ్వెలయాలి పిఱుం దనచని తన్నగరప్రవేశంబుఁ గావించు. అమ్మౌనిచంద్రు నాగమనంబునం జేసి యఖిలప్రజలకు ననురాగమతిశయిల్లె. రాజ్యమునఁ బాపం బడంగె.

కం. వానలు గురియు సమిత్తమై
మానుగ సస్యములు పండు ♦ మహినెల్లెడలన్
బూనినఁ గరువెడఁబాయును
దాన ననావృష్టిదోష ♦ తతియు నడంగున్.

అట్లగుటం జేసి యదియాతయు నమ్మహర్షిసత్తముని మాహాత్మ్యంబని భూవిభుం డెఱింగి, యుదంచితముదంబెదం గనుక నెదురేగి సర్వాంగాలింగితమహీతలుండగుచు నమస్కారంబుఁ జేసి "మునివర్యా! భవదీయాగమనంబునం జేసి యేను కృతార్థుండనైతి. మహాభీలంబులగు ఝంఝానిలంబులం దూలు తూలజాలంబులుంబోలె మద్దురితంబులు నిర్మూలంబయ్యె. మదీయపురాకృత సుకృతపరిపాకం బెంతని వర్ణింతునని" ఆతని నర్ఘ్యపాద్యాది సత్కారంబులం దనియం జేసి మందిరమునకుం దోడ్తెచ్చి యున్నతాసనంబున సుఖాసీనుం గావించి రాజభవనం బంతయు నూతనపల్లవ కుసుమతోరణావళుల చేతను, చిత్రాంబర వితానంబుల చేతను విలాసంబుగా నలంకరింపించి, పురోహిత నియమిత సుముహూర్తంబున నాతనికిఁ దన ప్రియపుం దనయయైన "శాంత" నొసంగి యత్యంతవైభవంబునం బరిణయ మహోత్సవంబుఁ గావించి పురంబున నునిచికొను ఇట్లమ్ముని సత్తముండు శాంతావశంగత మానసుండై యంగపతి గృహంబున నభీష్టవినోదంబులం దేలుచుండు."

కావున నట్టి మహిమాఢ్యుండగు ఋశ్యశృంగమహర్షి నీకముందు దశరథమహేంద్రుండు పుత్రార్థియై తన పురంబుకుం గొనిచని యజ్ఞంబుసలిపి వీర్యవిక్రమ సంపన్నులగు నల్వురు పుత్రులంబడయఁగలఁడు. అని మున్ను నేవిన్న చందంబెల్ల సంక్షేపంబుగా మీ కెఱుకపడఁ జెప్పితినని పలికి, వెండియు

నిట్లనియె. "భూపాలతిలకా! మీ మనమ్మున లేశమ్మును నుమ్మలికమ్మునొందవలదు. మీరు తప్పక పుత్రచతుష్టయము వడయుదురు. కావున శీఘ్రమ్మున నమ్మహర్షిసత్తము నియ్యెడ కుంగొని తెచ్చి క్రతువొనరింపవలయునని" పలికినవిని దశరథుం డయ్యమాత్య శేఖరు మృదుమధురాలాపంబులకు నాహ్లాదపయోనిధినోలలాడుచు మనంబున నమ్మునీంద్రుని మాహాత్మ్యంబు మెచ్చుకొనుచుం దోడనయాతనింగొనితెచ్చి వివిధ సత్కారంబులం బూజించె. పదంపడి సభాసదులకెల్ల ననుమోదన ముల్లాసంబు వెల్లడించి సంతానార్థంబు మఖంబు వేదోక్తమ ప్రకారంబున నిర్వర్తింపం దలంచి యాగశాల నేర్పఱిచి దానికి వలయు పరికరంబుల సేకరించి యాగదీక్షాయుక్తుండై కులగురుప్రముఖుండగు వసిష్ఠు ననుజ్ఞఁగొని వీతిహోత్రుని యందు మంత్రంబులతో హోమంబు సేయం దొడంగెను.

## రావణ కుంభకర్ణాదుల జననము.

తపోవిరాజమానుండగు పులస్త్యబ్రహ్మకు విశ్రవసుం డను సుతుండొక్కరుండు గలండు. ఆవిశ్రవసునకుం గైకసియను భార్యవలన రావణుండు, కుంభకర్ణుండు, విభీషణుండు నను మువ్వురు కొడుకులు జనియించిరి. అందు మహాబలుండగు కుంభకర్ణుం డాకసమునకు వ్యాపించిన శరీరముతోఁ బుట్టి క్షుధార్తుండై నిరపరాధులగు ప్రజలనుబట్టి మ్రింగుచు, సురలను సయితము నానావిధ యాతనలపాలొనరించుచు, సాధు

జనులొనరించు జన్నంబులకు బన్నంబు గల్పించుచు లోకంబునకు భయోద్రేకంబుఁ గల్గించుచు సందటకు గర్భ నిర్భేదకముగ విహరించుచుండెను. ఇవ్విధంబుగ దినదినంబును హెచ్చు పెరుఁగు నీరక్కసుని దుండగంబులు సహింపనోల్లక సర్వభూతంబులు భయకంపితములై శంకరుని శరణంబునొంది రాక్షసకృత్యంబెఱింగించిన నతండు కోపించి "ఈ మహాపాతకుండెల్లప్పుడును బుడమిని శవాకారమునఁ బరుండుఁగాక" యని శపియించె. ఈ శాపవచనంబు లాకర్ణించి యతండెంతయు వంతఁజెంది యట్టి దారుణశాపంబునకు వెఱచి యాశాపవిమోచనార్థంబు జలజాసనుంగూర్చి ప్రార్థించె. అంతనాతఁడతికరుణాళువుగాన శాపంబుఁ గ్రమ్మఱింపందలంచి యాఱు మాసముల కొక్కనాఁడు మేల్కని యెందైనను విహరించునట్లనుగ్రహించి యంతర్హితుండయ్యె. ఇట్లు చేయకుండినచో నాతఁడీ ప్రపంచంబునంతయు మ్రింగకుండునా!

విభీషణుఁ డసురుండయ్యు శాంతుండును, వివేకియు నగుటచే దుష్కృత్యములం బాసి, సన్మార్గమునఁ బ్రవర్తిల్లుచు బుద్ధిశాలియై యుండెను. అతఁడు బ్రహ్మ నుద్దేశించి చిరకాలంబు నిర్భర తపంబు సేసి, తన దివ్యతపఃప్రభావవిశేషంబున వారిజాసను నలరించి యనవరతముఁ దనకు దైవభక్తి యుండునట్లు వరంబును గోరి దానిం బడసెను. ఇతఁడు పరమ భక్తుఁడు, శాంతుఁడు, మహారాజనీతిజ్ఞుఁడు.

## రావణుఁడు బ్రహ్మను నుతించుట.

దనుజవంశ శ్రేష్ఠుండగు దశగ్రీవుండు బ్రహ్మను గూర్చి పెక్కు సంవత్సరంబు లప్రతిహత నియమంబున నతి ఘోరంబైన తపం బాచరించుచు, వేయి వత్సరముల కొక మాఱు తన మస్తకములయం దొక్కొక్క దానిని ఖండించి వహ్నికుండమున వ్రేల్చుచుండెను. ఇట్లు చేయుచుఁ దన పది యవశిరంబును దుంప సమకట్టిన తఱి భారతీసుందరీముఖ సారవింద భాస్వంతుండగు నా హిరణ్యగర్భుఁడు ప్రత్యక్షుండై, "అసురాధీశా! ఏను భవదీయంబగు తపంబునకు నిచ్చమెచ్చి వచ్చితి, నిచ్చలు నిచ్చమెచ్చువరం బిచ్చెద. నిశ్శంకమొయి నీయిచ్చఁ దెలుపుము. అనవుడు నద్దశముఖుం డయ్యరవింద గర్భుని వచనంబుల కలరి తపంబు చాలించి యంజలి గీలించి "దేవాదిదేవా! నాయందుఁ గరుణించి హీనబలులగు మను ష్యులవలనం దక్కఁ దక్కిన సమస్తభూతంబులవలనను నాకు మరణంబు లేకుండునట్లు వరంబు బ్రసాదింపుమని" యభ్యర్థించిన నప్పరమేష్ఠి యట్లనుగ్రహించి యంతర్ధానంబు నొందె. అద్దైతేయవల్లభుండు సంతుష్టాంతరంగుండై యంతను దనకు మృత్యుభయంబు లేదనియుఁ దన్నిఁక ముజ్జగంబుల జయించు వారెవరును లేరనియు నిర్భయుండై దుర్వారగర్వాతిరేకంబున నెవ్వరిని సరకు గొనకుండెను. ఒకప్పు డాతఁడు కుబేరుని మీఁదికిఁ బోరికిఁ గడంగి నిరంకుశ ప్రతాపంబున వానిం

బొడిచి గెలిచి మాఱులేక వాని యునికిపట్టగు లంకాపట్ట ణము నెట్టనకైకొని వాని పుష్పకం బపహరించి పరమానంద భరితస్వాంతుఁడయి పెక్కు రక్కసులతో నయ్యెడ వసియించు చుండెను.

అట్లు లోకవిద్రావణుండును, నిర్జిత నిర్జరేశ్వరుండునగు నారావణేశ్వరుఁ డొకప్పుడు దేవతలను జయింప నిచ్ఛగలిగి దుర్వారప్రతాపమున నింద్రాదిదిక్పతులను జయించి యిఁకఁ దనకెదురు లేదని పరమానందంబునఁ బరమశివుని జయింప నుత్సుకుఁడై కైలాసగిరికరిగి తనయిరువది భుజంబులతో నప్పర్వతమును గందుకము భాతి నూఁపందొడంగె. అంత నప్పరమేశ్వరుండు వాని గర్వాతిశయం బడంప నెంచి తన పదాంగుష్ఠంబున నగ్గిరిరాజంబు నణంచె. అయ్యవసరంబున నద్దశకంఠు కరంబు లా వెండికొండ క్రిందఁజిక్కి వ్రయ్యలయ్యె. దాన నద్దానవేంద్రుండు మిగుల భీతిఁజెంది తప్పించుకొను వెరవుగానక తాను మేటిగాయకుండగు కతన నెట్టులైనం దనగాన విద్యాకౌశలం బెఱింగింపఁ దలపెట్టి సామవేదసంప్రదాయమున సాటిలేని నీటునం బాటి కెక్కు ధాటి నప్పరమేశుని సంస్తుతించె. పార్వతీపతియు సామగానప్రియుఁడగుటం జేసి తత్సంకీర్తన శ్రవణంబున మహానందంబునొంది ప్రసన్నుండై "దానవేంద్రా! నీ వొనరించినస్తుతికి నాత్మ నలరితిఁగాని యీ విషయమున నేను కొంచెము చెప్పఁదలఁచితిని. ఆలింపుము. నీవు నీయెదిరి నెఱుం

గక భుజదర్పంబున మదాంధుండవయిన కతన నిట్టియిక్కట్టుల పాలయితివి. కావున గర్వంబుదక్కి ఇట్టి దుడుకుచేతల నాచరింపక సన్మార్గమునఁబొమ్ము. ఇపుడు నీయాచరించిన వ్యతిక్రమమును క్షమించితిని. కావున సుఖముగ బ్రదుకవలతేని నేఁడు మొదలుగా నీ ధరాధరవర పరిసరంబునకు రాకుము. నీవిట్టి జెట్టి పనుల నాచరింపకుమని" మందలించి "నీ భుజంబు లెన్ని తడవలు ఖండింపఁబడినను నవి మగిడిపుట్టుచుండును గాక! యని" యనుగ్రహించి యాంతర్హితుండయ్యె. అద్దనుజ కంఠీరవుఁడును సంప్రాప్త మనోరథుఁడై పరమాహ్లాదముం బొంది నిజనివాసంబునకుం జనియె.

అట్లు చని యతండు హిరణ్యగర్భవరదాన గర్వంబున నుద్వృత్తుండై సాధువులఁ జంపుట, యవమానించుట, చెఱ పట్టుట లోనగు దుష్కార్యములఁ జేయ జంకుపడకుండెను. ఆతం డవ్విధంబుగ నక్కటికంబు దక్కి పెక్కుగతులం బఱచు బాములచే మిక్కిలి స్రుక్కి మిక్కుటంబగు వేదనాభరంబు సైపం జాలక మిక్కిలి ఘోక్కుచు మందీభూత కిరణుండై యినుండును, మహానసక్రియలందవిలి యగ్ని దేవుండును, కింకరత్వమునొంది తక్కటిదేవతలును వాని నగరంబునందుండిరి. ఈ దుండగీఁడు కామవ్యసనంబునఁ బాపంబని తలంపక యివ్వసుంధరంగల నిరపరాధలగు పుణ్యాంగనల బల్మిం జెఱఁబట్టుచు నిద్యాతపోయుక్తులై ధర్మచరితులైన బ్రాహ్మణులను హింసిం

చుచు నిర్దయుఁడై నిర్దోషులైన విష్ణుభక్తులను వధియించుచు, ధర్మకోవిదులైన మునులను బాధించుచు, జన్నంబులకు బన్నంబుఁ గల్పించుచు, దుష్టచేష్టితంబుల గుప్పించుచు, శిష్టజనపరాభవకృత్యం బత్యంతహితంబుగ నొనరించుచుఁ గీడు నాపాదించుచుండెను. అక్కాలంబున పాపవృద్ధియగుడు లోకంబునకు క్షేమంబుఁ గోరి భూదేవి భూభారంబు వహియింపఁజాలక గోరూపధారిణియై బ్రహ్మలోకంబున కరిగి దేవతలకు నిజాగమనప్రయోజనం బెఱింగించె. గోరూపయైన భూదేవిని వారలు స్వయంప్రకాశంబగు సత్యలోకంబునకుం గొంపోయిరి. అందప్పుడు ప్రసన్నతాచతురాననుండైన చతురాననుం డప్రతర్క్యమహిమంబునఁ దేజరిల్లుచుఁ గూర్చుండియుండ వారికి దేవతలు తమ పడుచున్న కష్టములను మొరపెట్టుకొనిరి. వారి కష్టముల వారించువాఁ డాపరాత్పరుఁడని యెఱింగి వారలం దోడ్కొని నిఖిలానందభోగభాగ్యానుభవాకుంఠితంబైన వైకుంఠనగరంబునకుఁ జని మ్రొక్కి యద్దనుజేంద్రుదౌష్ట్యమును గూర్చి యాతనికి సర్వంబును నెఱింగించిరి. అంత నాసుదర్శనధరుండు లోకంబుల శోకోద్రేకంబు నివారింపం దలంచి పురందరాది బృందారకులం గలయ నవలోకించి, "దేవతలారా! అద్దైతేయ వల్లభుని మనుష్యావతారంబునం గాని తక్కిన యవతారములచేత వధింప వలనుపడదు. కావున నిపుడు సకల పురుషార్థసాధన

క్రియానుష్ఠాన శ్రీకరంబగు భూలోకంబున దశరథ మేదినీధవుఁడు పరిశుద్ధంబగు నధ్వరంబు సలుప నుపక్రమించుచున్న వాఁడు. నే నాతనికిఁ బుత్రుండనై యవని నవతరించి నిఖిలలోకహితార్థంబుగా సకల ఘాతభయంకరుఁడగు రావణుని సంగ్రామరంగంబునం బరిమార్చి తక్కటి కడింది రక్కసులం దునిమి జగంబున ధర్మసంస్థాపనంబుఁ జేసెద. మీరెల్లరు నాకు సమరంబున సాయంబొనరింప మీమీయంశంబుల వేర్వేఱ వానరులుగఁ బుట్టంగలవారలు. శంకసేయం బనిలేదిఁక భయంబుఁ దక్కియుండుండని" హితంబుపదేశించి యంతర్ధానంబు నొందె. అంత వారలు ప్రమోదంబున నిజావాసంబులకుం జనిరి.

అంత సూర్యాంశముచే "సుగ్రీవుఁడును" ఇంద్రాంశముచే "వాలియు" బ్రహ్మాంశముచే "జాంబవంతుఁడును" వాయునంశచే "హనుమంతుఁడును" మఱియు ననేకులగు తరుచరులుద్భవించి నిఖిల జలధివలయిత మహీమండలంబెల్ల నిండి మెండుకొనియుండిరి. శ్రీమన్నారాయణమూర్తియు దేవతలకుఁ దనచెప్పినచొప్పున ధరాతలంబున మర్త్యరూపమున రామనామమున నవతరించి శిష్టరక్షణంబును, దుష్టశిక్షణంబును సలిపి ధర్మపాలనమ్మొనరింపఁదగుకాలమును నిరీక్షించుచుండెను.

ఇక్కడ నయోధ్యానగరసమీపంబున దశరథమహీరమణుండు వివిధకుసుమఫల భరితంబులైన వృక్షంబులును

విమల వారిపూరంబుల నతిరమ్యంబులు కాసారంబులునుగల యయోధ్యాపుణ్యస్థలంబునందు యజ్ఞశాల నతిరమణీయముగా రచియింపించి శుభదినంబునం బరిశుద్ధుండయి పరిశుద్ధాత్ము లగు మహర్షుల సహాయసంపత్తిని సకలలోకమనోజ్ఞంబగు యజ్ఞంబు సేయుచుండె. ఇట్లభినవవిభవవిశేషంబున నయ్యాగంబు చెలంగుచుండఁ దదీయ హోమకుండంబునందొక దివ్య పురుషుండు దుగ్ధాన్నస్నిగ్ధంబగు హిరణ్మయపాత్రమ్మును దివ్య హస్తమ్మునధరించి ప్రసన్నుఁడయినిలిచి,

కం. భూపాల! నీదుసతులకు
సీపాయస మారగింప ♦ నిచ్చినఁ దనయుల్
శ్రీపతి పుత్రాకారులు
భూపతు లుదయింతురధిక ♦ పూజ్యులుపేర్మిన్.

అనిపలికి దివ్యాన్నసంపూర్ణంబైన కలశంబొసంగి యంతర్హితుండయ్యె. అంత నయ్యనంతాకాంతుండు సంతోష యుక్తుండగుచు యాగమును జాలించి కరగృహీతపాయస పాత్రుండై యతిరయంబున నంతఃపురంబుఁ బ్రవేశించి నిరవధిక హర్షభరంబున నొడలుమఱచి యుంటంజేసి దేవదత్తంబై యమృతోపమానంబైన యమ్మహనీయపాయసాన్నం బిరు పాలుచేసి కౌసల్యకొక్కపాలును, కైకకొక్కపాలును పేర్మి నొసంగి సుమిత్రకిడుటనేమఱియరిగె. అంత నకౌసల్యయుఁ గైకేయియుఁ దమతమ భాగంబులం దర్ధభాగంబుఁ దమ సవతి

యగు సుమిత్రకొసంగుట వారిరువుర కొక్కొక్కపాలును సుమిత్రకిరుపాళ్లునయ్యె. వారలప్పాయసభాగంబుల నన్నిటి నతి ప్రియంబున నిరవశేషంబుగా భుజియించి పరమానంద భరిత హృదయులై యుండిరి.

రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నుల జననము.

దశరథుఁడు పుత్రోదయంబుఁ గాంక్షించుచున్నంతఁ గొంతకాలంబు చనిన యనంతరంబ కౌసల్యా, కైకేయీ, సుమిత్ర లప్పాయసమహిమంబున గర్భంబులు ధరియించి నవమాసంబులు పరిపూర్ణంబైన యనంతరంబ విళంబినామ సంవత్సర చైత్రశుద్ధనవమీ బుధవాసరమున పునర్వసునక్షత్ర యుక్త కర్కాటకలగ్నమందుఁ గౌసల్యయు, తద్దశమీ గురు వాసరమున పుష్యమీనక్షత్రయుక్త మీనలగ్నమందుఁ గైకేయియు, తదేకాదశీ శుక్రవాసరమున నాశ్లేషానక్షత్రమున సుమిత్రయు క్రమముగఁ బుత్రుల నలువురఁ గాంచిరి. అంతనాకసము నిర్మలమై కాలుచుండెను. చల్లని గాలి జగ మెల్ల వీచెను. సకలప్రాణులహృదయములకు నానంద మొదవెను. ఇట్టి సులక్షణ లక్షితంబగు సమయమున అంతఃపుర చారులవలనఁ బుత్రోదయానందవార్త నెఱింగి హర్ష పులకిత గాత్రుఁడయి "ధన్యోఽస్మి, ధన్యోఽస్మి" యనుచు నమితానంద వీచికల నోలలాడుచు రఘుకుల దీపకుండగు దశరథుం డగణ్య

గోహిరణ్యాది మహాదానంబులును, బ్రాహ్మణ సంతర్పణం బులును జేసి యట్లుద్భవించిన కుమారచతుష్టయంబునకుఁ గర్తవ్యంబుపలక్షించి పదిదినంబులు నరిష్టంబు నడపి తత్తత్కాలానురూపగతుల చౌలోపనయనాదులఁ గావించి యిరువదియొకటవ దివసంబున సువ్రతనిష్ఠాగరిష్ఠుఁడగు వసిష్ఠునిచేఁ గౌసల్యకుఁ బుట్టినపట్టికి శ్రీరాముఁ డనియుఁ గైకేయికిఁ బొడమిన కొమరునకు భరతుఁడనియు, సుమిత్ర కుదయించిన పుత్రులకు లక్ష్మణ, శత్రుఘ్నులనియు నామకరణంబుఁ జేయించె. అంత నారాజనందనులు దినదిన ప్రవర్ధమానేందు బింబంబుపగిది నానాఁటి కభివృద్ధిఁ జెంది శైశవక్రీడలచేఁ దలిదండ్రుల కెంతయు నింపునింపుచుండిరి. ఇట్లుండఁ గాలక్రమంబున వారికి విద్యాభ్యాసతరుణం బాసన్నంబయ్యె. అగుటయు దశరథుఁడు వారలకు గురువులవలన విద్యాప్రవీణులగు నట్లొనర్చి, గజాశ్వరథారోహణకలాఢ్యులుగను, ధనుర్నిగమ విద్యాపారంగతులుగను, గావించి మిక్కిలి మక్కువతో నెక్కువ గారాబంబునఁ బెరుచుచుండె. వారును సకలగుణంబుల కాటపట్టులై సుగుణవంతులగు బాలురతోడఁ గూడి బాల్యక్రీడలఁ జలుపుచుండిరి. ఇట్లుండ నొకానొక దినంబున రామచంద్రుండు కందుక క్రీడాపరుఁడై యుండుకతో నాటాడుచున్న సమయంబునఁ గైకేయీ పరిచారిక "మంథర" యను నాతి యడ్డంబురా నబ్బాలుఁడు నేతికోలఁ గాలు విఱుగ నేసెను. ఈదుర్భర పరాభవంబు నిప్పువలె నద్దాసి హృదయంబు దహించుటఁ జేసి

యాత్మగతంబునఁ గ్రోధంబుంచి పగఁ దీర్చుకొను తలంపున సదనునకై వేచియుండెను.

### విశ్వామిత్రుఁడు దశరథుని కడకేతెంచుట.

దశరథుఁడు జగన్మోహనాకారులగు కుమారుల ముద్దుముచ్చటల నారయుచు, సంతతానందపారావారవీచికల నోలలాడుచు లీలగఁ గాలము గడుపుచుండ నొక్కనాఁ డమ్మహీపతి మందిరంబునకు గాధినందనుండగు విశ్వామిత్రుం డరుదెంచె. అంత నతిభక్తి నబ్భూకాంతుండు,

తే. గీ. అభిముఖుండయి చని మ్రొక్కి ♦ యతనిఁ జిత్త
తోషణంబగునట్టుగఁ ♦ దోడి తెచ్చి
రుచిర సింహాసనం బిచ్చి ♦ యుచితరీతి
నర్ఘ్యపాద్యాదులను బూజ ♦ లాచరించి.

తత్సమీపంబున నొక కాంచనాసనంబున నాసీనుండయి యుండ గాధేయుండు పురరాష్ట్రకోశజనపద బాంధవ సుహృజ్జనంబుల యందుఁ గుశలం బడిగి యనంతరంబ నరపతిం గాంచి, "జననాథా! ఏ నతిభయంకర మృగశరణ్యంబగు నరణ్యమధ్యంబునఁ గ్రతుకర్మంబు నిర్వర్తించుచుండ మదీయ మఖవిఘ్నంబు సేయ సమకట్టి యయ్యటవి యందలి మారీచ సుబాహువులు మున్నగు క్రూరరాక్షసులు యజ్ఞశాలయందు మాంసరక్తములు గురియించి నా చేయు యాగంబున నెత్త

రాయంబుఁ గల్గించుచున్నవారు. దీక్షాబద్ధుఁడ నైన నాకు నా యజ్ఞకర్మ విధ్వంసనేచ్ఛులైన యాక్రూరదానవులు గావించు ధర్మవ్యతికరంబులు దృశ్యమాత్రంబులె కాని ప్రతీకార్యంబులు కానేరవు. వారల యల్లరి నాయుల్లమును దల్లడిల్లఁ జేయుచున్న యది. "శ్రేయాంసి బహువిఘ్నాని" అనినట్లు సత్కార్యంబుల కన్నియు విఘ్నంబులే కదా! నే నయ్యాగంబు నిరంతరాయంబుగ నెఱవేర్పక తీరదుగదా!

## విశ్వామిత్రుఁడు క్రతురక్షణార్థమై రాముని దనకొసంగఁగోరుట.

ఇప్పుడు నేను పదిదివసంబులలో ముగియాదగు క్రతువునందు నియుక్తుఁడనయియున్నవాఁడను. అయ్యది విధ్వంసంబు గావింప దుశ్శీలత సంచరించు నారాత్రించరులను బొలియించి క్రతువు నిర్విఘ్నంబుగా సమాప్తి సేయింప సకల గుణాభిరాముఁడును, నిరుపమాన ప్రతాపవిస్ఫురన్మహిమాభిరాముఁడును నగు శ్రీరాముని లక్ష్మణమాత్రసహాయునిగఁ బంపుము. ఇతండనన్యసామాన్యవిక్రముఁడు. ఈతనిఁ బ్రకృష్టమహిమాన్వునిగ బ్రహ్మసుతుఁ డగు వసిష్ఠుఁడును దక్కటి మునులును నెఱుంగుదురు. సందియము వొందఁ బనిలేదు. ఇమ్మహాత్ముని సన్నిధానమున ముక్కిడి రక్కసులబాధ లేక నిర్విఘ్నముగఁ గ్రతుసమాప్తి కాఁగలదు. కావున రామలక్ష్మణులను నాపిఱుందనపంపి మదీయయాగసంరక్షణంబుఁ గావించి శిష్టరక్షణ దీక్షాపరుండవై,

యశస్సంపన్నుండవు కమ్ము" అని కౌశికుండు నిజాగమన కార ణం బెఱింగించిన విని పఙ్క్తిరథుండు గుండెఝల్లన వివర్ణ వదనుండయి వాతాహతభూజంబునోజ నేలంగూలి వెండియు నొక్కింతసేపునకు మొగంబున దైన్యంబు దోఁపనల్లనన మ్మౌని వల్లభు నీక్షించి ముకుళితకరకమలుండయి మెల్లన నిట్లనియె. "ఓమునికుల సార్వభౌమా! అశేషనీతి శాస్త్రపారంగతులగు మీకు నేనిఁక నేమని తెల్పువాఁడను. మత్తనయుఁడు రాముఁడు,

కం. బాలుఁడు ద్వాదశవత్సరుఁ
డాలంబుల తెఱఁగెఱుంగఁ ♦ డకృతాస్త్రుండీ
శీలము గలవాని ననికి
వాలాయము నాకుఁబంప ♦ వచ్చునె చెపుమా?

ముగ్ధుండగు రాముండా భయదమృగశరణ్యంబగు నర ణ్యంబునం గల పెక్కురగు మొక్కలంపు రక్కసుల నుక్క డించి చక్కాడు నక్కరికాఁడు. భవదీయాధ్వరధ్వంసకులగు క్రూరరాక్షసులను మడియించి క్రతురక్ష సేయుటకై వీరభట కోలాహల సంకులంబైన బలంబునుం గూడి ధనుర్ధరుండనై యేను నీవెంటవచ్చువాఁడనని" దీనముగఁబల్కి, రక్కసులు విపుల బాహాబల నిధులని తలపోసి డెందంబునడిందుపడి ఏను సయితము రాఁజాలననియె. వానిపలుకుల కొడంబడక కౌశి కుఁడు దంతసందష్టదారుణ ముఖుండయి, "రాజేంద్రా! ఏ నిప్పుడు యజ్ఞదీక్షితుండనై యున్నవాఁడ. మదీయక్రతు కార్యం

బునకు నీవప్రధాన విఘ్నమవై యున్నవాఁడవు. కానిమ్ము! ఇఁకనీవు సమ్మతించినను సమ్మతింపకున్నను, భూమ్యాకాశములు తలక్రిందైనను మదీయ సంకల్పమును నిర్వహింపక మానువాఁడఁ గాను. ఇట్టి యనృతవాగ్గ్రస్తమగు నీముఖావలోకనంబు సేయరాదు.'' అనిప్రవృద్ధంబగు క్రోధంబుతోడ నత్తపోధనసత్తముండు తన యాసనమున నుండి దిగ్గనలేచెను. అమ్మహానుభావుని యపారమహిమంబచ్చటనున్న శిష్ట మునిలోక గరిష్ఠుండగు వసిష్ఠుం డెఱుంగుం గావున నిజాసనంబు డిగ్గి, ''రాజోత్తమా! మనకుఁ బుణ్యంబును, కీర్తియును జేకొను సమయంబు. నీవిప్పుడు బొంకు సేయఁజనదు. పుత్రులును, ధనంబును, యశంబును, రాజ్యంబును సత్యమునకు సమంబులుగావు. కల్లలాడితివేని కీర్తినశించును. రాజధర్మంబునకు హానివాటిల్లును. కీర్తినిలుపుటయే రాజులకు జన్మఫలంబు. నిశ్చలతపో మహత్త్వసత్త్వస్వభావుండును, మహాతేజుండునునగు నిక్కౌశికుండు రాక్షస వినాశంబునందుఁ దాను శక్తుండయ్యును, భవన్నందనుఁడయిన రామునకమేయ కల్యాణంబొసంగఁ దలఁచి కృపావిశేషంబునఁ జనుదెంచినవాఁడు. ఈ మహనీయు నారాధించినచో నతఁడు రామునకు నభీష్టార్థంబుల సంఘటిల్లఁ జేయును. కావున మఖరక్షణమ్ముకొఱకమ్మునివరునకు రాము నొసంగుము. దాన నీకక్షయకీర్తియగు. సౌఖ్యమ్ములొదఁగూడునని'' శాంతవచనంబు లుపన్యసించి యాతని ననునయించె.

## దశరథుఁడు క్రతురక్షకై రామలక్ష్మణులం బంచుట.

అంత దశరథమేదినీవల్లభుండు వసిష్ఠు వచనంబులకు నెనుగు మాటాడ నెఱచి చిత్తంబున మెత్తవడి విశ్వామిత్ర మహర్షి చిత్తవృత్తిఁ గొలఁది తన తనయుల నచ్చటికి రావించెను. వారేగుదెంచి గాధేయునకు నమస్కరించి నిలిచినం జూచి దశరథుండు హర్ష బాష్పపులకాంకిత శరీరుండయి కొడుకులం గౌఁగిటం జేర్చి ప్రేమానుభరంబునం బొరిఁ బొరిఁ దచ్ఛిరంబులు మూర్కొని చుబుకంబులు పుణికి తన యంకభాగంబులం గూర్చుండఁ బెట్టుకొని యంగుళీనిర్దేశమువలన రాజర్షి యగు విశ్వామిత్రునిం జూపుచు,

తే. గీ. తండ్రులార! చనుండి యీ ♦ తపసితోడ
మాని జన్నంబు జరిపించి ♦ మరలి రండు
దీర్ఘజీవితులరు గాదు ♦ దిగ్విశాల
యశముఁ బొండని దీవించె ♦ దశరథుండు.

అంతఁ గుమారజ్యేష్ఠుండైన కల్యాణగుణాభిరాముండగు రాముండు జనయిత్రులను సందర్శించి తచ్చరణంబుల కభివందనంబుఁ గావించి తదాశీర్వాదంబులు వడసి బాణబాణాసన కృపాణంబులు ధరియించి ప్రమోదభరిత మానసుండగుచు లక్ష్మణసహితంబుగా నమ్మునీంద్రుతోడం జనియె.

వివిధాయుధమ్ముల ప్రయోగరహస్యమ్ముల నెఱింగించి రాఘవ సౌమిత్రుల నధ్వరవాటంబునకుం దోడ్కొనిచనియె. అంత నయ్యెడ వారలం ధనుర్ధరులై యుండ నియోగించి సవనంబునకు నర్హంబగు దివసంబు సంప్రాప్తంబగుటయు మాహూర్తిక దత్త శుభముహూర్తంబునఁ గౌశికుండు విధ్యుక్తప్రకారంబున హోమంబు సేయఁదొడంగె. అప్పుడు తదీయహోమధూమంబు వ్యోమంబుఁ గప్పె. అపుడు మింట నందందున్న సుబాహు మారీచాఖ్య రాక్షసులమ్మహాధ్వరంబు విధ్వంసంబు సేయ నెంచి,

కం. ఆకసమునుండి కలుషపుఁ
బోకలఁ బోవుచును మాంస ♦ పుంజము రుధిరం
బా కౌశికు యజ్ఞముపై
వేకురిసిరి హోతలెల్ల ♦ వెతలం జెందన్.

అట్టితఱి యజ్ఞవిఘ్నంబు గాకుండ రఘురాముఁడు దుర్వారబలంబున బాణాసనంబుఁ గేలనందికొని: వినువీధియందు దృష్టినిలిపి చాపంబు సారించి యాగ్నేయాస్త్రంబుచే సుబాహువుం బొలియించి, మారీచుపై సమ్మోహనాస్త్రముం బ్రయోగించిన నయ్యది యాతని యురంబున నాటి గిరగిరం ద్రిప్పుచుం గొంపోయి శతయోజనంబుల దవ్వున సముద్రజలంబులం బార వైచె. ఆక్షణంబ మారుతాస్త్రముచేఁ దమ్ముండుం దాను నొక్కటై విక్రమంబలరార నఖండ బలసత్త్వులగు తక్కటి రక్కసుల దళంబులనెల్ల నిశ్శేషంబుగ రూపుమాపిరి.

విశ్వామిత్ర మహామునీంద్రుఁడు జన్నంబు నిర్వర్తించి సంతుష్టాంత రంగుఁడయి చనుదెంచి రామసౌమిత్రులం గాంచి, "మీకెల్ల విధంబుల వృద్ధియగుఁగాత!" అని సాధువాదంబుల నభినందించి వారు చేసిన యుపకారంబునకుం బ్రతికారంబు సేయ నదనునకై వేచియుండె.

అక్కాలంబున శ్రీమంతంబై, భూరితరువిసరంబులకు నాకరంబై, బహుజనసంకులంబై, సారవంతంబై యుండు మిథిలానగరంబున బ్రహ్మవేత్తయు, సుగుణవిఖ్యాతుఁడు నగు జనక మహీపాలుఁడు ధరాపాలనంబుఁ గావించుచుండె. అతఁడు సహజముగఁ బ్రజాసౌఖ్యం బభిలషించువాఁ డగుటం జేసి యన్నగరంబు శాంతి భూయిష్ఠంబై యుండె. ప్రజలెల్లరు రాజ భక్తి తత్పరులై, ధర్మమార్గానులంబులై యఖండసౌఖ్యము లతోఁ దులతూఁగుచుండిరి. వారెల్ల రైకమత్యమున నుండు టచే నానగరము లక్ష్మీసరస్వతుల కావాసమైయుండె. ఇట్టి మిథిలయం దొకనాఁడు మిథిలాధినాథుఁడు యజ్ఞకార్యార్థమై నాఁగలితోఁ దనక్షేత్రమును జాలు లేర్పడ దున్నుచుండెను.

ఆ. వె. అపుడు నాలను తగిలి ♦ యగపడె నొకపేటి
యంతజనకనృపతి ♦ యబ్బురంబు
నొంది మూదసంబు ♦ నుబ్బునఁ దెఱువంగ
నందు దివ్యదీప్తి ♦ నట్టె మెఱసె.

అట్లు దృష్టి మిఱుమిట్లుగొను రూపలావణ్యాతిశయ
ముంగల కన్యాతిలకంబుం గని యత్తన్వి రూపాతిశయంబునం
దన నయనంబు లనిమిషత్వంబున నిగుడ మగిడింప నేరక వెఱఁ
గుపడి యజ్జనక భూవిభుండు హర్షోల్లాసభాసమానమానసుఁ
డగుచు నమ్మానినీమణికి "సీత" యను నభిధానం బొనరించి
యుదారంబగు గారాబంబునఁ బెనుచుచుండెను.

అజ్జనక భూపాలు సదనంబునఁ బెక్కుతరములనుండి
హరువిల్లు పూజింపఁబడుచుండెను. అయ్యుత్తమ శరాసనం బతి
భారంబగుటచే మహాసత్త్వసంపన్నులగు గంధర్వయక్ష రాక్షస
వీరవరు లనేకులకుం గూడ నెత్తనలవి గాకుండెను. అంత నతఁడు
పాణిగ్రహణమహోత్సవయోగ్యయైయున్న తన కుమార్తెకు
వివాహంబు సేయఁ దలఁపుపూని శ్రీ శివశరాసనంబు నెవ్వాండు
వంచి యెక్కిడ సమర్థుం డతనికి చారులక్షణలక్షితయు, ననన్య
సామాన్యలావణ్యయు, దేవతాంశ సంభూతయు నగు సీత
నొసంగి వివాహంబు నెఱపెదనని పలికి సకల దిశలఁ జాటఁ
బంచెను. అంతఁ గతిపయవాసరంబులకు సీతాస్వయంవర
మహోత్సవ సందర్శనార్థమై మహీతలంబునం గల రాజనం
దను లెల్లరుఁ దండోపతండంబులుగ విచ్చేసిరి. నగరమంతయు
నానాదేశాధీశులచే సంకులంబై యుండె. కన్యాపరిగ్రహ
ణార్థం బరుదెంచిన రాజపుత్రవీరు లనేకులు ధనువుం గనుం
గొని తమ పూర్వులు చేసిన ఘోరకర్మంబులఁ దలంచి గర్వో
ద్దీపితులై ప్రగల్భతా సూచకంబుగ మందహాసంబుఁ గావించి

మహాట్టహాసంబున బహువిధంబుల దాని మోపెట్టఁబోయి యిట్టట్టుఁ గదల్పనోపక ముఖారవిందంబులు ముకుళింప బోడు వడి సిగ్గునం దలలెత్తక నిరాశు లయిరి. మఱి కొందఱు తమ ప్రయత్నంబులు విఫలంబులగుడు దైన్యంబున విన్ననై చూచుచుండిరి. ప్రతాపవంతులును, బ్రజ్ఞావంతులునగు,

తే. గీ. రాజసూనులు గొందఱు ♦ తేజముడిగి
జగతి రాజుల మోసపు ♦ చ్చంగఁ దలఁచి
జనకుఁ డీమాడ్కిఁ గావించెఁ ♦ జాలుననుచుఁ
దరలిపోయిరి తలవంచి ♦ ధనువుఁగాంచి.

ఇట్లు స్వయంవరంబునకు మూఁగిన సకలరాజలోకం బును మిథిలానాథుచే భంగపడి తమతమదేశంబులకుం జనిన విషయం బెఱింగిన విశ్వామిత్రమహర్షిసత్తముఁడు దశరథరా ట్తనయులను మిథిలకుఁ దోడ్కొని చని రామచంద్రనరేం ద్రునిచేత నమ్మహనీయ చాపంబు భేదిల్లఁ జేసి భూపుత్రి యగు సీత నాతనికిఁ బాణిగ్రహణంబు సేయించి ప్రత్యుప కారంబు సేయ నుత్సుకుఁడై వారలం దోడ్కొని నిజాశ్ర మంబు విడిచి మిథిలానగరాభిముఖుండై యపారసత్త్వభయం కర సంచారంబగు కాంతారంబునం జనుచుండె.

## అహల్యా శాపవిముక్తి యగుట.

అట్లు తరలి పోవుచు నొక్కయెడ విజనంబైన విపిన స్థానంబును గని కౌశికుఁ డద్దాని రామణీయకమును బొగ

డుచు, "రఘూత్తమా! అల్లదె సముత్తుంగంబుగఁ గనంబడునది తొల్లి గౌతమాశ్రమంబు. ఆమ్మునిపుంగవునకు రూపవిలాస విభ్రమంబుల జిగిఁదళుకొత్తఁ బెరిఁగిన సకల సద్గుణకల్యా యగు నహల్య భార్యయై యొప్పె. అక్కాంతాలలామ లలితా కృతిం గాంచి దేవేంద్రుఁ డమ్మగువ చక్కఁదనమ్మునకు మక్కువపడి యొక్కనాఁడు నడురేయి నయ్యాశ్రమ ప్రదేశం బునకుఁ జని యుషఃకాలమగునట్లుఁ గాన్పించు చిన్నెలెల్లఁ గావించెను. అంత నమ్మునీంద్రుఁడు కుక్కుటంబులు దిక్కులు పిక్కటిలు రవంబున మొరయుచుండుట విని ప్రభాతం బయ్యె నని మేల్కాంచి వేగిరపాటున ప్రాభాతికకృత్యంబుల నిర్వ ర్తింప నదికి నరిగినప్పాడెడఁగని పురందరుండు ముని వేషధరుండై పర్ణశాలకుం గుఱంగట నజ్జాపుచుండ నమ్మహామునిపత్నియగు నహల్య వాని నింద్రుంగా నెఱింగియు దేవేంద్రుఁడను గుతూ హలంబునఁ దనచిత్తంబు మెత్తఁజేసికొని వాని నొక సంకేత గృహంబునకుం దోడ్కొని చనియె. అంత నింద్రుం డక్కాం తామణితోడి కామ్యసౌఖ్యం బనుభవించి గౌతముఁ డరు దెంచినచోఁ దన గుట్టు బయలగునను భయంబున నప్పర్ణశాల నిర్గమింప నటునిటు తారాడుచుండె.

అటస్స్నానార్థియై నదికిఁ జనిన దివ్యజ్ఞానధనుండగు నమ్మునిప్రవరేణ్యుండు కొన్నికారణంబుల నింకను గొంతరాత్రి మిగిలియే యున్నదనియు, నద్దారుణకృత్యంబు దేవేంద్ర

కృత్రిమకృత్యంబనియు నెఱింగి వాని చేసిన యపకారంబునకుఁ బ్రతీకారంబు సేయఁదలంచి పాదతాడిత భుజంగంబు నోజ రోషంబునఁ దనయాశ్రమంబునకుఁ దరలివచ్చె. అట్లు చనుదెంచి యయ్యెడ నమరేంద్రునిఁగాంచి భయంకరవదనుఁడై భీషణంబు లగు రోషభాషణంబుల, "ఓరీ! దురాత్మా! నీవు దేవేంద్రుండ వయ్యును గామవ్యసనంబునఁ బాపంబని తలంపక గర్వాతి రేకంబున నన్నిప్పగిదిఁ బరిభవించితివి. ఇప్పాపమునకు జేసి నీశరీరంబున వేయి యోనులు గలుగుఁగాక!" యని కఠోరం బుగ శపియించిన నాలోకత్రయపాలకుఁడు కలుషించియు, దుర్వారంబైన పరిభవవికారంబు నోఁపకుండఁ దన్నుం దాన యుపశమించుకొని యచ్చోట నిలువక నిజావాసంబునకుం జనియె. అనంతరంబ గౌతముఁ డాశ్రమాంతర్భాగంబుఁ జొచ్చి యందు మనంబున బెగడుగదుర వడవడ వడంకుచుఁ గేలుమోడ్చి తదేకదృష్టిగాఁ దన్నుఁ జూచుచున్న నిజపత్నింగని యాగ్రహోదగ్రుఁడయి, "పాపీ! స్త్రీ సామాన్యమునకుఁ బాతివ్రత్యము సహజసంపద. స్త్రీలకు సతీత్వము కంటె వేఱొం డుత్తమ ధర్మంబులేదు. సతీత్వంబాచరింపని వనిత యియ్యి లాతలంబున సూకరముకంటె నధమురాలు. భర్తనుగాక యన్య పురుషుని చింతించిన మాత్రమునఁ గూడ సతీత్వంబునకు విఘ్నంబు ఘటిల్లునన నీవిపుడిట్టి దారుణ పాపపు కర్జంబున కొడఁబడితివి. కావున నీవివ్వనాంతరంబున నిరంతరంబును నదృశ్యురాలవై పాషాణరూపంబునఁ జైతన్యము లేక పడి

యుండుము గాక!" అని నిర్దయుండై కోపించిన కోపంబున శాపంబిచ్చె. అంత నద్దేవి యాఘోరశాపంబున కంతరంగంబున నింతింతనరాని వంతనొంది భర్తృపాదంబుల పయింబడి, 'నాథా! కృతాపరాధనైన నన్నిప్పగిది శపియించుట యన మీకు నాయందుఁగల దయాతిశయంబున నన్ను నిష్కళంకఁగాఁ జేయుటకే. అయ్యయ్యో నిట్టి నిష్ఠుర శాపంబునకు గురిసేయక దానికి నిష్కృతి యెయ్యదియో ననుఁ గరుణించి శాపవిమోక్షంబున కుపాయంబానతీయుము.' అని ప్రార్థించిన నాలించి యాతఁడు శాపదుఃఖాతిభార విహ్వలయైయున్న నిజపత్నింగాంచి కరుణాకలితహృదయుఁడై "ప్రాణేశ్వరీ! నావచనం బమోఘంబు. కావునఁ గొంతకాలంబు పాషాణాకృతింబూనియుండి యిమ్మహాపాతక పరిహారార్థంబుగ రాముఁడయి యవతరించిన నారాయణుని పాదరజస్సంగము వలన నీకు నీపాపనిష్కృతియు, నిజస్వరూపప్రాప్తియుఁ గలుగును" అని యనుగ్రహించి యచ్చోటనుండ నోపక దుర్గమంబగు హిమవన్నగంబునకు నిర్గమించి తదీయంబైన యొక్క మహోన్నతశృంగంబునఁ దపంబు సల్పుచుండె.

అహల్య తన చేసిన యపరాధంబునకు పశ్చాత్తాపంబు నొంది తన్నుం దాన నిందించికొనుచుఁ దత్క్షణంబ పాషాణంబై నవదూర్వాంకుర విలసితంబగు మహీతలంబు పయిం బడియుండె. తదాశ్రమవాటిక నానావిధపుష్పలతా ప్రసూనఫలంబులచే దర్శనీయంబై యొప్పు. మనమయ్యాశ్రమంబుఁ జూడఁబోవుదము రండని, విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులం

దోషాఖ్యాని చనియె. వారలమ్మహామునీంద్రు నాశ్రమవనోపవనంబుఁ దఱియంజొచ్చు నయ్యవసరంబున రామభద్రుం డబ్బవనమునట్లు లాతని పదరజస్స్పర్శంబుచే గౌతమమహాముని శాపంబున శిలయై వసుధం బడియున్న యహల్య శిలారూపంబు మాని కాంతిదేహంబుఁ బూని పరమాహ్లాదంబునుం బొంది యమ్మహానుభావుని పాదంబులకుం బ్రణమిల్లి ముకుళిత హస్తయై,

క. అయ్యా! నాపుణ్యంబే
మయ్యా! యియ్యెడకు మీర • లరుదెంచుటచే
నొయ్యనఁ బావననైతిఁ గ
దయ్యా! నాపైని మీర • లడుగిడు కతనన్.

మదీయభాగ్యంబునం జేసి లోకసంరక్షణార్థంబు మర్త్యరూపంబున నవతరించిన శ్రీమన్నారాయణుఁడవగు నీదర్శనసంపత్తి సంభవమయ్యె. నీపాదస్పర్శంబునం బవిత్రనైన నేను నాకన్నులకఱవుదీఱ, నొడలుప్పొంగిపోవ, నినుఁగాంచితి. నీదర్శనంబునం జేసి యేను ధన్యనైతినని సకలభాషణంబుల నుతియించె. గౌతముఁ డియ్యుదంతం బాతఁడు దివ్యదృష్టిచేఁ గరతలామలకంబుగాఁ దనదివ్యచిత్తంబున నెఱింగి యత్యంతహర్షంబున నమ్మహాత్ముఁడున్న యెడకుం జనుదెంచి యాతని నతిగౌరవంబున సంభావించి యహల్యాసమేతుండయి స్వాశ్రమంబునకుం జని యచ్చోటఁ బుణ్యగోష్ఠిచేఁ గాలం బపనయించుచుండెను.

## రాముఁడు శివధనువు భగ్నము సేయుట.

విశ్వామిత్ర మహాసింధురుండు రామసౌమిత్రి సమేతుండై మిథిలానగరంబునకుం జనుచు మార్గమున వారికి గంగా ప్రభావంబును, దదితర వివిధ పుణ్యకథాప్రసంగంబును బోధించెను. ఇవ్విధముగఁ బ్రయాణోన్ముఖులై యనేక నగర, గ్రామంబులతిక్రమించి చనుచు నొకనాఁ డనుపమాన శోభాసనాథంబయిన మిథిలానగరంబు సొచ్చి, జనకరాజాస్థాన సభామందిర ద్వారంబు కడకేగి ద్వారికునిచే నిజాగమనంబు జనకమహీనాథున కెఱుంగఁ జేసిరి. వారిరాక విని సత్వరముగ,

క. చనుదెంచి నృపుఁడు వారలఁ
గనుఁగొని భయసంభ్రమములు ♦ గడలు కొనంగా
వినయమున నెదురుగాఁ జని
మునిచంద్రుని పాదపద్మ ♦ ముల కెరఁగి తగన్.

అర్ఘ్యపాద్యాద్యుచిత సత్కారంబులఁ దనియఁజేసి వారిం గొనిపోయి యర్హాసనంబుల సుఖాసీనులం జేసె. ఆయ్యవసరంబున సప్తర్షిస్తోత్రముఁడు మునిమండలాధిపుఁడగు విశ్వామిత్రు నిరుకెలఁకుల నలంకృతులై సూర్యసోముల చందంబున మనోహరాకారంబులం దేజరిల్లుచున్న వేదండతుండోపమాన దోర్దండమండిత కోదండులగు నుత్తమవంశ సంజాతులం జూచి యిట్లనియె. "తాపసోత్తమా! భవత్కృపా

డయిన రామభద్రునిచ్చటికిఁ దోడ్కొనివచ్చి తమ్ముఁ గృతార్థులం జేసినంకుల కమ్మునిగ్రామణియగుగాధేయు నభివర్ణించెను. మఱియు నమ్మహాత్ముండయిన విశ్వామిత్రుండు ప్రథమంబున రాజమాత్రుండయ్యు వసిష్ఠమహర్షితో ద్వేషించిన పిదప సకలవిభవంబులను విడనాడి విపినంబునఁ బద్మసంభవుని గూర్చి ఘోరంబగు తపంబొనర్చి బ్రహ్మర్షియయ్యెనని యాతని ప్రభావంబునుగ్గడించెను. అనంతరంబ విశ్వామిత్రుఁడు మిథిలాపురాధీశ్వరుండగు జనకరాజర్షిం గాంచి "రాజేంద్రా! భవత్సదనంబుననున్న మహనీయకార్ముకంబుఁ దెప్పించి రాఘవేంద్రునకుఁ జూపుమనినవిని జనకభూవిభుండు తనబంధుమిత్రగణంబైన రాజలోకంబు నెల్లరావించి మునివరు ననుమతంబునఁ బంచసహస్రవీరలోకమ్ముచే నాహరుకార్ముకంబతిప్రియత్నమ్మునఁ దెప్పించి విశ్వామిత్రునిముంగలఁ బెట్టించె. రామచంద్రుండవ్విటి సామీప్యంబునకుంజని ధనువునకుఁ బ్రదక్షిణంబుఁ జేసి మ్రొక్కి విశ్వామిత్రజనకుల యనుమతంబు వడసి సభాసదులందఱు ననిమేషనయనులై చూచుచుండఁ గోదండంబు లీలమెయిఁ జేకొని,

కం. అవలీల వింట గుణమును
సవరించి సమస్త దిగ్గ ♦ జంబులు వడకన్
భువనము లదరఁగఠంకృతి
నవిరళముగ సల్పినిశిత ♦ మగునొక శరమున్.

కర్ణాంతము దనుకఁ దిగిచి విడిచిన దిక్కులు పిక్కటిల్లునట్లు విల్లువిఱిగె. అయ్యద్భుత ధ్వనిచే నావినోదమును జూడ వేడుకపడి మూఁగిన మహీపతిజలెల్లరును ముక్కునఁ వ్రేలు వైచికొని యక్కజపడిరి. మిథిలావరుండైన జనకుం డత్యంత సంతుష్టాంతరంగుఁడై పరమప్రీతి రామభద్రుం బునఃపునరాలింగనముజేసి నీకు ననురూపవయశ్శీల సంకల్పగుణాకరయైన సీతం బరిణయంబుఁ గావించి కృతార్థుండనయ్యెదనని మధుర వచనంబుల నభినందించె.

## సీతాకల్యాణ మహోత్సవము.

అంత మిథిలాధినాథుండు సీతాకల్యాణాయత్తచిత్తుండై అంగ వంగ కళింగ కాశ్మీర తురంధిరపాండ్యకురు కేకయ యవన కుంతల పాంచాల నేపాళ కేరళ కర్ణాట గౌడాంధ్ర కుంతల ద్రవిడలాట వరాటాది దేశాధీశులకు శుభలేఖలనంపి శీఘ్రంబున మంత్రిపుంగవులం బిలువంబనిచి యొక్క కాంచన పట్టిక యందు శుభవాచకాక్షరంబులు లిఖించి కుంకుమంబలది యల్లన వారికొసంగి మీరతిత్వరిత గమనంబున నయోధ్యకుంజని దశరథు నుచితభంగి సందర్శించి, రామలక్ష్మణుల కుశలంబెఱింగించి యిచ్చటి శుభప్రసంగంబంతయుఁ గొఱఁత వడకుండ బ్రకటించి వారిని బంధుమిత్రకళత్రాదులతో సీతారాముల కల్యాణ మహోత్సవంబునకుఁ దోడ్కొనిరండు పొండని పనిచి నగరాలంకారంబుఁ గావించుచుండె.

జనకాజ్ఞంగొని మంత్రిపుంగవు లెడసేయక మిథిలాపురంబు నిర్గమించి నిరర్గళప్రయాణంబుల నయోధ్యానగరంబుఁ జేరి దశరథేశ్వరుని సముచితంబుగా సందర్శించి బద్ధాంజలిపుటులై జనక వాక్యంబుగా మిథిలానగరంబున జరిగిన చందమంతయు నామూలాగ్రంబుగా నెఱింగించి, "మహాత్మా! నీవు పురోహితోపాధ్యాయ బంధుమిత్రకళత్రామాత్యపరివార సహితుండవై మిథిలకుఁ జనుదెంచి మిథిలారమణు సమ్మదంబునకు సార్థక్యంబు సంపాదించి భవత్కుమార కల్యాణోత్సవ సమాలోకన సంజాత పరమానందం బనుభవింప సర్హుండవు." అని హృదయానందంబుగాఁ బలికిన విని దశరథుండు సుకుమారుఁడగు తన కుమారునకుఁ బరమదయామయుండగు విశ్వామిత్ర మహర్షి యపారకృపాతిరేకంబున దేవయజనసంభవయగు జానకి భార్యయగు భాగ్యమబ్బెనని కరము హర్షించి శ్రీరామవైవాహికశుభమహోత్సవాలోకన సంభ్రమాయత్త చిత్తుఁడగుచు జగజ్జేగీయమానంబుగాఁ బుత్రమిత్రకళత్రభృత్యామాత్య బాంధవగురుజన పురోహిత భటనట గాయక ప్రబోధకాది వర్గంబుతో నపారబల సమేతుండై వెడలి నిరంతరప్రయాణంబులఁ గతిపయవాసరంబులకు విదేహదేశంబుఁ జేరె. ఇట్లు తదుత్సవదర్శన కుతూహలులై చనుదెంచిన దశరథప్రముఖ భూపతులును, మఱియుం దక్కిన రాజవరులును, హితులును మొదలుగా ననేకులం జనకుండు పూజలం దృప్తులం జేసిన వారునుం బ్రముదితాత్ములైరి. మఱియు వారి నతండు సకల

సంవత్సరపూర్ణంబులైన నివేశంబుల విడియించి దినదినంబు నభినవంబులగు వివిధోపచారంబులు గావించుచుండె. నిహూపిత దినసమునకు మహేంద్రవై భవంబుల నేతెంచిన మహీవరులున్నతాసనములయందును, బాంధవులు, స్నేహితులు, ప్రేక్షకులు మున్నగు జనంబులు నిర్దిష్టస్థలములయందు నాసీనులై కల్యాణదర్శనాసక్తులై మహోన్నాదమున శుభోదయకాలంబుఁ బ్రతీక్షించి యుండిరి. అట్టి సమయంబున శిష్టవరుఁడగు వసిష్ఠుఁడు దశరథ జనకక్షితిపాలుర వంశవివరణంబును సుధారస మధురంబులైన వచనంబుల విశదంబుగా వినిపించి వారలకు హృదయానందంబుఁ జేసె. దశరథేశ్వరుండు భూసురోత్తములకు గో, భూ, హిరణ్యాదానంబులాదిగాఁ బెక్కుదానంబుల నొసంగె.

మిథిలాపురాధీశ్వరుం డపంతరంబు సంతసం బింతింతనరాని దగుడుఁ దమకంబున శుభముహూర్తంబున నల్లునకుఁ గూఁతునకు మంగళాభిషేకంబు లొనరించి భూసురాశీర్వాద నాదంబులు రోదసీకుహరంబు నిండ నలంకృతుఁడై, మధుపర్కంబొసంగి మంత్రోదక పురస్సరంబుగాఁ దనపుత్రి సీతను రామునకు హర్షపరిప్లుతుండయి సాలంకృతకన్యాదానంబు చేసె. ఇట్లు విధి దృష్టవిధానంబున వివాహం బతివైభవంబున నిర్వర్తించి తనపరి అతిశయ గుణరూపలావణ్యరాశియైన తన పుత్రి నూర్మిళను లక్ష్మణునకును, దన సోదరుఁ డగు కుశధ్వజుని పుత్రికాద్వయంబున మాండవిని భరతునకును, శుత్రి

కీర్తిని శత్రుఘ్నునకును నిజకులాచార సరణిం బరమోత్సవం బునం బరిణయంబుఁ గావించి యనర్ఘ మణి గణాంబరాభరణం బులు, వాహనంబులులోనగు నానావిధవస్తుసముదయంబుల నవార్యరిగనజ్ఞామాతల కొసంగె. అనంతరంబ కల్యాణావలో కనకుతూహలులై యరుదెంచిన ధరణీపతులు పయనంబున కుద్యోగించిన వారలెల్లరకు మజ్జనభోజనంబులు మణిభూషణ చిత్రాంబరంబు లొసంగి వీడ్కొలిపిన వారును వీడుకోలు వడసి తమతమ పొందుపట్లకుం జనిరి.

అంత దశరథుఁడు మిథిలానేతకుఁ బ్రియంబుసేయు కొఱకు మిథిలానగరంబునఁ గొన్ని నెలలుండి యయోధ్యకుం బ్రయాణంబు సేయందలంచి, నయవిత్తముండగు జనకరాజ సత్తమునితో నిట్లనియె. "ఏను సీతారాముల కల్యాణోత్సవ దర్శనంబునను, భవత్కృత సత్కార గౌరవంబునను౦ జేసి కృతార్థుండనైతి. ఇఁక నా దేశంబునకుం బోయెదను." అని తన యుద్దేశంబు తేటపఱచిన యనంతరంబ జనకవిభుండు దశ రథేశ్వరుని, వసిష్ఠాది మహర్షులను సముచితప్రకారంబునం బూజించి తన పుత్రికలకుఁ జిత్రంబులగు చీనాంబరంబులను మణిమయంబులగు నాభరణంబులను నొసంగి సంభావించి, ప్రేమాతిరేకమునఁ దనముద్దుగూఁతు కుఱ్ఱలకు మోదంబు దైవార నత్తింటికనుపుచు, "నధికభక్తి నత్తమామలఁ బూజిం చుచుఁ దలలోని నాల్కవోలె మెలంగుచు మోహనాకారు లగు పతుల ననురక్తి సేవచేయుచుఁ బూవుతావియువోలె

మెలంగుచుం దోడిచేడెలం గూడి చెలిమిమై పూసలలోని దారమట్లలరుచు నలపుట్టినింటికిని మెట్టినింటికిని గీర్తిం దెచ్చెదరు గాక!" అని సముపదేశపూర్వకముగ నాశీర్వదించుచుం దన కూంతుల జామాతలకొప్పగించి, సగౌరవముగ వీడ్కొలుప దశరథుండును బుత్త్రిల తోడను, గోడండ్రి తోడనుగూడి జనకుండొసంగిన వివాహోచిత విచిత్ర రత్నకాంచన వస్తు వాహన నివహంబులుగొని కొడుకులం గోడండ్రను రత్నాంచితంబులగు రథంబుల నెక్కించుకొని నానాసేనాసమేతంబుగం గదలి యయోధ్యానగరంబునకుం జనుచుండె.

## శ్రీరాముండు పరశురాముని జయించుట.

ఇట్లు దశరథుండు వైభవమలరార నయోధ్యానగరమునకు వచ్చుచుండ భృగువంశదీపకుండును క్రోధమూర్తియును ధీరోద్ధతుండును, క్షత్త్రియవంశదవానలుండును నగు పరశురాముండు తనగురువగు పరమేశ్వరుని వింటిని విఱిచి సీతంగొనిన క్షత్త్రియ పోతమేదిరా? నాకంటె రెండవరాముం డెవండురా? యని వీరావేశపరవశుండయి పండ్లు పట పట కొఱుకుచు దారికడ్డమునిలిచెను. అంత శ్రీరాముం డాక్షత్త్రియహంతకుని జూచి "బ్రహ్మ విదుత్తమా! వందనములని" నమస్కరించిన, భార్గవరాముండు, ఓరీ! డింభకా! మద్గురుద్రోహీ! ప్రాంతవడి త్రుప్పుపట్టిన ధనువును భంజించుటొకపాటుగాదు. ఇదిగో మత్కరమునం గ్రాలుచున్న విల్లు. దీని నీవెక్కిడి, పరాక్రమ

వంతుఁడవేని, నీ పౌరుషమును నిలుపుకొమ్ము". అని పలుక రాముఁ డమ్మహనీయుని చేతివింటిని తన దివ్యహస్తమున నవలీల నందికొని యామేటిబల విక్రమ తేజస్సంపదలెల్లఁ గ్రోలిన, భార్గవరాముఁడు బెంబేలువడి నిలిచి శ్రీరాము నాదివిష్ణువుగా నెఱింగి, కళావిహీనుఁడయి, చేతులు మొగిచి నిలువంబడియె. అంత రామబాణం బమోఘంబు గావున ఖండపరశు నభిమతానుసారంబునఁ దచ్ఛరంబున నతని చిరంతన పుణ్యసముపార్జితంబులగు నుత్తమలోకంబులెల్లఁ గొట్టుఁడు నాజామదగ్న్య, "దేవా! రామచంద్రా! క్రోధమోహితుఁడనై నిన్నాదిపూరుషునిఁగా నెఱుంగఁజాలక ప్రల్లదము లాడినాఁడ. నాయపరాధమును క్షమింపుము. అని శరణంబు వేఁడికొని పశ్చాత్తాపతప్తుఁడయి, రామలక్ష్మణులకు "దీర్ఘాయుష్మంతులై వర్ధిల్లుదురుగాక! లోకైక పూజ్యులగుదురుగాక!" అని దీవన లిడి యందుండి మహేంద్రగిరికిఁ దపంబున కరిగెను.

రఘుకులేశ్వరుం డయిన రామదేవుండు ప్రశాంతాత్ముం డయి యద్ధనువును వరుణున కొసంగి భయవిహ్వలుఁ డయిన నిజజనకు నవలోకించి, యిఁకఁ బ్రయాణసన్నాహంబుఁ గావింపుఁడని ప్రార్థించెను. అంత దశరథుఁ డత్యంతసంతోషాక్రాంతస్వాంతుం డయి, సపరివారంబుగ నచ్చోటు గదలి కతిపయప్రయాణంబుల నతిత్వరిత గమనంబునఁ జని చని భూలోకవైకుంఠ మనంబరఁగు నయోధ్యానగరంబు సొచ్చి సుముహూర్తంబున స్వగృహంబుఁ బ్రవేశించి సకల

భోగభాగ్యసమన్వితుండయి, మందిరంబున జగత్ప్రఖ్యాత చారిత్రులగు పుత్రులం గూడి సుఖముండెను. రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులును జనకాజ్ఞాపరిపాలనోత్సుకులై యువతీ రత్నములం గూడి వినోదమ్మునఁ గాలమ్ము నెట్టుచుండిరి.

ఇట్లు కొంతకాలము గడచినవెనుక భరతశత్రుఘ్నులు జనకాజ్ఞఁగొని తమ మేనమామయగు కేకయరాజమణి వెంట నరిగి యాతనిమందిరమున సుఖముండిరి.

శ్రీ ర స్తు.

శ్రీ వేంకటరమణ పరబ్రహ్మణేనమః.

# శ్రీ రామకథామృతము.

## అయోధ్యాకాండము.

### శ్రీరామ పట్టాభిషేక ప్రయత్నము.

దశరథసార్వభౌముఁ డనన్యసామాన్య ప్రభావుఁడయి సకల మహీతలంబును బాలనం బొనరించుచుండె. కొండొక కాలంబున కాతఁడు యుక్తవయస్కుఁడయిన తన ప్రియనందనుఁడు రామచంద్రునకు యువరాజ పట్టాభిషేక మహోత్సవంబుఁ జేయ నెంచి వసిష్ఠునిచే లలిత పుణ్యోదయ లగ్నంబు నెఱింగి యెల్లవిధమ్ముల శోభావిశేషమ్ము లొదవునట్లు పురంబు సర్వంబు నలంకరింపఁ బూర్ణప్రయత్నములు సేయుచుండె. అప్పట్టణంబునందలి స్త్రీ బాల వృద్ధజనంబులెల్ల రామాభిషేక కథాప్రసంగంబులఁ బ్రొద్దుఁ బుచ్చుచు సంతోషాయత్తచిత్తులయి శ్రీరామపట్టాభిషేకమహోత్సవదర్శనోత్కంఠులై యుండిరి.

కం. ఈవిధమున నప్పురిని మ
హా విభవం బొప్పుచుండ ♦ నక్కలకలముం
దావిని "మంథర" దలఁచె
న్భావంబున రాముపట్ట ♦ భంగ మొనర్పన్.

తలపోసి హృత్తలంబునఁ దత్తరపాటు గదుర నదరిపడి కుదిరిక చెడి తన్ను రామభద్రుండు బాల్యంబునఁ బరిభవం బొనర్చిన కారణంబునం జేసి తత్ప్రతీకారంబుగాఁ దన బోధనాసామర్థ్యవిశేషంబుచే రామాభిషేకంబునకు విఘ్నంబు సేయఁ గృతనిశ్చయయై తద్వృత్తాంతం బామూలాగ్రంబుగఁ దనదేవి కెఱింగించు తలంపున నతిరభసంబున నంతఃపురంబునకుం జని యందుఁ గేకయరాజనందనిం గాంచి యిట్లనియె "దేవీ! నీకుఁ బరమరహస్యం బొండు దెల్పెద. ఏరికి నెఱింగింపకుము. దశరథచక్రవర్తి కౌసల్యాదేవిపైఁ గల యనురాగంబు పెంపున నామె యామోదమును బడయఁగోరి భవన్నందనుఁడగు భరతుని గానల కనిపి కుమారశేఖరుండగు రాముని యౌవరాజ్యంబునం దభిషిక్తునిం జేయఁదలఁచి నగరాలంకారంబుఁ గావించుచున్నవాఁడు. ఇఁక రాముఁడు రాజు కాఁగలఁడనుట కించుకయు సందియంబు లేదు. అతఁడు సామ్రాజ్యపదవిం గైకొను నేని నీ సవతియగు కౌసల్య ఘనతఁ జెందును. దానం జేసి నీకును, నీసుతునకును దైన్యవృత్తి వాటిల్లు. నీప్రాణనాథునకు నీయం దణుమాత్రమును గౌరవంబు లేదు. ప్రాణ

విభుని వలనఁ బరిభవంబందిన పడంతి పరిజనంబునకును బరిహాస పాత్రంబయి యుండు. అమ్మహీపతికిఁ గౌసల్యామహాదేవి యున్నచో మక్కువ మెండు. ఆయమ నంత గౌరవించుటకును, నిన్నవమానపురస్సరంబుగాఁ జూచుటకును నామె యొనర్చిన లగ్గేమి? నీవు చేసిన యెగ్గేమి? ఆ నృపాలశేఖరుఁడు సేయు నగౌరవంబునకును, బక్షపాతంబునకును, నవమానంబునకును, నిల నెట్టి మానవతియైనను సహింపఁ గలదే? క్షమావతివగు నీవు దక్క నన్యులు సహింపలేరు. వానికి నీయెడ నిట్టి ధిక్కారంబు గలదని నేఁడ యెఱింగితి. తెల్లనివన్నియుఁ బాలును, నల్లనివన్నియు నీళ్లునని యెయ్యది చెప్పిన నయ్యదియే నమ్మియున్న నీయంతటి వెఱ్ఱి నే నెజ్జగానఁ గాన. ఇఁక నీదు బ్రదుకేటికి? నీ యవివేకంబు నుద్దేశించి పరితపించుచున్నదాన. వేయునేల! నీవు హెచ్చు సుఖంబులఁ బడయఁ గోరితివేని నే నెద్ది గఱపిన దానిం గాదనక చేయవలయునని" పలికి యిట్లనియె.

తొల్లి దేవాసుర సంగ్రామసమయంబున నీవల్లభుఁడగు దశరథునకు నీవు సారథ్యంబునఁ జేసిన మేలును మఱచియున్నదానవు. అతఁ డసురబాణ నిహతుఁడయి ప్రజ్ఞ తప్పినతఱి నయ్యసమాన తేజంబగు రథంబును జయ్యన వేఱొక యెడకుం గడపి రాక్షసప్రహారణంబులం బొలియకుండ నాతని రక్షించితివి. ఇట్లు నీచే రక్షితుండయి యతండు నీదు మహాసామర్థ్యంబునకు డెందంబున నమందంబగు నానందంబు నొంది "ప్రేయసీ!

కం. మెచ్చితి నీపతిభక్తికి
మెచ్చితి నీప్రేమమునకు ♦ మెచ్చితి ధృతికిన్
మెచ్చితి నీదగు యుక్తికి
నిచ్చెదఁ గోరుము వరమ్ము ♦ లిమ్ముగ రెంటిన్."

అనప్పుడు మదభిమతంబులైన వరంబులు నాకు వలసిన యప్పుడు కోరెదనని యంటివి. దశరథుఁడు నల్లెయుని నిన్ను గారవించుచున్నాఁడు గదా! ఇపుడు నీవాచిరకాలాంతరితమైననుడి పరిపాటి తప్పి సూటిలేక మఱచి యున్న దానవు. నీశాంత స్వభావంబ నిన్నింతకుఁ దెచ్చె. నిసౌజన్యం బిపుడు దుఃఖంబు కొఱకుఁ బరిణతంబయ్యె. నీవిపు డెనురుకొని నిలిచితివేని యన్నికార్యములును జక్కఁబడును. ఆలస్యంబు కర్జంబు గాదు. కావున నెల్లభంగుల సందియంబుఁ దక్కి,

(1) రాముఁడు దండకారణ్యంబునఁ బదునాల్గు వత్సరంబులు వసియించునట్లును,

(2) నీసుతుఁడగు భరతుని పట్టాభిషిక్తుం జేయునట్లును,

వరంబు లొసంగవలయునని మగని బలాత్కరించి యడుగుము. ఇంతకంటె నభ్యర్థనీయంబులగు వరములు లేవు. వీనివలన నీతనయునకు సామ్రాజ్యాధిపత్యము సంక్రమించును. దాన నతం డశేషరాజ్యవిభవభోగాతిశయము గలిగి యుల రును." అని మంథర వచింప, కైకేయి తలపంకించి పూర్వము

దశరథుం డొసంగెదననిన వరద్వయమును నేఁడు కోరి కృతార్థనయ్యెదఁగాక యని యద్దేవి క్రోధానలజ్వలితవదనయై నిట్టూర్పు నిగుడించి యక్కార్యం బొడఁబడు నంతదనుక భోజన మజ్జనపానశయనాదు లుడిగెదనని నిష్ఠురంబుగాఁ బ్రతిజ్ఞ జేసి చెప్పరాని రోషము దన్నావేశింప నిజకాంచన భూషణచేలంబులు విడిచి, మాసినచీరఁగట్టి సర్వాభరణంబులు బుడమిం బడవైచి మేదినిపయిం బవ్వళించి తద్దయుఁబొక్కుచు వెక్కసపడుచుండెను.

## కైకేయి దశరథుని వరద్వయం బడుగుట.

అట్టి సమయంబున దశరథేశ్వరుం డంతఃపురంబుఁ బ్రవేశించి విముక్తభూషణాంబరయై కటికినేలం బవ్వళించి యున్న కైకేయి నవలోకించి సంతాపతప్తయగు నక్కాంత చెంతకుం జని, "హృదయేశ్వరీ! ఏనాఁడును మనోవిచారం బీషన్మాత్రంబయిన నెఱుంగని నీవు నేఁ డిట్టులుండుటకుఁ గతం బెయ్యది? చందమామనుబోలు నీ నగుమొగము కళదప్పి యుండుటకుఁ గారణమేమి? తగు పట్టుపుట్టంబుఁ దాల్పక, యత్యంతసుఖదాయకంబగు సుమశయ్యం బరుండుట మాని యేమికారణంబున నిట్లున్నదానవని" యడిగిన నమ్ముగుద రామాభిషేకవిఘ్నరూపంబైన యప్రియంబెఱింగింప నిశ్చయించి దశరథు నవలోకించి, "దేవా!

ఆ. వె. పుడమి కెల్ల నాదు ♦ పుత్రుని భరతుని
రాజుఁ జేయు టొకటి ♦ రాము విపిన
ములఁ జతుర్దశాబ్ద ♦ ములు నివసింపంగఁ
బంచు టొకటి యంచుఁ ♦ బతికిఁ దెలిపి.

ఈవరద్వయంబుఁ గృపసేయుము." అనవుడు నద్ధరారమణుం డద్భుతపడి కందిన డెందంబునం గుందుచుఁ "ప్రాణేశ్వరీ! ఏల, నీవీ లీల నేఁ డశుభావహంబు, నశ్రుతపూర్వంబు, నతిదారుణంబునగు పలుకులు పలికెదవు. రాముఁడు సకల ధర్మాధర్మకోవిదుండు. పరాక్రమ సంపన్నుండు. మహాత్మురుండు. అట్టి ప్రతాపవంతుని యభిషేకంబునకు సంతసింపక శోకసంతప్తచిత్తవై యిత్తెఱంగున నన్నేల పరితపింపం జేసెదవు? వినయ సంపన్నవైన నీకు రాముని యందు విరోధభావం బేల యుత్పన్నంబయ్యె? సుగుణరతుఁడు, శాంతవచోయుతుఁడు నగు రాము నిట్లు నిరోధింపకుము. నాదగు సద్గతికి నపాయంబుఁ దలపోయకుము. నీకు మేలగునని," వివిధవినయ సాంత్వవాక్యోపచారంబుల ననేక ప్రకారంబుల నాశ్వాసించి యమ్మగువ మనస్సును మరలింప నెంతయో ప్రయత్నించెను. కాని, సఫల మనోరథుఁడు గాఁడయ్యె. దాన సత్యప్రతిజ్ఞుండగు నద్దశరథుండు నిరుత్సాహుఁడై చేయునది లేక యనురాగంబు పెంపున నద్దేవి యామోదంబుఁ బడయఁగోరి యక్కాంతచింత మానుపనూని సతీమోహావిశేషంబున నవ్వరద్వయం బొసంగి యలుకఁదీర్చి యామెను బ్రసన్నం జేసికొనియె.

## సీతారామలక్ష్మణుల వనవాసము.

పితృభక్తి సాంద్రుండగు రామచంద్రుం డీయుదంతం బెఱింగి కైకేయీ ప్రేరితుండైన నిజజనకు వాక్యంబున కసత్య దోషంబు వాటిల్లు నను భయంబున చిత్తసంక్షోభకారణం బగు సామ్రాజ్యం బేలుటకంటె ఘోరాసురసంచయసంచా రంబున కాస్పదంబై భీషణపాషాణకంటకాకులకు నిధానం బైన వనంబున నిరపాయంబగు మునివృత్తిం బూని యుంటయు సముచితంబని ప్రీతిన దాల్చి వనగమన తత్పరుఁడయ్యె. కావున నతఁ డజినవల్కలధారియై కోదండాది మహాదివ్యాయుధం బులం బూని తల్లులకుఁ బితృనిర్దేశం బెఱింగించిన, మనసునం బట్టజాలక నిండి యుబికి పొంగిపొరలి వెల్లివిరిసి తెరలుతెరలై దుఃఖపరంపరలు జనియింప వారలాతని వనగమనంబు నివా రించుటకు సామర్థ్యంబు లేమిం జేసి చేయునదిలేక తగు దీవన లొసంగి పుత్రునివెంట ద్వారము దనుక నరుదెంచి సముచి తంబుగ వీడుకొల్పి తద్వియోగతరళంబైన హృదయం బెట్ట కేనియు నొక్కింత దిట్టజేసికొని యుండిరి.

వల్కలధారియై యటవికింజన నుద్యమించిన రాముం గని లక్ష్మణుం డంత ముకుళితకరకమలుండై తాను గూడ వెంబడించుట కనుజ్ఞ నిచ్చునట్లు ప్రార్థించిన నతం డెట్ట కేనియు నియ్యకొనియె. తనభర్త మృదువస్త్రంబులు విడిచి, నారచీరలు ధరించి, రాజ్యంబుఁ బరిత్యజించి చతుర్దశాబ్దంబు

లరణ్యావాసంబునకుఁ బోవ సమకట్టి యయోధ్యానగరంబు వెలువడనుండె నను వార్త నప్పరమ సతీవతంసంబగు సీత విని యయ్యవసరంబున మనంబున శోకంబు నొందక, వదనంబున వైవర్ణ్యంబించుకంతయుఁ దోఁపనీక పరమసాధ్వీశిరోమణి యగు కతనఁ దనకు భర్తృసాన్నిధ్యంబు కంటె స్వర్గంబు వేఱొండు లేదని భర్తృశుశ్రూషయందుఁ జిత్తంబు గీలుకొల్పి యమ్మహాత్ముని బాసి యుండనొల్లక యనురూపంబగు వ్రతం బంగీకరించి వనగమనంబున కభిముఖయై తన్నుఁ గూడ వనంబునకుం దోడ్కొని పొమ్మని ప్రార్థించె. అంత రఘువంశ జలధి చంద్రుండగు శ్రీరామభద్రుండు ముహూర్త మాత్రంబు చింతించి భావికార్యంబు విచారించి మనోవల్లభ పలుకుల కీయకొనక యిట్లనియె. "ప్రేయస్సీ! నీవు సుకుమారవు. ఎండ కన్నెఱుఁగని శుద్ధాంతకాంతవు. క్రూరమృగయుతంబును, వానర వారణ సమన్వితంబు నగు నరణ్యభూములఁ గ్రిమ్మరి దురంత క్లేశంబుల ననుభవింపఁ జాలవు. రాక్షస పిశాచాస్పదం బగుట ఘోరదురవస్థకు నిలయంబై, నిరయం బనఁదగు కాంతారంబున వాసంబు సలుపుట నీకశక్యంబు. కావున మదీయ వచనం బంగీకరించి నీ వత్తమామల భక్తి తొలఁగక, నా తమ్ముని భరతుని వెడమాటలేమియు ననక, కైకేయీ మహాదేవితో నెడపాటు చెందక, పతివ్రతా ధర్మంబులు విడువక, నా యమ్మలకుం బ్రియాచరణంబు లొనర్చుచు, సఖీజనంబులతోడఁ గ్రీడించుచు నిచట సుఖంబుండుము." అన విని

యకాంతాతిలకంబాక్రాంత చిత్తంబు శోకాయత్తంబుఁ జేసికొని ముకుళితకరాంబుజయై, "నాథా! ఇట్లానతీవలదు.

కం. జనకుఁడు, జననియు, సఖియును
తనయుండును దనకుఁ గారు ♦ తథ్యము ధరలో
వినుము సతి కింద నందును
ఘనుఁడగు పతియొకఁడె పరమ ♦ గతి తలపోయన్.

అని విజ్ఞులు నుడువుదురు. పతియే పడఁతుల పాలిటి పరమదైవంబు. భక్తితో ననిశంబు నిజభర్తృ శుశ్రూషయందు సమాహిత చిత్తయైన మగువ యఖిల లోకోత్కృష్ట. అట్టి యంగనకు నిఖిల యజ్ఞదాన తపఃఫలంబులు సులభంబులు. కావున నాకు నీకంటె నొండు దైవంబు లేదు. నీ పదసేవయే నాకు సర్వ సౌఖ్యదాయకము. నేను నియమయుక్తనై, తపశ్చరణశీలనై, పాతివ్రత్యంబుఁ బాటించుచు నిన్నుం గూడి యుండెద. ఇంతకంటె నాకుఁ గావలసిన భాగ్యమేమియున్నది? నన్ను వనంబునకుఁ దోడ్కొని చనుము." అని మిగుల జాలికలుగునట్లు ప్రార్థించి మెట్టకేల కాతని నొడంబఱిచి, తత్సమ్మతంబున వల్కలాజినధారిణియై చయ్యనం జని యత్తమామలకుం బ్రణమిల్లి తదనుమతి వడసి దీవనలఁ బొంది వన ప్రయాణోన్ముఖియై కందళించిన కౌతుకంబున భర్తపిఱుందన చనియె.

శ్రీరామచంద్రనరేంద్రుం డచ్చోట ద్విజజనంబులకు వందనం బాచరించి సీతాలక్ష్మణ సమేతంబుగ సుందర స్యందనం బారోహించి పురంబు వెలువడి చను నవసరంబున నప్పురవరంబునం గల బ్రాహ్మణ క్షత్రియ వైశ్యముఖానేక జనంబులు శోకసంతప్త హృదయులై దశరథుని దూషించుచుం గై కేయిని నిందించుచు దైవంబును దిట్టుచు సతీసుత బంధు మిత్రులయందు మమత్వంబు విడిచి గృహకృత్యంబులు దలంపక నిరానందులై రథంబు వెనుకొని కొంత దవ్వు చని యారేయి తమసానదీసైకత వేదికలందు విశ్రమించిరి.

శ్రీరాముఁడు చిత్రకూటమున కరుగుట.

అవ్వనంబునఁ బురజనంబులు రాత్రి సమయం బగుట నధికపథిశ్రాంతులై పైపుట్టంబులు పఱచుకొని బాహుదండంబులు తలగడలుగానిడి మైమఱచి నిద్రితులైరి. వారికి నిద్రాభంగము సేయనోపక సీతాలక్ష్మణ సమేతంబుగా రఘునందనుఁడు శయ్యాతలంబు విడిచి రథారోహణంబుఁ జేసి నవీనలతావికచ సుమనోగంధ బంధుర వాతూలంబులకుం బ్రచారమార్గంబగు గంగానది డాయుంజని యమ్మహానది యందు సుస్నాతుఁడై తజ్జలపానంబుఁజేసి యలయికఁ దీర్చి కొనియె. కొండొకవడి కతండు సుమంత్రునిం బిలిచి క్రమ్మఱ రథంబుంగొని చనుమనిన నతం డయోధ్యకు రథస్థుఁడై మగిడె. పిదప శ్రీరామచంద్రుండు తన భక్తుఁడును, శృంగిబేరపురా

ధీశుఁడునగు గుహుని రావించి యాతఁడొనరించిన నౌక నధి రోహించి, జాహ్నవిఁ దరించి దక్షిణతీరమును జేరి సీతా లక్ష్మణ సహితంబుగా గాఢాంధకార బంధురంబై, జనసంచార శూన్యంబైన వనంబున నిశావసమయమ్మునఁ జనుచుండె. అట్లు పోవుచు మార్గమున మునిరాజగు భరద్వాజుని యాశ్రమంబుఁ గని యమ్మహాత్ముని విధివత్ప్రకారంబున నర్చించి లబ్ధాశీర్వ చనుండై పుణ్యకథలు వినుచు నయ్యెడ సుఖంబుండె. ఒక్క నాఁడు రఘుకుంజరుఁ డమ్మునికుంజరునివలన భాగీరథీపరివేష్టి తంబై ప్రయాగకు సమీపంబుననున్న పుణ్యక్షేత్రంబగు చిత్ర కూటంబు నివాసయోగ్యంబైన ప్రదేశంబని విని యచ్చోటి కేగు మార్గక్రమంబెఱింగి మునికృత సపర్యలఁ బ్రతిగ్రహించి, యనుజ్ఞఁగొని చిత్రకూటశైల నిరీక్షాపేక్షుండై మహా మార్గంబుఁబట్టి చనుచు నొక్కచోట మునీంద్రజన సమా కీర్ణంబై, మనోహరంబై, దివ్యంబై, భవ్యంబై, సేవ్యంబై, దర్శనీయంబైయొప్పు చిత్రకూటనగంబుఁగనియె. దాని వైభ వంబున కచ్చెరువడి,

కం. అచ్చటఁ గొన్ని దినంబులు
ముచ్చటగా నుండఁ దలఁచి ♦ మునిసంఘముతో
మచ్చికఁ దమ్ముఁడుఁ దానును
జెచ్చెర నొక పర్ణశాలఁ ♦ జేసెం గడఁకన్.

ఇవ్విధంబుగ జనసంచార శూన్యంబైన ప్రదేశంబున నొనరింపఁబడిన యుటజంబునందు రాముఁ డనుజవధూసహితంబుగ ననుదిన స్నానపానాది విశేషంబులం బరితోషంబు నొందుచు వన్యాహారంబులతోడఁ బ్రాణధారణం బొనర్చుకొనుచుఁ గృతనివాసుండై యుండె. వారలయ్యరణ్యవాటిక యుద్యానవనవాటికగను, పర్ణశాల దివ్యభవనముగను వాడుచు నానందించు చుండిరి.

అటఁ దమసానదీ సైకతవేదికలందు నిద్రించియున్న పౌరజనంబు లరుణోదయకాలంబున మేల్కాని సీతారామ లక్ష్మణుల నెందునుం గానక రాముఁడు తమ్మువంచించి యరిగెనని శోకోపహతచిత్తులయి యేమి సేయనోపక తమతమ నివాసంబులకుం జనిరి.

## దశరథుఁడు స్వర్గస్థుఁడగుట.

ఇట నయోధ్యాపురంబున దశరథుఁడు సుఖభోజ్యంబగు ప్రాజ్యసామ్రాజ్యంబును విడనాడి, ఘోరనిశాచర సంచారార్హంబగు నరణ్యప్రదేశంబున కేగిన తనతనయుని యగణిత సుగుణగణంబులు డెందంబునఁ దలపోయుచు శోకాకుల మానసుఁడయి యాహారవిహారరాజకార్య పర్యాలోచనాది సకల కార్యములను వదలి యట్టిట్టనరాని మట్టుమీఱిన పుత్త్ర వియోగ సంజాత శోకానలంబునంబడి మ్రగ్గుచు,

శా. హా! కాకుత్థ్సకులాగ్రణీ! గుణమణీ!
హా! రామచంద్రా! నినుం
గైకేయీ వరయుగ్మ నిర్వహణ సం
క్రాంతుండనై పాసితిన్
శోకం బేర్చుఁ దొడంగె నింకఁ బిత్రురా
జుం గొల్వఁగా నేగెదన్
హా! కౌసల్య! సుమిత్ర! హా! జనక క
న్యా! హా! సుమిత్రాసుతా!

అని విలపించి శోకమూర్ఛితుఁడై మహీతలంబు పయిం బడి మేను విడిచి సకలజనవాంఛితప్రదాయకంబగు నాకంబు నకుం జనియె. సర్వాంతఃపుర కాంతలు నిజనాథు కళేబరంబు నవలోకించి దురంత చింతాభర పరిశ్రాంతలై రోదనంబు సేయుచుండిరి. అంతఃపుర మార్తనాదములతోఁ బూరితం బయ్యె. దశరథుని యవసానకాలమునం దొక్క సుతుఁడయిన నొద్ద లేకపోయిన కారణమున సుమంత్రాది సూరివరులు దుఃఖితాత్ములై భరతుని రాకఁ గోరుచు నాతని మృతకళేబర మును దైలద్రోణియందుఁ బదిలపఱచిరి. అంత మునిశ్రేష్ఠుం డగు వసిష్ఠుండు వడిగల చారుల రావించి, "మీరు తత్క్షణంబ పయనంబై కేకయరాజ పురంబున మేనమామ గృహమున నున్న భరతునిపాలికిం జని రామ వనవాసమును, దశరథు మరణము నేమియుఁ జెప్పక శీఘ్రముగ బయలుదేఱి రావలసిన

దని నామాటగ వాని నిచ్చటకుఁ దోడ్కొని రండ"ని పనిచె. వల్లెయని వా రప్పుడ కదలి ఘోరాటవుల నధిగమించి మహాపర్వతములను లంఘించి నదులను దరించి పోయి పోయి కేకయరాజనగరంబు సొచ్చి భరతునిం దగ సందర్శించి, "దేవా! పురోహితామాత్యబృందంబు సర్వంబు కుశలంబని పలికి తమ్ము నమ్మినట్లుగా వసిష్ఠభగవాను సాభిజ్ఞాన వచనం బెఱింగించి యాతని పనుపునఁ జనుదెంచినారమని" కృతప్రణాములై విన్నవించిరి. అతఁడు పోయి తనమాతులునకుఁ జారులు దెచ్చిన యాదేశం బెఱింగించి సెలవు వడసి శత్రుఘ్న సహితుఁడై రథారోహణంబుఁ జేసి యయోధ్యా నగరంబున కరుగుదెంచె. ఇట్లు వచ్చిన భరతుఁడు రథావతరణంబు సేసి పితృమందిరంబునకుం జని యందుఁ దండ్రిం గానక నిజజననియొద్ద కరిగి యామె దుర్మంత్రంబును, దత్ఫలితముగ రాముఁడు ఘోరవన ప్రవాసమునకును, జనకుఁడు పరలోక వాసమునకును బోవుట మొదలుగాఁ గల వృత్తాంతంబంతయు సాంగమ్ముగా నెఱింగి కోపదహన దందహ్యమానహృదయుఁడై యిట్లనియె. "జననీ! మదీయానుజుఁడగు రాముఁడు జగత్పావనుఁడు, వినయధురీణుఁడు, సర్వసద్గుణ సంపన్నుఁడు, నిత్య సత్యవ్రతుఁడు, నా కెన్నఁడహితమాచరించి యెఱుఁగని మహాపురుషుఁడు. నాకంటెను నీయం దెక్కుడు భక్తితోఁ జరించువాఁడు. అట్టి సర్వజనశ్లాఘ్య చరిత్రుని భవదీయ దుష్టవచన ప్రబోధితుఁడై మజ్జనకుఁడు విజనంబైన విపినస్థానంబున

కనిపి తద్వియోగార్తిచే నపగతప్రాణుం డయ్యె. దీన నీకు లోకంబున నిందయు, హీనతయు, దుర్గతియుం బ్రాపించె. పవిత్రతమమైన యిక్ష్వాకువంశ వినాశనార్థంబు ధర్మాత్ముండగు నశ్వపతికిం బుత్రికారూపమునం బుట్టిన పతివిఘాతినివగు ఘోరరాక్షసివి నీవు. నాకు మాతృరూపంబునం జూపట్టు మృత్యుదేవతవు. రామభక్తాగ్రగణ్యుండనైన నేను నీగర్భమునం బుట్టినకతంబున మహాపాతక దూషితుండనైతిని. జననిందకు బాత్రుడనైతిని. మహాపాతక స్వరూపిణివగు నిన్నుం జూచుటయు, నీతోడ సంభాషించుటయు మహాపాతకంబని'' పలికి తనతల్లి మూలమునం దనకుం గలిగిన దుర్యశమును దలంచి భరతుండు సవతితల్లుల మొగము జూచుటకుం గడు లజ్జితుండయి తల్పంబు పయింబడి దుఃఖించుచుండె. అయ్యవసరంబున వంశగురుండగు వసిష్ఠుండరుదెంచి పితృవియోగదుఃఖితుండయి, మహాశోకాంబుధిం దేలుచున్న భరతునింగాంచి, "వత్సా! నీవిట్లు విచారింపందగదు. వగచుటవలన నించుకయుం బ్రయోజనము లేదు. మనుష్యులు నిమిషభంగురప్రాణులు. దేహంబునకు జీవితంబు ధ్రువంబుగాదు. పుట్టుట గిట్టుట కొఱకే. పుట్టిన వానికిం జావును, జచ్చినవానికి మగిడిపుట్టువును నిశ్చితమయి యుండంగాం దప్పింప శక్యముగాని యీ జననమరణస్వరూపమగు సంసారమునకు నీవు సంతాపింపవలదు. ఇప్పట్టున ధైర్యంబు విడుచుట కార్యంబుగాదు. ధైర్యంబు వహించి శోకం బుడుగుము. పరలోకగతుండైన తండ్రికిం బ్రేతకార్యంబు నెఱపుట

ప్రస్తుతకార్యమని" తత్కాలోచిత వాక్యంబుల ననునయించె. పురోహితు వచనంబునం జేసి యతఁడు దుస్సహంబగు దుఃఖంబు నడంచుకొని పితృకళేబరమునకు దహనసంస్కారమునకుఁ బూర్వము జరుగవలసిన క్రియలన్నియును యథాశాస్త్రముగ సమాప్తంబునొందించె. పదంపడి పురంబున కుత్తరదిగ్భాగంబున సుగంధకాష్ఠములతోఁ బేర్చిన చితిమీఁద జనకుని మృతకళేబరమును బెట్టి దహనంబు దరికొల్పి శోకసంతప్తచిత్తుఁడయి శత్రుఘ్న మంత్రి పురోహిత బంధుజన సహితంబుగాఁ గ్రమ్మఱ గృహంబుఁ బ్రవేశించె. ఆ పండ్రెండవ దివసంబున శ్రాద్ధకర్మంబులన్నియు నిర్వర్తించి పరలోకక్రియ నుద్దేశించి పురోహిత పురస్సరముగ భూసురవరులకు నగణ్యగోహిరణ్యాది మహాదానంబులు సేసె. తదనంతరంబ తనకుఁ బట్టాభిషేకము జేసికొనఁ బ్రార్థించిన పురోహితామాత్యులకు భరతుఁ డిట్లనియె. "అన్నయుండఁ దమ్ముండు రాజ్యార్హుండుగాఁడు. మదీయానుజులయం దగ్రజుఁడగు రాముఁడు జ్యేష్ఠత్వముచే రాజ్యపరిపాలనార్హుండు. జ్యేష్ఠుఁడుండఁ గొండొకవాఁడు పట్టాభిషిక్తుఁడగుట ధర్మవిరుద్ధంబు. కావున జ్యేష్ఠుండు — గుణవృద్ధుండు — ధర్మశీలుండు — పరాక్రమవంతుండునగు నతఁడే రాజ్యపాలనాదక్షుఁడు కాని నేనెన్నఁడును గాఁజాలను. కులక్రమాగత ధర్మరక్షణముకన్న నాకు రాజ్యాది మహావైభవములు మిన్నలుగావు. నాకు శ్రీరామపదసేవనముకంటె శాశ్వతైశ్వర్యము వేఱొండు గానరాదు. కావునఁ గీర్తినిలు

వుటయే నాకు ముఖ్యధర్మంబు. ఏనుపితృభ్రాతృ విహీనుండనై నిరానందమైయున్న యయోధ్యయం దొక్కనిముసంబేనియు నుండఁజాల. మదీయాగ్రజుఁడగు రాముఁడిపుడు బహువిధ సంపదలు, గృహంబును బాసి, సమస్త సౌఖ్యములను, సామ్రా జ్యమును బరిత్యజించి, నారచీరలధరించి క్రూరమృగానీక భీక రారణ్యభూముల కేగి యందుఁ గ్రిమ్మరుచుఁ గందమూలఫలా శనుండై వనవాసక్లేశం బనుభవించు చున్నవాఁడు. ఏనిప్పుడ వనంబునకుం జని యాతనికి నా నేర్చువిధంబునఁ బ్రియంబు చెప్పి రాజ్యంబుఁ జేకొన వాని సర్వోపాయంబుల బలాత్కరించి సమస్త వైభవములతో మరల నయోధ్యకుం దోడ్తెచ్చి రాజ్యము గ్రహింపఁజేసి పుణ్యుండనయ్యెద" నని పలికి రామ దర్శన లాలసుఁడయి యనుచర సేనా సమేతంబుగా వెడలె.

## భరతుఁడు రామాశ్రమంబుఁ గనుంగొనుట.

ఇట్లు భరతుఁ డయోధ్య వెడలి యనేక పురంబులు, జనపదంబులు, బత్తనంబులు, గ్రామంబులు, బల్లెలు, గిరి వన దుర్గంబులు నిర్గమించి చనుచుఁ గతిపయదినంబులకుఁ జిత్రి కూటనగంబు డగ్గఱి తత్సమీపంబునం బొల్చు పర్ణశాలను విలోకించి యచ్చట రాముఁడు వసియించి యున్నవాఁడని యెఱింగి యచ్చటి కేగి బద్ధాంజలియై శ్రీరామచంద్రుని చర ణంబులపయింబడి శోకతప్తుండైన భరతుండు పితృమరణంబు విన్నవించి, "దేవా! అయోధ్యారాజ్యంబు నిట్టి దుర్దశకుం

బొలుపఱచిన పరమధూర్తయు, నిర్హ్యాగ్రహాగ్రస్తయు, నీకు నెడతెగని బాధాకారిణియు, నతి కుత్సితురాలు నగు కైకేయి కడుపునఁ బుట్టిన పాపాత్ముఁడను. మదర్థంబుగా నీవు రాజ్యోద్ధరణ కాంక్షనుండి విముఖుఁడవై యుండుట కిచ్చగించితివని" దుఃఖాతిభారవిహ్వలుఁడై మెలుగత్తి యేడ్వఁ దొడంగె. అపుడు రామ సౌమిత్రి జనకజలు శోకసంతప్త హృదయులై కన్నుల బాష్పంబులు నించుచు నెంతయు సంతాపము నొందిరి. వసిష్ఠ సుమంత్రాదులు తత్కాల సదృశంబులగు దుఃఖోపశమనవాక్యంబుల ననునయించిన బుద్ధిబలంబునం జిత్తంబు ధైర్యాయత్తంబు సేసికొని కించిత్పరిశాంత హృదయులైరి. అయ్యవసరంబున భరతుఁ డగ్రజునకు వినయవినమితశిరస్కుఁడై నమస్కరించి, "వంశపరంపరానుగతమైన ధర్మమున రాజ్యసింహాసన మధిష్ఠించుటకు నీవ యర్హుఁడవు. భోగభాగ్య పరిపూర్ణులై మున్నే చక్రవర్తి పరిపాలనమునను బడయని యౌన్నత్యమును నీ యేలికకాలములో నందవలయునను నాసతో నయోధ్యానగర జనులు తమ రాజ్యపరిపాలనకు వేచియున్నవారు. నీవు నిరంతర భోగదాయకంబగు పూజ్యసామ్రాజ్యభారంబు వహింప నయ్యెడ కరుదెంచి పట్టాభిషిక్తుండవై ననుం గృతార్థునిఁ జేసి రక్షింపుము. నీ పట్టాభిషేకోత్సవ దర్శనమ్మునకై సర్వరాష్ట్ర జనులు వేగిరపడుచున్నవారు. ఏనును భవదీయ రాజ్యాభిషేకోత్సవము చూచి హర్షించెదను." అని వినయముతోఁ బెక్కుభంగులఁ బ్రార్థించె.

శ్రీరామచంద్రుం డాతనిం గని, "అనుజా! ఇక్ష్వాకు వంశోద్భవులు నిరంతర సత్యవాక్పరిపాలకులని నుతిఁగన్న విషయము నీ వెఱుంగనిదిగాదు. ఏ నరణ్యావాసము సలుపఁ బితృశాసనంబునఁ గైకేయీ మహాదేవిచేతఁ బ్రబోధితుఁడనైతి. తండ్రి సత్యముఁ గాపాడని పుత్రుని జన్మమేల? తండ్రి సత్యమును గాపాడి వాని సత్యవంతునిఁగాఁ జేయుట నాకుఁ బరమధర్మమును నవశ్యకర్తవ్యమునై యున్నది. కావున నేను దైవసముఁడయిన తండ్రి నియోగంబుఁ గడువం జాల"నని ధర్మయుక్తంబుగాఁ జెప్పి వాని నొడంబఱిచి, వసిష్ఠోపదేశమున రాముఁడహల్యాశాపవిమోచన నిధానమై, భవ్యమై, భవబంధవిమోచనచణమైన శ్రీపాదుకాద్వయం బొసంగి, "పితాజ్ఞానుసారంబుగఁ బదునాల్గు వత్సరంబులు వనవాసంబు సల్పి మగిడి యయోధ్యకుం జనుదెంచెద. అంత దనుక నాప్రతినిధిగ నీ వయోధ్యాపట్టణసింహాసనాధ్యక్షుండవై, యశోధవళితాశాంతుండవై, మహోన్నతంబైన సామ్రాజ్యంబుం బరిపాలింపుము" యాజ్ఞాపించి దీర్ఘాయురారోగ్య స్వస్తివచనంబుల దీవనలిడి యాతని మగుడ నయోధ్యకుంబుచ్చె.

## పాదుకాపట్టాభిషేకము.

రామభక్తిభరితుఁడగు భరతుఁడు భ్రాతృవచనంబు సేయకునికి ధర్మవిరుద్ధంబని మదినెంచి సోదరవియోగ సంజనిత శోకపరీతాపదందహ్యమాన మానసుఁడయి యహల్యాశాప

విమోచనకారణ శ్రీరామపాదపద్మపరాగ శ్రీమేదురంబులగు పాదుకల శిరంబున నిడికొని పురోహితామాత్య సమేతుఁడయి పరివారంబు వెంటరాఁ బరమోత్సాహుఁడయి యప్పుడ కదలి కతిపయ ప్రయాణంబుల నయోధ్యం జేరె. రామరహితంబును, నిరానందంబును నగు నన్నగరంబున నుండనొల్లక సమస్త మంత్రి జనానుమతంబున నా రామపాదారవిందభక్తశిఖామణి సపరివారంబుగా బయలువెడలి నందిగ్రామంబుఁ జేరి రామపాదుకలకు నభిషేకించి వాని నర్చించుచు ననాసక్తుఁడగు కింకరునివలె రామాగమనకాంక్షతో రాజ్యపాలనం బాచరించుచుండెను. ప్రజలు నిత్య సత్యప్రవర్తనులై, కృషి వాణిజ్యాది స్వకర్మనిరతులై కాలమవలీలఁ బుచ్చుచు సర్వ సౌఖ్యముల నొందుచుండిరి.

శ్రీరస్తు.

శ్రీవేంకటరమణ పరబ్రహ్మణేనమః.

# శ్రీరామకథామృతము.

## అరణ్యకాండము.

### సీతారామలక్ష్మణులు శరభంగుని సందర్శించుట.

ఇటఁ జిత్రకూటంబున శ్రీరామచంద్రుండు క్రమ్మఱ భరతాగమనంబు శంకించి పెక్కుదినంబు లొక్కయెడ వసియించుట ప్రీతిజనకంబు కాదని తలపోసి మునిజనశరణ్యం బయిన దండకారణ్యంబున కరుగనిశ్చయించె. అట్లతఁడు కృతనిశ్చయుఁడయి పయనంబై చనుచు నమ్మహారణ్యమధ్యమునఁ దమతమపూర్వవైరముల నుజ్జగించి సమత్వమున, స్నేహభావమున సంచరించు శరభ, సింహ, గజ, శార్దూల, హరిణాది జంతువులచే నొప్పు శ్రీమదత్రిశరభంగాదిమహర్షుల యాశ్రమంబులంగని యమ్మహాత్ములను సేవించి వారివలనఁ బుణ్యకథాశ్రవణంబు సేయుచుండె. సీతాకాంతయు నొకనాఁడు పరమపతివ్రతయును, తపస్వినియునైన యత్రిమహర్షి పత్నియగు

ననసూయామహాదేవి కడకుం జని భక్తిపూర్వకంబుగ నమ స్కరించిన నామె కరుణాన్వితయగుచు శ్రీరామభద్రు సద్గుణం బులు కీర్తించి యనంతరంబ యాయమకు,

చ. అతివల కింపునందభిమ
తార్థకరుండు విభుండు, తన్మనో
గతి నతియుక్తి చేఁ గని య
కల్మషభక్తి సదా మనంబులో
నతఁడె గురుండు దైవముఖ
లార్థదుఁడంచుఁ దలంచుచున్నము
న్నతమతిఁ గొల్చి యుండుట స
నాతనధర్మము లాఁడువారికిన్.

చ. పతిఁ గడవంగ దైవతము
భామల కెందును లేదు, ప్రీతుఁడై
పతి గరుణించె నేని కుల
భామలు భాసురభూషణాంబరా
న్వితధనధాన్యగౌరవము
విశ్రుతసంతతియున్ యశంబు స
ద్గతియును గాంతు రొండు మెయిఁ
గాంతురె? యెన్ని తెఱంగు లారయన్.

తే. కన నరుంధతీ, సావిత్రు ♦ లను గరితలు
మగల సేవలచేఁ గదా ♦ మహిమఁ గనిరి,

పతిని దైవంబుగాఁ గొల్చు ♦ భామినులకు
సౌఖ్య ముభయలోకములను ♦ జరుగు ధ్రువము.

కం. జపములు తపములు వ్రతములు
నపరిమితార్థాన్న దాన ♦ మధికప్రీతిన్
విపులముగఁ జేయుచున్నను
నుపమింపఁగఁ దగరు సతుల ♦ కువిదలు ధాత్రిన్.

కావున,

కం. పతిసేవకంటె ధర్మము
సతులకు శ్రుతులందు లేదు ♦ సతతము పతి శ్రీ
పతిఁగా మదిలోఁ దలఁచుచు
సతిభక్తి భజింపు తత్ప ♦ దాంబుజ యుగమున్.

అని యింక ననేకవిధంబులగు పతివ్రతాధర్మంబు లుప
దేశించి సత్యంబులగు నాశీర్వాదంబుల నొసంగెను.

## విరాధుని వధ.

సీతారామలక్ష్మణులు ఋష్యాశ్రమంబులఁ బరమార్థ
సంభాషణంబులఁ దనియుచుఁ గొన్ని దివసంబులు గడపి
తదాశ్రమవాసుల నానావిధపూజనంబులం బరితుష్టులం జేసి
వారు సంప్రీతి నొసంగిన మంగళాశీర్వాదంబులఁ గైకొని
తదనుమతి వడసి పయనంబై దండకారణ్య మధ్యంబునఁ జను
చుండిరి. అట్టితఱి సకలసాధువిరోధుఁడగు విరాధుఁడు

వైదేహి నెత్తికొనిపో నుద్యోగించుచుఁ బన్నుగడచే బలాత్కృతిగాఁ గరమ్ములు పట్టి లాగుకొనిపో నుంకించె. అపుడు రఘూద్వహుండు భయవిహ్వలయై వడఁకుచున్న ప్రియాంగన నవలోకించి యామెదుస్స్థితికి మనంబునఁ గరంబు చింతించి రౌద్రరసోల్లాసమూర్తియై యా రాక్షసాధముని బాహుదండంబు శాతఖడ్గంబున ఖండించి సీతారమణిం గైకొనియె. అనంతరం బవ్వనంబునం గల ఋష్యాశ్రమ స్థలంబులకుం జని యందందుఁ గల మహామునీంద్రులం గనుంగొనిన వారును బ్రత్యుత్థానంబుఁ జేసి రామునకు వినతులై యాసనపూజా విధానంబులు గావించిన నతండును బ్రముదిత మానసుండగుచు నిర్దోషులగు నప్పరమర్షుల ప్రార్థనంబున వారలకు బాధంగలిగించు రక్కసుల నుక్కడఁగించునట్లు భూతదయాపరిపూర్ణ హృదయుఁడయి యభయదానం బొసఁగెను.

## రాముఁడగస్త్యమహర్షిని సందర్శించుట.

రాముఁడు సీతాలక్ష్మణసహితుండయి యగస్త్యాశ్రమంబునకుం బోవసమకట్టి యచ్చోటువాసి కొంతదవ్వరిగి యొక్క సమస్థలంబునఁ బురాణంబై నిర్జనంబై రమ్యంబై యుండు నొక్క మహానీయాశ్రమంబుఁ గాంచి యందారాత్రి పుచ్చి మఱునాఁ డాదిత్యోదయంబున మేల్కని కాలోచిత కృత్యంబులు దీర్చి యగస్త్యమహర్షిపుంగవుని సందర్శించి

యమ్మునీంద్రు నభినవామోదమేదురములగు సుమమ్ముల యథావిధిఁ బూజించెను. అనంతరంబ,

తే. గీ. మహితయశుఁడగు శ్రీరామ ♦ మనుజపతికి
ఖడ్గకోదండ తూణీర ♦ కవచముఖ్య
సాధనంబుల నాతఁడొ ♦ సంగి మఱియుఁ
జెప్పఁ దొడఁగెను గాథలఁ ♦ జిత్రముగను.

వీనుల విందొనరించెడి యాపుణ్యకథేతిహాసంబు లాకర్ణించి లబ్ధాశీర్వచనుండయి యనుజవధూసహితంబుగా రాముఁడు తదాశ్రమంబు వెడలి యరణ్యంబునఁ జనుచు ననేకంబులగువకుళచంపకకదంబాశ్వత్థార్జునసాలామ్రతింత్రిణ్యశోకప్రభృతివృక్షరాజంబులు గల పంచవటి యనంబరఁగు నొక్కపుణ్యప్రదేశంబుఁ బ్రవేశించి యోగ్యస్థలనిరూపణంబు కొఱకు నలుదిక్కులుం బరికించి యొక్క సమస్థలంబున పత్రమందిరమును విరచించి యందు వసించి శాకమూలఫలంబుల దేహయాత్ర నడపుచు వనవాసశేషదివసంబులు ద్రోయుచుండె.

సర్వగుణధాముండగు రాముని ధర్మపత్ని క్రూరమృగానీకభీకరారణ్యంబున దినంబులు పుచ్చుచున్నను రాజ్యత్యాజ్యము, సౌఖ్యహైన్యము, ఐశ్వర్యరాహిత్యము, మున్నగు వానిచే నాత్మగతంబున లేశమును గలఁత నొంద దయ్యె. అమ్మహారణ్యపర్వతప్రదేశంబునం దాయమ ఘోరారణ్యం

బులు రాజభవనంబులుగను – శిలాతలంబులు సుమశయ్యలుగను–ఆశ్రిమస్థమృగముల నాటవస్తువులుగను నుపయోగించుకొనుచు మనోహరముగ విహరించుచుండెను. వెండియు నవ్వనంబు నుద్యానవనముగఁ దలంచుచుఁ బతిసేవాపరాయణయై, పతినే యేడుగడగ నెంచి సదా పూజించుచు నా సాధ్వీశిరోమణి తనజీవితమును సార్థకపఱచుకొనుచుండెను.

## శూర్పణఖ వృత్తాంతము.

ఒక్కనాఁడు సత్యవ్రతధురీణుఁడగు రాముఁడు కాంతారంబునఁ బర్ణశాలకడ సీతాసమేతంబుగా సుఖాసీనుఁడయి లక్ష్మణునితోడఁ బరమానందంబునఁ బరస్పరప్రియమధురగోష్ఠి సలుపుచుండె. అయ్యవసరంబున రావణునిచెల్లెలగు శూర్పణఖ యనురక్కసి చనుదెంచి యాజగద్భద్రుఁడగు రామభద్రు రూపవయోలావణ్యవైభవగాంభీర్యచాతుర్య తేజోవిశేషంబులకుం జొక్కి చక్కెరవిలుకాని బారికిం జిక్కి మనోజాతశాతశరజర్ఝరీభూతమానసయై, "ఆహా! ఏమి, మనోహరాకారము! ఈతని సౌందర్యంబుఁ గన్నవారు కాముని గీముని బ్రశంసింపరు. భానుసమతేజుండగు నీరాజేంద్రుఁడు తనదివ్యతేజంబున నీజగంబెల్ల వెల్గొందఁ జేయఁజాలి యున్నవాఁడు. సకల లక్షణలక్షితుండైన వీనితో గలసి మెలసియుండి చిరసౌఖ్యం బనుభవింపఁజాలకుండిన నా చక్కఁదనం బదేమిటికి? జవ్వనం బేటికి?" అని రోసి లజ్జాభయంబు లుజ్జగించి

రామచంద్రునిం జూసి, "రాజచంద్రా! అపూర్వమనోజాత ప్రతీకాశసుందరుండవగు నీయందంబు నాడెందంబుఁ దగిలి యున్నయది. నీవు నాకుఁ బతివై నావలన నిష్టోపభోగంబుల నందుము. నా జీవితంబు సార్థకంబుఁ జేయుము" అని పలుకుచు నాతనిఁ గలియుసరిగె. అంత నతఁడు విస్మితుఁడయి యిట్లనియె. "నాభార్య నాకడం గలదు. కాని మదీయాను జున కట్లు లేదు. అల్లదె, నాతమ్ముఁడు. వానిం భర్తఁగా భజింపుమని" పలికి లక్ష్మణుంజూపెను. రాక్షసాంగనయు మోహావేశంబునఁ బరిహాసముగాఁ జిఱునగవు నగుచు నత్యంత సంతోషతరంగితాంతరంగయై లక్ష్మణునిం డాయంబోయిన నతండు దాని నుపలక్షించి మందస్మితాననుండయి, "ఓసీ, రక్కసీ! నీకేల, యీ తెలివిలేమి? ఏను భృత్యమాత్రుండనై యమ్మహాత్ముని భక్తిపూర్వకముగ సపర్యఁ గావించుచుం గొల్చియుండుదు. రామపాదశుశ్రూషార్థంబు నియంత్రితుఁడ నైన నేను నిన్ను భార్యంగా వరియింపఁదగునే? భ్రాతృసేవా యత్తచిత్తుండనైన నాకు నీవు భార్యవైతివేని నీవును నావలె దాస్యంబుసేయఁ గడంగ వలయును. దాన నీ కేమియు సౌఖ్యం బొదవ నేరదని" నేర్పునం దీర్పుమాటల నేకంబులాడి దాని నూఱడించెను. తన ప్రయత్నం బెల్ల "బూడిదలోఁబోసిన పన్నీరు వోలె" వ్యర్థంబగుడు నద్దనుజాంగన వెతఁజెంది రాముని కెలన సముచితాసనంబున మనోభవరాజ్యలక్ష్మియుం బోలె నున్న సీతాకాంత సౌందర్యాతిశయంబున కోటుపడి.

చూచుచు నిజాంతర్గతంబున నీభూతలేశు దయితయగు సీత తోడ నీడగు చేడియ లీరేడులోకంబుల లేరు. ఇమ్ముదయాన సౌందర్యంబెన్న బృందారక సందోహంబునకు యశక్యంబు. ఈమె రూపలావణ్యవిలాసంబు లమానుషంబులు. ఇట్టి మనోహరయువతీలలామంబు నాహారంబుగఁ గొనినచో నేను శ్రీరామచంద్రునకిల్లాలినై యీసాగసుకానికడ నేకతంబున సుఖలీల నుండనొప్పునని రానున్న యపాయంబును దలపోసియు మిగులఁ దెగువఁ జేసి యామెను మ్రింగ గమకించి పయింబడ నుద్రేకించుచున్న యాదుష్టచారిణి తెగువకు రాముఁడు క్రోధమూర్తియై, యేదియో సౌమిత్రికిఁగనుసన్నఁ జేయ నతఁ డగ్రజు కనుసన్న నెఱింగి క్రోధానలజ్వలితచిత్తుడయి నిశితంబగు ఛురికంబున నక్కామరూపిణి యగు శూర్పణఖను గర్ణనాసికాచ్ఛేదంబున విరూపగఁ జేసిన, నా రఘురాముఁడు పరాభవనిర్విణ్ణమైన యద్దైత్యకామిని మోముం దిలకించి యానందహృదయుండయ్యె.

## ఖరదూషణులు యుద్ధసన్నద్ధులై వెడలుట.

రావణానుజ యగు శూర్పణఖ నెత్తుటం జొత్తిల్లుచుఁ దనయంగవికలత్వంబునకు శోకవిషాదరోషంబులు మనంబున ముప్పిరిగొన నచ్చోట నిలువ నోపక లజ్జావనత వదనయై యాక్రందించుచు రయంబునం జని తనకు దశరథసూనులవలని

పరిభవంబు తెలియఁగు ఖరదూషణాదిసోదరుల కెఱింగించి కంటికి మంటికి నేకధారగా నేడ్చుచు మహారోదనం బొనర్చెను. వారలు తమ గారాబు చెలియలి కైన పరిభవంబునకుం గోప రక్తనయను లగుచుఁ గ్రోధాగ్నికీలావిస్ఫులింగమ్ములు లెగయం బండ్లు పటపటఁ గొఱుకుచు రోషాక్రాంతచిత్తంబుల మనదాడి కెవఁడ్డోడక పోరాడనోపునని యట్టహాసంబు సేయుచుఁ గాల రుద్రునివలె గర్జించి పలికి తత్క్షణంబ సమరసన్నద్ధులై పదునా లుగువేలరక్కసులతోఁ సంగ్రామంబునకుం జని సంరంభవిజృం భితులై రామునిం గదిసి భీషణంబగు సంగ్రామంబు సలిపిరి. రాక్షససైన్యయోధు లందఱు నగ్గిరీంద్రధీరుండగు రఘువీరుని కాండప్రకాండంబులం దెగి నిశ్శేషంబుగా లయంబు నొందిరి.

## శూర్పణఖ లంకాపురంబునకుఁ బోవుట.

రఘువరకృతవికృతముఖ యగు శూర్పణఖ ఖరదూష ణాది యాతుధానుల నిధనంబున కెంతయు దుఃఖించుచు రాముని పరాక్రమప్రకారంబునకు భయంబు నొందుచుఁ దన కర్ణనాసికాచ్ఛేదనంబునకు లజ్జించుచు మహానాదంబు సేయుచు నతిశీఘ్రగమనంబున లంకానగరంబుననున్న తనయన్న యగు రావణుపాలికింజనియె. తదనంతరం బామె తనవైరూప్యంబు దర్శింపఁ జేసి యద్దను జేంద్రున కియ్యుదంతం బంతయు నేర్పడఁ జెప్పి, "ఆహా! ఏమని నుడువుదు? రఘుకులతిల

కుండగు నా రాముపత్ని సొగసేమని వర్ణింతు? ఆ! ఏమి! ఆనవమోహనాంగి ఠీవి? ఏమి! దాని మోవి కావి! అరవింద వాసినియగు నాదిలక్ష్మికైన నెంచఁ దలంచితిమేని వంకలు గలవు. కాని యమ్మనోహరచారుగాత్రికి లేవు. అద్దేవి సాముద్రికోక్త సర్వలక్షణసంపన్న. అట్టి సౌందర్యఖనిని నేనెన్నఁడును జూచి యెఱుఁగ. సుందరి యన నప్పొలఁతియే సుందరి గాని, తదితరులు సుందరులా! నిరుపమాన సహజసౌందర్య సద్గుణ విభాసమానయని సన్నుతిఁగన్న యయ్యన్నులమిన్న నీకెంతయుం దగియెడు.

సీ. కన్నులో కలువలో ♦ కాముబాణంబులో
        తెలియఁగా నింతికిఁ ♦ దెలియరాదు,
పలుకులో కిన్నెర ♦ పలుకులో చిలుకల
        పలుకులో నాతి కే ♦ ర్పఱుప రాదు,
అమృతాంశుబింబమో ♦ యద్దమో నెమ్మోము
        పెంపుతో సతికి వ ♦ ర్ణింప రాదు,
కుచములో బంగారు ♦ కుండలో చక్రవా
        కంబులో చెలి కెఱుఁ ♦ గంగరాదు,

గీ. కురులో నీలంబులో తేఁటి ♦ గుంపు లొక్కొ
యనుచుఁ గొందఱు సంశయ ♦ మందు చుంద్రు
దాని సౌందర్యమున కీవి ♦ ధాత సృష్టి
సరిసమం బీడు జోడెన్న ♦ సతులు గలరె!

ఏమి! ఆమనోహరమగు ముఖసౌందర్యము! అజ్జగజ్జన సన్నుతశీల చక్కఁదనము వర్ణింపఁ జతుర్ముఖపంచముఖ షణ్ముఖసహస్రముఖులకైన నలవి కాదు. ఆసౌందర్యరాశిని జూడని చూపులు చూపులా! అట్టికళ్యాణరూపసౌశీల్యలక్షణంబులఁ గనుపట్టినట్టి ముద్దుగుమ్మ నీకు సిద్ధించెనేని నీవు ముజ్జగంబులు జయించిన యంతకంటె నెక్కుడగు సంతోషంబుఁ జెందఁగలవని" నుడివె

రావణుఁడు మారీచుని దనకు సహాయుని గన్గొనుట.

మాయోపాయధురంధరుండగు పంక్తికంధరుండు తన చెలియలి పలుకు లాకర్ణించి యాసీతావధూటి చక్కఁదనమ్మునకు మక్కువపడి కాముని యుక్కుటురులం జిక్కికొని మోహాంధకారంబునఁ గన్నులు గానక తీర్థమును స్వార్థమును గూడఁ గలసివచ్చునని యెక్కుమ్మడి పుష్పకంబారోహించి రభసంబునఁ దనప్రధానియును, మాయాశాలియును, గామరూపుఁడునగు మారీచుని పొలికింజని సన్మానంబువడసి తన యభీష్టం బెఱింగించి తనపూన్కి నెరవ రమ్మని ప్రార్థించె. అంత నతఁడు విస్మయంబంది, "దేవా! దేవరమాట కడ్డము వచ్చుచున్నాను. పరదారాపహరణము పరమపాతకము. పరదారాభిమర్శనంబు కంటె నధికంబగు పాపంబు వేఱొండులేదు. కాలకూటవిషమునైనను మ్రింగవచ్చును గాని లోకపావని యగు సీతామహాలక్ష్మి నపహరించి నెగ్గుట కడుంగడు దుర్ల

భంబు. అప్పుడతివిభుం డనన్యసామాన్యవిక్రముఁ డాతనిమహి మం బీశ్వరునకుఁదక్క నన్యుల కెఱుంగఁ దరంబుగాదు.

సీసమాలిక.

ఎవ్వని కృపచేత ♦ నెల్ల లోకంబులు
భద్రమైయుండు శా ♦ శ్వతము గాఁగ,
నెవ్వని లావణ్య ♦ మినవంశవనరాశి
కబ్జారి కాంతియై ♦ యులరు చుండు,
నెవ్వని బాణాగ్ని ♦ యేపార గాధేయు
యాగకాలమున దై ♦ త్యాళి కాల్చె,
నెవ్వని దోశ్శక్తి ♦ కీశ్వరు చాపంబు
కరికదళీన్యాయ ♦ కలితమయ్యె,
నెవ్వని పాదాబ్జ ♦ మెంచ గౌతమసతీ
పాషాణరక్షణకలా ♦ ప్రభవ మయ్యె,
నెవ్వని నామంబు ♦ లెఱుఁగక తలఁచిన
యాతనా దురితంబు ♦ లడఁగుచుండు,

గీ. నతఁడు దశరథనందనుఁ ♦ డార్తజనుల
పాలి కల్పకభూజమై ♦ పరఁగు వాఁడు,
పద్మగర్భాదిదేవతా ♦ వర్గనుతుఁడు,
చారుతరమూర్తి శ్రీరామ ♦ చంద్రమూర్తి.

అమ్మహానుభావుని ప్రభావంబు లనేకంబులు విని యున్నవాఁడ. శక్రాదిదిగీశులైన నాతనికి సములు గారు. అట్టి

రాజసింహునితోడ నిగ్రహించుటకు సురాసురరక్షోయక్ష గరుడ గంధర్వ సిద్ధ సాధ్యచారణ విద్యాధర గుహ్యక పతత్రి ప్రముఖ నిఖిల భూతలంబులందు నెవ్వండును సమర్థుండు గాఁడు వాని సతి యగు సీత మానవతి యగు మగనాలు. కాని యవి వాహిత కాదు ఆమె నీకెవ్విధిఁ జేఁజిక్కును? అందని ప్రూని పండున కట్టు చాచుట యవివేకము కదా? బ్రహ్మవంశసంజాతుఁడవు. సాక్షాత్పులస్త్యుని పుత్రుఁడవు. నీవెఱుంగని ధర్మములు లేవు. నీయట్టి మహానుభావులిట్టి యకార్యంబుఁ దలపెట్టుట యక్రమము. ఆసతీమణిని ముచ్చిలుట యను నురుతరపాప కార్యంబు సేయ నొడిగట్టకుము. సీతాపహరణరూపాధర్మఫలం బూరక పోదు. కావున నట్టి జతనం బుడుగు మని" సువ్యక్తంబుగఁ బ్రబోధించె. క్షేమయుక్తంబైన మారీచుని ప్రబోధ మంతయు "నాయుర్విహీనుండైన రోగికిం బ్రయోగించు నౌషధంబు వోలె" నద్దురాత్మునెడ ఫలింపదయ్యె. విధికృతం బెవ్వరికిం దప్పింప నశక్యంబు. మారీచు సద్బోధనల వలనఁ దనకయ్యంగనాలాభంబు గలుగదని సీతాపహరణాయత్తచిత్తుఁ డయిన యద్దశాననుండు కోపోద్దీపితభ్రుకుటీయుతుండై, యుగాంతకాలరుద్రుం బోలెఁ గ్రాలుచు భీషణంబులగు రోష భాషణంబుల "నోయి, మారీచా! నీవాడు వాక్యంబులు నాకు సమ్మతంబులు గానేరవు. నాప్రోల భయంబుఁ దక్కి మదాంధుండవై యిట్టి విప్రియంబులు పరుషంబుగాఁ బలుకుచున్న నీ మొండిధైర్యం బేమనవచ్చు? ఇట్టి ధర్మోపదేశము లాచరింపు

మని నిన్నుఁ బ్రార్థింపలేదు. నేఁ జెప్పిన చొప్పున నడచుటయె నీయొనర్పనగు కార్యంబు. ఏనుద్దేశించి వచ్చిన కార్యంబునందు నీవు బాసటవై ముందు నడువవలయు. కావున నీవు నీమాయా బలంబునం జిన్ని గంతులచే దృష్టినాకర్షించు నొకస్వర్ణమయం బగు జింకరూపముం దాల్చి రాముని పర్ణశాలాప్రాంగణంబున కరిగి నీనైపుణ్యంబున నాతని దూరగతుం జేయుము. అత్తఱి యెఱింగి కపటపరివ్రాజకరూపధరుండనై చని నేనయ్యాశ్రమం బున నొంటిజిక్కియున్న జానకిం గొనితెచ్చెదను. ఇందున కొడఁ బడవేని నిశాతంబగుఁ గృపాణంబున భవచ్ఛిరంబుఁ దెగవ్రేసె దనని" పలికిన విని కటకటంబడి, "అయ్యో! పుణ్యమునకుఁ బోయినఁ బాపమెదురగుట యిదియే కాఁబోలు. కాలపాశ పరిక్షిప్తులగు వారు నిర్గతజ్ఞానేంద్రియాంతఃకరణవ్యాపారులై, కార్యాకార్యంబు లెఱుంగక వర్తింతురు. రోగికి మేలైన యోగిరంబు రుచింపని యట్లు, నా హితవచనంబు లీకలుషు నకుఁ గర్ణశూలంబులై బిట్టుగారింప నొడికట్టె. ఏమి సేయుదు? కామశరపీడితుఁడును, గామవృత్తుండునగు నిద్దానవేంద్రుని చేతం జచ్చుటకంటె మహాతేజుండును, మహాసత్త్వుండును, మహాపరాక్రముండును, మహానుభావుండునగు రామచంద్రు నిచేఁ బ్రాణంబులువాసి నిలింపలోకసుఖంబుఁ బడయు టయే సర్వశ్రేయోదాయకమని" మనంబున నిశ్చయించి రావణభయంబున దీనుండై తదాజ్ఞానుసారంబుగ మెలంగ నిచ్చగించె.

అంతఁ దాటకాతనయుఁడగు మారీచుఁడు కాంచన మయమృగరూపధరుండై రామాశ్రమంబు డగ్గరి సీతాదేవి దృక్పథంబున నాయమ కెంతయు నాహ్లాదంబంకురించునట్లు చిందులు ద్రొక్కుచు, మెఱుంగు తెఱంగునఁ జెలంగుచు నడయాడుచుండ నమ్మాయామృగ గ్రహణకుతూహలయై జనకజ రామలక్ష్మణులం జీరిన వారయ్యెడ కరుదెంచి,

ఆ. వె. కనకకాంతి మేనఁ ♦ గడు నొప్పుచుండెడి
కనకమృగము నొకటిఁ ♦ గాంచి రచట
దానిఁ జూచి సీత ♦ తనమనంబునఁ గోరి
విన్నవించెఁ బతికి ♦ వినయమలర.

"నాథా! ఏను మున్నెన్నియో విచిత్రమృగంబుల విలోకించితిఁ గాని యిట్టి స్వర్ణమయంబును స్ఫురద్రూపమును గల కురంగంబు జగంబుల నెందునుం గాంచి యెఱుంగ. ఇయ్యది యపూర్వంబై, మనోనయనానందకరంబై యొప్పు చున్నయది. నాకు దీనియం దెక్కువమక్కువ గలదు. నీకును బ్రియంబు గలదేని దీనింబట్టి తెచ్చి నాకు మనఃప్రియంబు సేయుము." అని ప్రార్థించెను. సతు లద్భుతవస్తువులయం దా సక్తలగుట లోకసామాన్యమే కదా!

అద్దశరథరాడ్తనయుఁడు ప్రియురాలికిఁ బ్రియం బొన గూర్చువాఁడై బాణంబులు ధరించి యాతుంటరి మృగంబుపైఁ గంటగించి వెంటనంటి పోవఁ దన్ను బట్టవచ్చు రాముని౦

జూచి యప్పసిండి మెకంబు చెంగుచెంగునం గ్రేళ్లురుకుచుఁ గుంజంబులందు దూఱుచుఁ బూరిమేయుచు భీతిఁ బాఱుచు నించుక నిలుచుచుఁ బట్టవచ్చు నప్పుడాతనికిం జిక్కక నానా ప్రకారంబులం జిక్కులు పెట్టుచుఁ గంటకశిలాదుర్గమంబగు మార్గంబున నతిదూరం బరిగె. ఆనరపతియుఁ బిఱుందం జనుచుఁ జిక్కమికి మిక్కిలి విసివి కినిసి రక్కసుండని గ్రక్కున నెఱింగి యొక్కవడికి నక్కునం గ్రుచ్చిన నక్కోల మృగరూపధరుఁడైన మారీచుని శరీరంబు భేదించిన శరార్తుండై యన్నిచుండు, "హా! లక్ష్మణా! హతోఽస్మి" యని వైదేహికి సంతాపంబుఁ గూర్ప మేఘగర్జనంబు ననుకరించు రామవాక్యానురూపంబగు నెలుంగున నరణ్యంబెల్ల ఘూర్ణిల్లం గూసి యసువులం బాసె.

ఇక్కడ విదేహరాజనందన రామార్తారావశ్రవణసంజాతశోకంబున గడగడ వడంకుచుఁ దనమ్రోలనున్న సదమలమతి సౌమిత్రిం గని మృగయాక్రీడకరిగిన రఘువంశదీపకునకుఁ గాంతారంబున నెద్దియేని యపాయంబు చేకూరెఁ గాఁబోలు. నానిమిత్తంబున మద్విభున కెట్టియాపద వాటిల్లెనో తెలియకున్నదాన. కాదేని యతఁడు నిన్నుఁ బిలువఁడు. నీవు సత్వరంబుగ సచాపుండవై రామరక్షణార్థం బరుగుమని యతిశంకితచిత్తయై వగచుచుం బలుకు జనకజం గాంచి లక్ష్మణుండు వినతుండై, "తల్లీ! ఇయ్యది రాక్షసమాయాకల్పిత మృగ

రవంబుగాని నిక్కంబుగ రామకంఠస్వనంబుగాదు. నాకు నిన్ని చ్చట నొంటి విడిచి పోవుట యుక్తంబుగాదు. మదీయానుజుని యనివార్యశౌర్యం బెఱింగి నీవు నెమ్మది నుండుము" అని హితంబు వలికిన విని యద్దేవి కోపసంరక్తలోచనయై "మీ యన్న ప్రాణసంశయంబు నొందుచుండ నిచ్చట మద్రక్షణంబు నందించుకయుఁ బ్రయోజనంబు లేదు. రామరహితనై యేనుండఁ జాల. నీవు భ్రాతృనాశంబుఁ గోరుచు నన్నొంటి బట్టఁ దలంచుచుంటివని నీయుపేక్షయ తెలిపెడిని." అని పెక్కుభంగుల సౌమిత్రికిఁ గర్ణకఠోరంబుగఁ బలికిన నతఁ డొండు వలుక నోల్లక ధనుష్పాణియై వనంబునకుం జని యన్న చన్న తెన్ను తెలియమి దైవవశంబున దారితప్పి తెన్నుగానక సిలుగులం బడుచుండెను.

అట భూపుత్రి మృగయార్థం బరిగిన రాముని యాగమనంబుఁ బ్రతీక్షించుచు నాతనివృత్తాంతంబు నిశ్చయంబుగఁ దెలియమికి ఖేదంబు నొందుచుండెను. అపుడసురేంద్రుండు నిజరూపంబు విడిచి కపటమునివేషధరుండై మిథ్యాజపంబు సేయుచు రామలక్ష్మణరహితంబై దిక్కఱియున్న పర్ణకుటీర ద్వారంబు దఱియం జొచ్చి చెచ్చెర ముందటికిం జనినంగని సీతాకాంత భయకంపితగాత్రియై మూర్ఛిల్లి ధరణి పయిం బడియె. ఇట్లు మూర్ఛాక్రాంతయై చైతన్యంబు లేక పసిడిబొమ్మ తెఱంగున ధరాతలంబునం బడియున్న ధరణీజాతనద్దశాస్యుం

డొక్కకరంబున శిరోజంబులును వేఱొక్కకరంబున నూరువులు నుం *బట్టియెత్తి నిజరథంబుపై నిడికొని పరమ ప్రమోదపరిపూర్ణహృదయుఁ డగుచు గగనమార్గంబున లంకా పురాభిముఖుఁడై యరుగఁ దొడంగె. అంతఁ గొండొకవడికి జనకనందన తెలివినొంది బాష్పజలపూరిత లోచనయై జగజ్జేగీయమాన ప్రతాపవంతుఁడును, సర్వగుణధాముఁడునగు రాముని జాయ యయ్యుఁ దాను దశకంఠుని చేత నిష్కారణంబుగ వంచింపఁ బడి కడలేని యిడుములఁ గుడువవలసివచ్చెఁగదా యని యుచ్చైర్నాదంబున రోదనంబు సేయుచు మిగులఁ జాలిఁ గొల్పు దీనాలాపంబులతో,

ఆ. వె. దేవగణములార! ♦ దిక్పాలవరులార!
సూర్యచంద్రులార! ♦ చుక్కలార!
హరిహరాదులార! ♦ ధరణీధరములార!
వృక్షజాతులార! ♦ పక్షులార!
కుటిలదానవుండు ♦ గొంపోవు చున్నాఁడు
కరుణతోడనన్నుఁ ♦ గావరయ్య.

అని పలుక సువ్యక్తంబైన యావనితావిలాపం బాకస్మికముగ జటాయువను పక్షీంద్రుని వీనులంబడియె.

---

* అధ్యాత్మరామాయణము అరణ్యకాండ, 7 వ సర్గమున సీతను రావణుఁడు స్పృశింపకయే యామెయుండు భూభాగమును గోళ్లచే బ్రద్దలుచేసి యాబ్రద్దలైన భాగముతోనె యామెనురథముపై నుంచికొని, వెళ్లెననియున్నది. వాల్మీకి రామాయణములో నీసంగతియే చెప్పఁబడలేదు.

## జటాయువు రావణునితో యుద్ధము సేయుట.

జనకజ దీనాలాపశ్రవణంబున గృధ్రనాథుండగు జటాయువున కనుగ్రహంబు గల్గ నతఁడు సరభసంబున విచ్చేసి వియత్తలంబునం బఱతెంచు దశకంధరు నడ్డగించి, యుగాంత కృతాంతుని చందంబున నుగ్రుండై సంగరంబు సల్పుచుఁ దనకుఁదగిలిన గాయములనుండి నెత్తురు సంతతధారగఁ గాఱుచున్నను సరకుసేయక యవార్యశౌర్యంబున రావణుతోఁ బోరెను. కాని తుదకు దశముఖుని గదాఘాతంబునఁ బక్షములు విఱిగి యాపక్షిరాజు భూతలపతితుండయ్యె. ఆ సమయంబున దానవనాథుం డద్ధాత్రీతనయ నధికరయంబున లంకాపురంబునకుఁ గొనిపోవునెడ నద్దేవి తనప్రాణరక్షణంబునకు నొండుపాయంబు లేమి నిరాశయై తనదివ్యాభరణంబులు బుడమిం బడవైచె. లంకేశ్వరుండును లంకాపురంబుఁ జెచ్చెరఁజేరి దనుజాంగనలకు సీత నొప్పగించి జాగరూకలై మెలంగుఁడని నియోగించిన వారును వల్లెయని యజ్జనకజ నశోక వనమ్మునకుం దోడ్కొనిచనిరి.

అసురాధిపుఁ డమ్మగువ నిల్లాలిం జేసికొనఁ గృతప్రయత్నుఁడయ్యెను. కాని తదీయ వల్లభలైన మందోదరీ ప్రభృతులు తత్ప్రకారం బంతయు నెఱింగి యతనికిఁ బ్రియంబు సేయువారై డగ్గఱి మృదుమధురోక్తుల "నో నాథా!

కం. శ్రీయుతు సత్యాన్వయమును
నాయువుఁ జెడ నన్యకాంత ♦ నర్థించుపనిన్
మీయట్టి బుద్ధిమంతులు
సేయుదురే! మీకు నిట్లు ♦ సేయం దగునే?

పరకాంతలఁ జెట్టవట్టుట పరమపాతకంబు. పత్యనురక్తయగు మగువ నీరీతి జాలిందూలించిన నీకు మేలొదవను. పరదారాపహరణ పాతకంబు నీకుఁ గుడువఁదగు నదనుదానె. కావున నాగ్రహింపక మహాపాతక హేతువగు నిట్టియకృత్యంబుడుగుము. రాముఁడనిన నీవు సామాన్యమానవునిఁగాఁ దలఁచితివి కాఁబోలు. అమ్మహానుభావుఁ డమానుషప్రజ్ఞాధురంధరుఁడు. విక్రమోపార్జిత యశోమండనుఁడు. మేటిమగల గండడఁగించి శూరమండలంబు గడగడ వడఁకించెడి జగదేకవీరుఁడు. నీయట్టి గర్వోన్నతులా వానిధాటికి నిలువఁబడువారు? మనక కాదు, దేవతలకేని యాతనిం దేఱిచూడ దుర్ఘటంబు. నీకేల తగనికోర్కులు? మర్త్యరూపధారియగు రాముఁడు తపఃప్రభావసంపన్నుఁడనగు నన్నేమి సేయనోపునని మనంబున గరువంబు వలవదు. నీకు నతనికి మహాంతరంబు గలదు. విష్ణుపరాక్రముఁడును, సర్వలోకేశ్వరుఁడు నగు నాదాశరథి రామునితోడి విద్వేషంబు నీకేటికి? కామంబు నిర్జించి, క్రోధంబు వర్జించి, సత్కులజాత—ననంతకళ్యాణగుణసమేత—నఖిలలోకైకమాత సీత నప్పరమకళ్యాణగుణాభిరాముఁడగు

రామునకర్పించి సర్వప్రకారంబుల నమ్మహాత్ముని చరణంబుల శరణంబు నొందుము. నీకు భద్రంబయ్యెడు. మామాటలు వీటిఁ బుచ్చక పాటింపుము. మాపలుకులు చేకొనుము.'' అని జ్ఞాన గర్భితంబులగు వచనంబుల నుపన్యసించియు వాని ధర్మపథంబునకు మరల్పఁ జాలరైరి. రాక్షసవల్లభుఁడును మదనకంపిత హృదయుఁడగుచుఁ దన పత్నులు శంకింపక జంకించి పలికిన వచనంబుల సారమావంతయును వీనులం గొనక స్త్రీరత్నంబైన సీతను గదళికా కదంబ నింబ జంబీర జంబు తమాల హింతాల లవంగ లుంగ నారంగ మాతులుంగాది మహా మహీరుహ నితాంతకాంతంబై, యమందానంద దాయకంబై యొప్పు నశోకవన మధ్యభాగమునందొక్క శింశుపాతరుమూలంబున నుండనేమించి భయంకరాకారలైన నక్తంచర భామినుల నక్కడఁగాపలియుంచి యబ్జాభసుతా సమాగమంబు దుర్లభంబని వగచి వెగడొంది యద్దేవి తనకు వశగత యగు టెట్టులని యోజించి,

ఆ. వె. భేదమాడియైన ♦ బెదరించి యైనను
సామ దాన యుక్తి ♦ సలిపియైన
బుజ్జగించియైన ♦ బోధించియైనను
మంచినైనఁ గోప ♦ గించియైన.

మీ నేర్చిన విధంబునఁ జేయుండని వారికి బోధించి యప్పొలఁతి యెప్పుడు వశంపడునోయని తత్పరుఁడై బవే

క్షించి యుండెను. జనకజకడఁ గాపున్న దనుజాంగనలు వికృ
తాకారంబులతోడ నద్దేవిం బరివేష్టించి యహర్నిశమ్ము
లామె నదల్చుచుఁ దిట్టుచు, వెఱపించుచుఁ బ్రోత్సహించు
చుండిరి. కాని రామాయత్తచిత్తయగు నా పతివ్రతాలలా
మంబు,

ఉ. చూడదు రాక్షసాంగనలఁ
జూడదు రమ్య విచిత్రశాలలం
జూడదు పుష్పభూజములఁ
జూడదు రమ్యసరోవరంబులం
జూడదు నిష్కుటావలులఁ
జూపుల రాముని దివ్యరూపము
న్వోడిమితోడ నెప్పుడుఁ గ
నుంగొనుచుం దదధీనచిత్తయై.

మెండియు నద్దేవి తనదగు దురవస్థం దలంచి దురంత
సంతాపాధీన మానసయై దైవమును దూఱుచు బహుభంగుల
దుఃఖించుచుండె.

రాజమందిరంబున సఖీసహస్రములతో నత్యుత్తమ
సౌఖ్యంబుల ననుభవించు చున్నపుడు తనసౌఖ్యరాశి నంతను
గాఱుమేఘములు గ్రమ్ముచున్నవని యమ్మానిని స్వప్నమున
నైనఁ దలంపలేదు. మఱియుఁ దన జీవితమునందుఁ బాలు
పంచుకొనుచుండు ప్రియభర్తనెడఁబాసి కాననంబున సుఖంబుఁ

గానక యావజ్జీవితమును దుస్సహ శోకసాగరమందుఁ గడపవలయుననువిషయ మా వనితాశిరోమణి యెఱుంగ దయ్యె. సంపద నీటిమీఁది బుడగవంటి దనియు, దైవంబిడిన యిడుమలఁ గుడువక తప్పదనియు నయ్యనర్థంబునకు నారాయణ నామస్మరణంబుగాని, యుపశమనంబు వేఱొండు లేద నియు నిశ్చయించి తనచిత్తంబు రామాయత్తంబుఁ జేసియయ్యం గనారత్నంబు భక్తియుక్తంబైన చిత్తంబున నశ్రాంతంబును దనపతిని శ్రీపతిగ భజియించుచు నెన్నఁటికైన నిజనాథుని విలోకింపఁగల భాగ్యము గలదో లేదో యని పరిపరివిధం బులఁ బొగులుచుఁ దృణంబు చలించిన రక్కసులతేఁడని భ్రమించుచుఁ గాలంబు పుచ్చుచుండె.

అట శ్రీరామచంద్రుఁడు మాయావంతుఁడగు మారీ చునిం గూల్చి సీతాదర్శనలాలసుఁడయి నిజాశ్రమమునకుం జనువాఁడు తనకభిముఖుఁడయివచ్చు లక్ష్మణునింగని యేకతం బున నితం డేకతంబున వచ్చెనో కో యని శంకాకలంకిత స్వాంతుఁ డయి దిగులున నాగమనకారణం బారసి యాతని రాకకు గర్హించుచుఁ బ్రాణనాయకియైన జనకాత్మజ యెట్టిపాటు వా టిల్లెనోకోయని దీర్ఘోచ్ఛ్వాసనిశ్వాసంబులు విడుచుచు సంతాప విశేషంబునఁ జెఱుచెమ్మట క్రమ్ముదేర నతిరభసం బున నిజాశ్రమంబు డగ్గఱి,

ఆ. వె. పర్ణశాలఁ జొచ్చి ♦ పరికించి పరికించి
సీత లేని కతనఁ ♦ జిన్నవోయి

చిత్తమెల్లఁ గలఁగి ♦ శ్రీరామచంద్రుండు
పలువరింపఁ దొడఁగెఁ ♦ బలువిధముల.

ప్రియకాంతావియోగ విషాదంబు వలన వివేకియు వికలుఁడగును గదా! ప్రియసతీ వియోగ సంజాత శోకభరంబున నబ్జాభకాంతుఁడు కాంతాన్వేషణ తత్పరుఁడై తదాశ్రమ పరిసరప్రదేశముల నన్నిటినిఁ గలయ సంశోధించి ధాత్రీతనయ నెందునుం గానక తనప్రయత్నంబు విఫలంబగుటకు విషాదంబు నొందుచు నేనజ్ఞానంబున సుజ్ఞాననిధానంబుఁ గోలుపోయి యాపుడమిపట్టిని నట్టడవుల విడిచిపెట్టి బిట్టు గాసిఁబెట్టితి. "తానొకఁడు తలఁచిన దైవమొకఁ డొనఁగూర్చినట్లు" మృగార్థినై చనినకతంబున నాకీదుఃఖము సంప్రాప్తంబయ్యె. ఇయ్యది యాత్మదోషంబుననైన యపాయంబు. నాకవశ్యభోక్తవ్యంబని యభ్యంతరప్రదేశంబునకుఁ జని యంగో క్కురుండును దల్పంబుపయింబడి మదీయ వల్లభయగు జానకి నాప్రాణమునకన్న వేయిరెట్లు నాకుఁ బ్రీతిపాత్రము. అట్టి ప్రాణప్రియయగు,

ఆ వె. సీతలేని నాకు ♦ సిరియేల? బ్రదుకేల?
ప్రాణమేల? పూజ్య ♦ రాజ్యమేల?
తద్వియోగ జనిత ♦ తాపాగ్నిచేఁ గ్రాగి
మేను బాయు టదియ ♦ మేలుగాదె!

అని సీతావియోగజనిత శోకాతిరేకమున నడలుచు "రాహు కబళన కలుషితుండైన రోహిణీ పతియునుంబోలె" విషాదవివర్ణుండై యున్న యన్నం గాంచి, లక్ష్మణుండు శోకాప నోదకారణంబులైన యుపశమన వాక్యంబులు చెప్పిన నూఱడక వియోగ వేదనాకులమనస్కుండై కన్నీరు దొరఁగం గొండొకతడవు చింతించి యచ్చోట నిలువనోపక లక్ష్మణ సహితుఁడై వెడలె. అట్లు వెడలి వివిధగిరి గహనంబులు విలోకించుచుం బోవంబోవ దైవానుకూల్యమున నొక్కరమణీయ ప్రదేశంబున మిక్కుటంబగు రుధిరపూరిత వసుధాతలంబునం దునిసిన శరశరాసనంబులుగనిరి. దాన నతఁడచ్చెరుపడి తత్స మీపంబునఁ బక్షంబులు పదంబులు దెగి రక్తసిక్తాంగుఁడై రామనామ సంస్మరణమ్మునఁ బుల్కుపుల్కునఁ జూచుచు నేలంబడియున్న పతంగపుంగవు డాయంజని పరికించిన నిది యసమయంబని తాను దశరథునకుఁ బ్రియసఖుండనని యుఁ దనపేరు జటాయువనియు సముచితప్రకారంబునఁ దన్నె ఱింగించికొని వినయంబున నామూలాగ్రంబుగా వైదేహిని దైత్యేంద్రుఁడు ముచ్చిలి కొనిపోవుటయుఁ దదర్థంబు దానద్దురాత్ముం దొడరి పెనంగుటయుం జెప్పి తరు వాతి వృత్తాంతంబు విన్నవించుచు దీనాననుండై రాముని వంకఁ బుల్కుపుల్కునఁ జూచుచుఁ దన్నామసంస్మరణమ్మున మేనువిడిచెను.

## శ్రీరాముఁడు కబంధుని వధించుట.

శ్రీరాముఁడు సీతావృత్తాంత శ్రవణంబుననునిజభక్తుఁడగు జటాయువు మరణించుటంజేసియు ద్విగుణీకృత శోకసంతప్త హృదయుఁడై తమ్మునిఁ గూడి విలపించుచు నా స్వార్థత్యాగపరాయణుఁడగు జటాయువున కగ్నిసంస్కారాదికము గావించి సీతనపహరించి తమ్ముఁ బరాభవించిన పాపాత్ముఁడగు దశగ్రీవునకుం దగిన ప్రతిక్రియ సేయుటయే లెస్సయని ప్రతినయొనరించి సీతాన్వేషణ తత్పరుఁడై కరంబు దుర్గమంబగు దండకారణ్యమార్గంబునఁ జనుచుండెను. అపు డాకసము మేఘావృతమై యంధకారబంధురముగ నుండెను. అట్టి యంధకారపరీతంబగు నిశీథసమయంబునఁ గబంధుఁడను వికృతాకార నిశాచరుండు కృతాంతదండానుకారంబులైన తన బాహుదండంబులను జాఁచి బలాత్కృతిని నవ్వనచారులగు రామలక్ష్మణులను బట్టుకొనియె. అంత శూరాగ్రేసరుఁడగు రాముఁడొకింత ధైర్యంబవలంబించి నిశితకృపాణంబున వాని కరంబులు ఖండించె. తత్క్షణంబున నద్దనుజుఁడు జ్ఞానమునొంది రామునకు నమస్కరించి ముకుళితకరకమలుఁడై, "మహాత్మా! నీచేసిన సాహసంబు నాకమితోపకారంబయ్యె. ఏను మున్ను స్థూలశిరుండనునొక మహర్షి శాపంబునం జేసి సకలపాతక హేతుభూతంబైన రాక్షసరూపంబుఁ గైకొని పెద్దకాలంబున నుండి నిరవధికంబగు దుఃఖం బనుభవించుచు,

కం. ఆపజ్జలనిధి లోఁబడి
ప్రోపేదిన నన్నుఁ దెప్పు ♦ పోలిక విమల
వ్యాపారచరిత! ప్రోచితి
నాపాలిటి వేల్పువీవు ♦ నరనుత చరితా!

నిరుపమానకటాక్షనిరీక్షణంబున నీచే నఱుకఁబడిన కతంబున విగతశాపుఁడనై దేవత్వంబు నొందితి. నాయజ్ఞానంబు తొలంగె. ఇఁక మీకరుణారస పరిపూర్ణంబులగు కటాక్షంబుల శాపవిముక్తుండనైన నన్ను పలక్షించి దహనసంస్కారంబు సలిపి కృతార్థుం గావింపుఁడు." అట్లని సీతారమణి నపహరించినపాత్మునిఁ బరిమార్చుటకు సఖ్యంబు సేయఁదగిన ధీరోత్తము నెఱింగించి నీకుఁ గొంత యుపకారంబు సేసెదను. కరుణాళుండగుట వికృతాంగుని యుద్యమంబునకుఁ దోడ్పడి యుత్సాహంబుఁ గొల్పినచోఁ గార్యంబు శీఘ్రసాధ్యంబగునని మనంబున నిశ్చయించి రాముఁడు కార్యసాధనమునందు బుద్ధి నిల్పి తదుక్తప్రకారంబున సంస్కారంబుఁ గావించె. తత్క్షణంబ కబంధుఁడు వికృతరూపంబువిడిచి స్వర్గగమనయోగ్యంబగు స్వకీయంబైన గాంధర్వరూపంబు నొంది యంతరిక్షంబున కెగసి, "కరుణాభరణా! దుష్టమృగసంకులంబగు నీయరణ్యంబు గడచి ప్రాగ్దిశఁ బోవంబోవ మనోహార సంఫుల్ల కమల కల్హార కైరవమండితంబై పంపాభిధానంబైన సరోవరంబు గలదు. నీవయ్యెడ కరిగినచో ఋశ్యమూకంబను శైలంబు కానంబడును.

తచ్ఛిఖరంబున, సుగ్రీవుఁడను కపికులశ్రేష్ఠుఁడు. భ్రాతృనిర స్తుండై, కళత్రధాత్రీరాజ్యరహితుండై హనుమత్ప్రభృతు లగు తరుచరులతో నివసించియున్నవాఁడు. ఆతండపారధైర్య ధుర్యుఁడు. కార్యనిర్వహణధూర్వహుఁడు. అగ్నినైనను బిడి కిటం బట్టునంతటి సాహసముగల నిర్భీతచిత్తుఁడు. భవదార్తి వారింపఁగల మహానుభావుఁడు. తనపూనినకార్యంబు నిర్వ హించికాని నివృత్తుండుగాఁడు. భవదీయాభీష్టం బిట్టిదియని తెలిపెంగిన తత్క్షణంబ యెట్టి యిక్కట్టులఁ బడియైనను నీయభి మతంబు సఫలంబు సేయంగలవాఁడు. ఆతనికి నీసాహాయ్యం బును, నీకాతనిసాహాయ్యంబు నత్యంతావశ్యకంబులు. కావునఁ జింతఁదక్కి నీవాతనితోఁ జెలిమిసేయుము. నీవాంఛితంబుఁ దీర్ప నాతఁడుదక్కఁ దక్కినవారు సమర్థులుగారు. నీమనోరథంబు సఫలంబగుట ధ్రువంబని" సుగ్రీవసఖ్యాద్యుపాయమును గఱపి పంపాసరోవర మార్గంబుఁ జూపి వారివీడ్కొని దివం బునకరిగె.

## శబరిని దర్శించుట.

కౌసల్యానందనుండు పరమాద్భుతంబునొంది యెవ్వి ధముననైనఁ గార్యము సాధింపఁబూని కబంధువచనంబు సేకొని తత్కార్యనిర్వహణార్థంబు తమ్మునివెంటనిడుకొని బయలువెడలె. ఇయ్యిర్వురు మహారణ్యంబు సొచ్చి కబంధోప దిష్టమార్గంబున సుగ్రీవదర్శనాసక్తులై చనుచు నష్టమదివసం

బునఁ బంపాపుష్కరిణీపశ్చిమతీరమును బ్రవేశించి లలితలతా వితానాలింగిత బహుద్రుమశోభితంబైన శబర్యాశ్రమంబుఁగనిరి. వీరందు సర్వసంగపరిత్యాగినియైన శబరిని సందర్శించి యమ్మహాపుణ్యనిలయచే నర్ఘ్యపాద్యాది సపర్యల నర్చితులై నానా మధురఫల సమర్పణోపచారంబుల సంతోషితస్వాంతులైరి.

శ్రీ ర స్తు.

శ్రీ వేంకటరమణ పరబ్రహ్మణేనమః.

# శ్రీరామకథామృతము.



## కిష్కింధాకాండము.

### హనుమంతుఁడు రామలక్ష్మణుల సందర్శించుట.

రామలక్ష్మణు లతిలోకరమణీయం బై, నిర్మలజల ప్రపూర్ణం బై యొప్పు పంపాసరోవరంబుఁ గాంచి తదీయ వైభవవిశేషంబులకుఁ బరితోషంబు నొందుచుఁ దత్తటవనం బునం దా రేయి గడపి మఱునాఁడు రేపకడ లేచి నిత్యకృత్యంబు లాచరించి కదలి పోవంబోవఁ గొంతదూరంబున ఋశ్యమూక శైలంబు దృష్టిగోచరంబయ్యె. అప్పర్వతశిఖరంబున మంత్రి సహితుఁడైయున్న సుగ్రీవుఁడు మహాధనుర్ధరులై యరుగు దెంచుచున్న రాజసూనుల దవ్వులంగని వారిం దనయన్న వాలిచేఁ బంపఁబడిన శత్రువులని శంకించి యావచ్చెడివా రెవ్వరో యెఱింగిరమ్మని తన మంత్రిచతుష్టయంబున బుద్ధినధి కుఁడగు హనుమంతునివీడ్కొల్పి భయకంపితాంగుఁడై కలంగి యచ్చోట నిల్వనోడి మలయాద్రికింజనియె. అపుడాంజనే

యుఁడు బహుళపాదపసంకులం బైన యగ్గిరీంద్రంబుడిగ్గి యమ్మ
హాత్ముల పాలికింజని సుగ్రీవుని సచివుఁడననియు, హనుమద
భిధానుఁడననియుఁ దన్నెఱింగించుకొని కుశలంబడిగి "దేవా!
మీరలెక్కడివారలు? మార్గపరిశ్రాంతులరై యియ్యుగ్రాటవి
నింతదూరంబేల చనుదెంచితిరి? ఆనతిండని" కరంబులు మొగిచి
ప్రార్థించె. అంత రామచంద్రుం డవ్వాయునందనుని భాషణం
బులకు మనంబున సంతసించి యిట్లనియె. "ఏనిక్ష్వాకువంశ
సంభవుండ. దశరథజనపతి కగ్రపుత్రుండ. రామనామాంకి
తుండ. ఇమ్మహనీయుఁడు మదీయానుజుండు. లక్ష్మణాహ్వ
యుండు. పితృవాక్యపరిపాలనార్థం బీదండకారణ్యంబునఁ
గ్రుమ్మరుచు రాక్షసాపహృతదారుఁడనై సుగ్రీవసాహాయ్యం
బపేక్షించి యిచ్చోటకుఁ జనుదెంచినాఁడను." అని తనమనో
భావమును వెల్లడించె. అంత హనుమంతుఁడు ప్రహసితము
ఖుండగుచు, "దేవా! నేనవశ్యంబు మదధిపతితో మీకుఁ
జెలిమిఁ గావించెదను." అని పలికి వీడ్కొని సత్వరంబుగా
మలయాచలంబునకు నిర్గమించె.

అట మహాభయభ్రాంతచేతస్కుండై తనరాక కెదురు
చూచుచున్న సుగ్రీవు పాలికింజని ప్రణమిల్లి హనుమంతుఁ
డావచ్చినవారు రామలక్ష్మణులని చెప్పి వారి యాగమన కార
ణంబు విన్నవించె. అప్పుడు సుగ్రీవుండు సంతుష్టుండై మనం
బునఁ గలంకదేఱి వారలంజూచువేడ్క వేగిరపడి యయ్యిర్వు
రఁదోడి తేర ధీరోదారవిచారసారుండగు సమీరకుమారుం

టనిచె. అతఁడు రభసంబునంజని వినయము దొలంక వానరేశ్వరుఁడగు సుగ్రీవు మనోభీష్టం బెఱింగించినఁ దత్సందర్శనకుతూహలులై వారలు సంభ్రమానందంబులు డెందంబుల సందడింప నయ్యగచరోత్తముతోడన యరిగి ఋశ్యమూకాచలం బారోహణం బొనర్చు చుండిరి. అయ్యవసరంబున సుగ్రీవుఁడు రఘువీరులం గనుంగొని తద్దర్శనోత్సుకుఁడై యెదురుచని భయభక్తి సంభ్రమంబులతోఁ బ్రత్యుత్థానంబును దండప్రణామంబును జేసి కరకమలంబులు మొగిచి, "మహాత్మా!

కం. ఇన్నాళ్లకు నాభాగ్యము
నన్నినుఁ బొడఁగంటి లోక ♦ నాయక! దాసుం
డన్నను నేలుకొనుము వి
ద్వన్నుత! యొనరింతు నీవు ♦ పనిచెడి పనులన్.

అని" ప్రస్తుతించినఁ గరంబు సంతసిల్లి యాలింగనంబు గావించె. అంత భానుసూనుఁడు రామలక్ష్మణానుగమ్యమానుండై నిజావాసంబునకుం జనియె.

## శ్రీరామ సుగ్రీవుల సఖ్యము.

సీతావియోగదుఃఖపరిక్షీణుఁడగు శ్రీరామచంద్రుఁడు రావణపరిపాలితంబైన లంకఁజొచ్చి జనకజ నన్వేషించుట సుదుష్కరంబని తలపోసి తాదృశకార్యసాధకుఁడైన ధీరుఁడు సుగ్రీవుఁడని యూహింగి తత్ప్రోత్సాహనార్థం బాతనితోడి

సఖ్యం బవశ్యకర్తవ్యంబని నిశ్చయించి యాతనితోఁ బరస్పరోపగుంభనంబులలర ననుపమానమైత్రి నెఱపుచుండె. ఇట్లుండ నొకానొకదినంబున రఘురాముఁడు ప్రమోదవిశేషంబున రవికుమారునకు నిట్లనియె. "వీరోత్తమా! ఏను పత్నీవియోగవిరహాడోలాయమానమానసుండనై యున్నవాఁడ. రావణాపహృతయైన మదీయవల్లభయగు జనకనందన నన్వేషించి తేఁగల సమర్థుండు నీవకాక యన్యుండులేఁడు. నీవద్ధాత్రీతనయ నీవదకి తెచ్చి నన్ను మెప్పింతువేని నీచిత్తంబునకు మెచ్చువచ్చునట్లు మదీయాయుధసామగ్రితోడుత నీశత్రువైన వాలిం బరిమార్చి నిన్నుఁ బ్రాప్తసామ్రాజ్యునిఁ జేసెదనని" పలికి పృథివ్యాది పంచమహాభూతంబులు సాక్షులుగా నభయప్రదానంబుఁ గావించె. అంత నతఁడు తత్సమీపంబుననున్న హనుమజ్జాంబవంతుల దెసం గనుంగొని నిశ్చల బాహాబలశాలియగు వాలిం బొలియింప నుపాయంబుఁ దలపోయవలయుఁగాక. వానిం భంజించుట యెంతపని యనినవిని యక్కపిపుంగవు లొక్కింతతడ వాలోచించి, "దేవా! దశవదనమదోన్మాలియు, ధీశాలియునగు వాలి దుర్జయుఁడు. వానితోఁడఁ బ్రతిఘటించి యెదురనిలిచి యాలంబుసలిపి యాతని జయింప హరిహరాదులకైనఁ దరముకాదు. కాఁబట్టి వానితో ముఖాముఖ యుద్ధమునకుఁ దొడరక మాటుయుద్ధమునకుఁ జొచ్చుట శ్రేయము. ప్లవంగవిభుఁడవ్వాలి నేదేని యొకవ్యాజమున యుద్ధమునకుఁ జీరి యుయ్యిరువ్వురుఁ బోరునెడ నీవొక్కెడ తరుషండంబు

మఱుఁగునఁ బొంచియుండి యేపునందూపుసంధించి వానిపయిం బ్రయోగింపుము. ఇత్తెఱంగుతప్ప వానిం బొలియింప నొండు విధంబు కర్జంబుగాదు. కావున నెల్లభంగుల నివ్విధంబనుష్ఠించునది." అని యభ్యర్థించిన రాఘవేశ్వరుం డందులకొడంబడియె. కాని వాలిహననసామర్థ్యంబు వీనికిఁ గలదో లేదో యని సుగ్రీవుఁడు సంశయాకులితస్వాంతుఁ డయియుండె. రఘువీరుఁ డదియెఱింగి సుగ్రీవవిశ్వాసార్థంబుగాఁ దన ధనుర్విలాసనైపుణిఁ గనుపఱుపఁదలఁచి వాని నొకవిశాలరమణీయంబైన బహిరంగణంబునకుం దోడ్కొనిచని మేరుమందరంబు భాతిఁ గానంబడు 'దుందుభి' యను మహారాక్షసుని కళేబరంబు మహాపర్వతసంకాశంబైనదానిఁ బొడఁగని తన పాదాంగుష్ఠంబున నెగమీటిన నబ్బీటున నక్కాయంబు విహాయసంబుముట్టి పదియామడల దవ్వునం బడియె. అంత మదారిజన విదారణదారుణంబగు నొక్కబాణంబుఁ బ్రయోగించిన నయ్యది యొక్కటియయ్యును సప్తతాళంబులను వానికాధారంబగు ధరణీధరంబును దానిక్రిందిధారుణీతలంబును గూడ గాటముగనాటి యొక్కమాఱుఁగ బ్రక్కలించి, మఱలివచ్చి నిజస్థానంబైన యాతని తూణీరంబు సొచ్చె.

### వాలి రామబాణపీడితుండై నేలంబడుట.

సప్తతాళనిపాతనాద్యద్భుతకృత్య ప్రదర్శనంబునం జేసి యర్కసూనుఁడు విస్మయానందహృదయుండై సర్వప్రకారం

బుల రాముఁడు దర్శనమాత్రంబున వాలిని వధియింప సమర్థుండని విశ్వసించె. అంతట నందఱుం గూడికొని యింద్రపుత్రుఁడగు వాలినివాసంబయిన కిష్కింధా నగరంబునకుఁ జనిరి. అచ్చోట సుగ్రీవుఁడు శ్రీరామచంద్ర చరణారవిందంబులకుఁ బ్రణామంబు లాచరించి, "మాన్యచరిత్ర! నీనిరుపమానకటాక్ష నిరీక్షణంబుచే నేను ధన్యుండ నైతి. అప్రతిహతంబగుసౌఖ్యంబుఁ జెందఁగంటి. యుద్ధంబులయందు జయపరాజయంబులు విధి నిర్ణీతంబులు. కావున నట్టి సంశయయుతంబైన యుద్ధమున నీవు నన్న వ్వాధిఁ గాపాడెదవో నీయదియే భారము. అనన్యగతికుండ నగునాకెట్టికీడునుం బొరయకుండ రక్షింపుము." అని పలికి వాలిం గలనికి నడపింపఁదలపెట్టి వాని యునికిపట్టుం డాసి భూనభోంతరాళంబులు ఘూర్ణిల్ల నార్చుచుఁ బాదాంగుష్ఠంబున నేల వ్రాయుచు బాహుదండంబు లెత్తి తొడలు సఱచుచు వాని నాలంబునకుఁ జీరె. అవ్వాలి రోషావేశముఖరితముఖుండగుచుఁ గయ్యమునకుఁ జనవలదని తదీయవల్లభయగు తార యెంత వారించినను వినక యఖర్వదోర్గర్వమదాంధుఁడై వచ్చి సుగ్రీవు దిక్కు మొగంబై "ఓరీ! దుష్టాత్మా! నీకింత కండకావరమా! నేను పోరాటకుఁ బిలిచినపుడెల్ల సిగ్గుపడి పాఱి పిరికిపందవీవు. అట్టి నీకిపుడిట్టి బెట్టిదమగు ధైర్యంబెట్లు పుట్టె? శౌర్యమ్ముగల దేని ప్రగల్భమ్ములు గాని నాముందట నిలిచి యుద్ధమ్ము సేసి నీదు ప్రతాపంబుఁ జూపుము. నీదోర్బలమిప్పుడ యుడిపెద." అనవుడు నాయిరువురకును దారుణంబగు రణంబు సెల్లె. వారొం

ధ్గారులు ధనుర్విద్యాకౌశలంబులు మెఱయ దారుణబాణ జాలములం బోరుచుండిరి. అట్టి సమయంబున,

కం. ఆలమునఁబొంచి రఘుపతిఁ
బాలితకపిరాజ్యశాలిఁ ♦ బ్రస్ఫుటకీలిన్
శూలి పదభక్తిశీలిని
వాలిని నొకకోల నేల ♦ వ్రాలఁగ నేసెన్.

అపుడయ్యింద్రతనయుండు బాణక్షతవేదన సహింప నోపక విజయలక్ష్మీవిరాజమానుండైయున్న రఘువీరునిం గాంచి, "రాజేంద్రా! భానుసూనుండగు సుగ్రీవుండు నాకు జ్ఞాతి. కావున నన్నుజయించి నారాజ్యంబుఁ బరిగ్రహించు టాతనికి విధిచోదితంబైన ధర్మంబు. కాని ధర్మపరావతారుఁడ వయ్యు నీవు నాసంహారకాలమునందు రణమున నాయెదుట నిలిచిపోరక మఱుఁగునుండి మదీయానుజుని సాహాయ్యం బపేక్షించి నన్నకారణంబుగ వంచనచే వధించినాఁడవు. ఇది నీకు క్షత్రియధర్మంబుగాదు." అని పగచివగచి నిష్ఠురంబులు వలుకుచు కోపావిష్టుఁడై మైమఱచి యజ్ఞానంబున నున్మత్త ప్రలాపంబులుసేయుచు వికవికనవ్వుచుం, దెల్లుచుం, దుల్లుచుం బ్రేమప్రేరితుండై సారెసారెకుఁ గేలుమోడ్చుచుఁ దుదకు సుజ్ఞానియై,

తే. "రఘుకులాంబుధిసోమ! సం ♦ గ్రామభీమ!
జలధరశ్యామ! భక్తహృ ♦ జ్జలజధామ!

బహుగుణోద్దామ! తారక • బ్రహ్మనామ!
రాక్షసవిరామ! భువనాభి • రామ! రామ!

భార్యాపహరణ దుఃఖాక్రాంతుండవై కార్యచింతా పరత్వంబున మాభూమికరుదెంచిన పుణ్యమూర్తివగు నీకతిథి సత్కారంబుఁ గావించుటకు బదులు నీతో యుద్ధమునకుఁగడం గితిని. దేవదేవుండవని యెఱుంగక శరసమాన పరాక్రముఁ డవైన నిన్ను దూషించితిని. దీనిందప్పుగాఁ గొనక నాయపరా ధంబునకు సహింపవలయును." అని భక్తియుక్తంబుగాఁ బలికి, తన్నుఁ గూర్చి విచారించుచున్న తమ్మునింజేరి, "సుగ్రీవా! నీవు నేఁజేసిన తొల్లింటి పరాభవంబు సర్వంబు మఱచిపొమ్ము. మన్నందనుండగు నంగదుం గటాక్షించి రక్షింపుము." అని తన కడసారికోరికఁగఁజెప్పి విగతప్రాణుండయ్యె. అయ్యవసరం బున రాఘవుండు సుగ్రీవుని వలన సంక్రందననందనున కగ్ని సంస్కారాది పరలోకక్రియలు నిర్వర్తింపఁ జేసె.

## సుగ్రీవుని పట్టాభిషేకము.

అంత శ్రీరామచంద్రు నియోగంబునఁ దదనుజుఁడగు లక్ష్మణుఁడు కిష్కింధానగరంబు వివిధరత్నతోరణచిత్రశృం గారరచనావిశేషంబుల నలంకరింపించి దైవదత్త శుభముహూ ర్తంబునఁ గిష్కింధకు సుగ్రీవుం దారాసమేతంబుగా ననంత వైభవంబునఁ బట్టాభిషిక్తుంగావించి యాతని చేతం బూజితుండై దీవించె. పదంపడి యౌవరాజ్యంబునకు నంగదుం బ్రతిష్ఠించె.

ఆ సంతోషసమయంబున హనుమత్ప్రముఖనిఖిల వానరవీర
ప్రముఖులెల్లరు గౌరవింపఁబడిరి. అంత వర్షకాలం బాసన్నం
బగుటంజేసి యది సంగరానర్హంబని యెఱింగి యారెండు
మాసంబులు రాజ్యకళత్రభోగంబులందుఁ దనియ సుగ్రీవునిఁ
గిష్కింధయందుండ నేమించి శ్రీరామచంద్రుండు సౌమిత్రి ద్వితీ
యుండై మాల్యవంతంబునకుఁ జని తద్గిరిపరిసరంబున నివసించి
యుండె.

మదిరాపానమత్తతచేత మతిలేకయో, లేక తారా,
రుమాప్రభృతులగు కపికులస్త్రీల వలపులఁ దగులుటచే నొడ
లెఱుఁగకయో, భానునందనుఁడు రెండుమాసము లతిక్ర
మించినను రాముని యాజ్ఞఁ దలపెట్టఁడయ్యె. ఆతఁడు రామ
కార్యంబుపేక్షించి సకాలంబునకు ససైన్యుండై రానికతంబున
వానిం దోడ్కొనితేర సుమిత్రాసుతుని నియోగించి రాముఁ
డాతని రాకకై ప్రతీక్షించుచుండె లక్ష్మణుఁ డాగ్రహోదగ్ర
మానసుఁడై యమోఘరయంబున సుప్రసిద్ధంబగుఁ గిష్కింధా
పురంబున కేతెంచిన నాతనికిఁ బ్రత్యుద్గతుఁడై సుగ్రీవుం డడలున
నొడలు గడగడ వడంక వగర్చుకొనుచుం జని సుమిత్రా
పుత్రుని పదంబులపయింబడి తడఁబడుచుఁ బెదవులందడపుచుఁ
దనవలనఁ గలిగిన యపరాధంబునకుఁ దన్ను క్షమింపుమని
విన్నవింప లక్ష్మణుండాగ్రహంబువీడి శాంతచిత్తుఁడై తదాగ
మనకారణం బెఱింగించె. అంత రామకార్యసహాయుండైన కపి
నాథుఁడు సౌమిత్రిసహితుఁడై చనుదెంచి శ్రీరామచంద్రునిం

బొడగని దండప్రణామం బాచరించి వినయంబునఁ గరంబులు మొగిచి, "మహానుభావా! నీవు నిత్యక్షమానిరతుండవు. నాబుద్ధిలేమికి క్షమియింపుము. ఉపకారంబునకుఁ బ్రత్యుపకారంబుఁ గావించుటది సనాతనంబైనధర్మంబు. భవదాజ్ఞ నద్దియైనఁ జేయసంసిద్ధుండ. భవద్దాసుండ. ప్రత్యుపకృతిసేయ సమకట్టిన నాకుఁ జేయంగలపని యెయ్యది? నాకెయ్యది కర్తవ్యంబు? మీ రేదిపంచినం జేయుదు నానతీయవలయు ననిన" నక్కౌసల్యాతనయుండు పరమప్రమోదపరిపూర్ణహృదయుండై యిట్లనియె. "సుగ్రీవా! ఇయ్యిలాతలంబున భార్యకంటెను సకలసౌభాగ్యప్రదాయకంబగువస్తువు వేఱొండు లేదను విషయము నీ వెఱుంగనిది కాదు. 'భార్యామూలం త్రివర్గస్య, భార్యామూలం తరిష్యతః.' అనునట్లు సద్భార్యయే పురుషునకు శాంతిప్రదాత్రి, సంసారము తరించుటకు మార్గము. అనంతతేజోరాశియగు సతీతిలకముకన్నఁ బూజ్యమగునది వేఱొక్కటియున్నదా? కావున సర్వగుణసంపన్నయగు నిజ సతీమణిం బాసి, యేను 'తావిం బాసిన పూవుచందమున' నున్నవాఁడ. నీకంటె నాదుఃఖంబపనయించువాఁ డన్యుం డొక్కరుఁడు గలండే? నీవిఁక నెడసేయక సీతాన్వేషణసమర్థులగు వానరవీరుల, నెల్లదెసలకుం బంచి నాప్రాణప్రియయగు జానకీదేవినిఁ దెచ్చి నాకు మనఃప్రియంబు సేయుము. నాకింతకంటె ప్రియతమంబైనకోర్కె యెద్దియును లేదు. జనకతనయాన్వేషణక్రియాభారంబు నీయదియ." అని బహూకరించి వీడుకొలిపెను.

## హనుమదాదులను దక్షిణదిక్కునకుఁ బంపుట.

అంత సుగ్రీవుం డమితసంతోషంబునొంది పురంబునకుం జని దక్షిణదిక్కునకు మహాబలులను, వీరులను బుచ్చుట కార్యంబని మదినెంచి, ఆంజనేయ, నల, నీల, జాంబవదంగదాఖ్యులఁ బంపఁ దలఁచి యాదరమున వారలఁ జేరంజీరి, "మీరు దేవగంధర్వాంశసంభూతులు, కామరూపులు, కామసంచారులు, భూరివిక్రములు, ధీరులు, శూరులు. కావున నేఁ గరమదృష్టవంతుఁడ. మీరలిఁక నిముసంబైన నిటఁదడయక మిథిలాధినాథుఁడగు జనకునితనయయు, మహారాజచంద్రుఁడగు దశరథవిభుని కోడలును, రాజాధిరాజగు శ్రీరామునిపట్ట మహిషియునగు జానకి నన్వేషింప నిప్పుడ దక్షిణదిక్కునకుం బొండని" తనవారి నందఱ నయ్యుపనులకు నియమించె. అయ్యవసరంబున శ్రీరామచంద్రుండు మరున్నందనుఁడగు హనుమంతుని రావించి యాతనిచెట్టవట్టికొని "మారుతీ! నీవు నీతికళాకుశలుండవు. వివేకశీలుఁడవు. నీయట్టిశౌర్యధైర్యవంతు లెందును లేరు. అబ్ధిదాఁటి సురవైరిపురంబుననున్న జనకరాజతనూజను గనుంగొని కృతార్థుఁడవై నన్నుం గృతార్థునింజేయ సమర్థుండవు. కావున నబ్జాక్షిని యాసందేశము విశ్వసించుకొఱకు నేను మహారహస్యమ్మొకఁడు సెప్పెద నాకర్ణింపుము.

కం. అని కాకాసురకథ నా
తనికిం దెలియంగఁజెప్పి ♦ దైవాఱఁగ న

జ్జనవిభుఁడు కనిష్ఠాంగుళ
మునవెలసెడు తనదురత్న ♦ ముద్రిక నొసఁగెన్.

ఇచ్చి మన్నామాంకితమైన యీరత్నముద్రాంగుళీయక
ముంగని కళ్యాణగుణసమేతయైన సీత మదీయవచనంబునఁ జను
దెంచినవానిఁగా నిన్నెఱుంగు. కావున దీనిఁ బదిలముగఁ
గొనిచని యద్దేవికొసఁగి యయ్యంగనామణి
శిరోమణి నాకుఁ బ్రత్యభిజ్ఞానముగ నడిగి తెమ్ము. నీకుఁ గార్య
సిద్ధియయ్యెడు. శీఘ్రముగఁబొమ్ము." అనవుడు నాంజనేయుఁ
డుప్పొంగి, "దేవా! ఏనెత్తెఱంగునైన భూజాతను వెదకి తెచ్చి
భవత్కటాక్షవీక్షణంబులకుఁ బాత్రుఁడ నయ్యెదనని" నుడివి
ద్విగుణీకృత సాహసోత్సాహబలతేజోవిశేషుఁడై కృతాంజ
లియై రామచంద్రుని చరణంబుల కభివందనంబుఁ గావించి
యనుజ్ఞఁగొని తా రేయూథములంగూడి దక్షిణాభిముఖుఁడై
చనియె. అంతఁ గపినాథుండు రామకార్యార్థసిద్ధికొఱకు బల
వంతులైన సమస్తవానరశ్రేష్ఠుల నాయత్తంబుజేసి వారలకుఁ
బుడమికానుపు జానకి నన్వేషింపఁదగు స్థలనిరూపణంబుఁజేసి
యయ్యెచోటులఁ గలయంజూచి యొక్కమాసంబులోనఁ
గ్రమ్మఱి రండని కట్టికట్టడిచేసి,

కం. అనుపుగఁ దూర్పునకు సుషే
ణుని, బలియుని, గంధమాదన ♦ నుని, నుత్తరది

కన్గొనకొగి దధిముఖుఁ బశ్చిమ
మునకుంగా ముపురనంపె ♦ భూసుత వెదకన్.

ఇవ్విధంబున సీతాన్వేషణతత్పరులై ప్రాక్పశ్చిమోత్తర దిక్కులకుం జనిన వలీముఖులు వివిధారణ్యనదీనదంబులన్నియు విలోకించుచు మహీమండలంబునంగల నగరగ్రామజానపదంబులను మహీధరకాంతారాశ్రమాదులను సరితీరంబులను నెల్లఁ గలయం దిరిగి తిరిగి పరాత్పరునిఁగాంచజాలని యోగభ్రష్టుని చందమున నారామపత్ని నెందునుంగానలేక విఫలోద్యోగులై డెందంబులందు దిగులొంది మగిడివచ్చి వానరనాథుఁడగు సుగ్రీవునకుఁ దమపడిన యాయాసంబు తెలియంగెలింగించిరి.

అంగదాదులు సంపాతిం గాంచుట.

వాలిపుత్రు నంగదుం బురస్కరించుకొని దక్షిణాభిముఖులై వెడలిన హనుమదాదివీరు లరణ్యంబులుసొచ్చి, దుర్గమస్థలంబులంగడచి చనుచు సుగ్రీవుఁ డానతిచ్చిన రహస్యస్థానంబులఁ గొన్నింట సీతాదేవికై సంశోధించుచుఁ బ్రాణసంరక్షణంబుకొఱ కందందు లభ్యంబులగు కందమూలఫలాదుల భక్షించుచు నలయికతీఱ మార్గమధ్యమునం దక్కడక్కడ విశ్రమించుచు బహుదూరముచనిరి. వారుతమయత్నంబు వృథయగుట నేమియుఁదోఁచక చింతించుచుండిరి. అప్పు డంగదుం డందఱం గలయఁజూచి యిట్లనియె. “ఇటకుం గొంతదూరం

బున వింధ్యపర్వతప్రాంతాటవిగలదు. అయ్యది వివిధములగు గొప్పవృక్షములుగల కొండలను బెక్కుగుహలనుగలిగి చొచ్చుటకు భయంకరముగ నుండును. మనమాప్రదేశమునకుంజని సీతాకాంతను గనుఁగొను విషయమున దృఢతరప్రయత్నములు సలుపుట యుత్తమము." అనఁగావిని యందఱును వల్లెయనిరి. అంత నందఱు నచ్చోటుఁబాసి వింధ్యాటవిం జేరి యందలి వనములను, దటములను, బర్వతములను, శైలశిఖరములను, బర్వతగుహాలను, బిలములను బూనికతోఁ గలయవెదకిరి. కాని జానకీదేవిని దర్శింపఁజాలరైరి. వారెట్టికష్టము లెట్టి యాఁకలు దమ్మెదిరించినను సరకుఁగొనక తదేకదీక్షతోఁ బర్యటనముఁజేయుచు, దినంబులు లెక్కపెట్టికొనుచు వింధ్యాద్రి నైరృతిదిగ్భాగమున నందందు వెదకుచుం బోయిరి. అయ్యెడ నాకస్మికముగ బిలమొకండు గానవచ్చె. అందు సీతయుండునని తలఁచి వారాబిలద్వారంబుఁజొచ్చి చిమ్మచీఁకటిలోఁ ద్రోవ నరయఁజాలక కష్టపడుచుఁ బోవుచుండిరి. వారి కొక తెన్ను లేదు—ఒకత్రోవలేదు. మిట్టయనక, పల్లమనక, రాయియనక, అప్పయనక తమకుఁ జిక్కినదారి నేగుచుండిరి. ఇట్లెంతదవ్వు త్రోవసాగినదో తెలియదు. కొంతదూర మరిగినపిదప వారికి వెలుతురుగల ప్రదేశము లోచనగోచరమయ్యెను. అయ్యది నిర్జన కాంతారమువోలె భయంకరముగ నుండినను బలువిధములైన ఫలభరితంబులగు వృక్షముల చేతను, గమల కహ్లారకాసారముల చేతను, గాంచనమణిమయమందిరముల చేతను

శోభిల్లుచుండెను. వారెల్లయెడలను బూన్కిమై వెదకిరి గాని యెందును జానకీదేవి కన్పట్టదయ్యెను. మఱికొంతదూర మే గునప్పటికి నచ్చటం జూపఱకు విస్మయము గలిగించు రూప ముగల యొకకాంతారత్నంబు వల్కలాంబరములు ధరించి యొకకృష్ణాజినముపైఁ గూరుచుండి తపంబు నలుపుచుండె. ఆమెం గని కపివీరులందఱు భయసంభ్రమంబులు పెనఁగొన దవ్వుదవ్వుల నిలిచిరి. అపుడనిలజుం డాతపస్విని సమీపించి యంజలిఘటియించి సవినయముగా, "ఈబిలమెయ్యది? నీవె వ్వతెవు? నీతండ్రియెవ్వరు ? నీనామంబేమి ? నీవొంటిమై నిందువాసముచేయుటకు నిమిత్తమేమి?" చెప్పుమని యడిగిన నాతపస్విని యిట్లనియె.

"మాయాబలసంపన్నుఁడైన మయుఁడను దానవుఁ డుండెను. ఆతం డరణ్యంబునందు దారుణంబగు తపంబుఁ గావించి బ్రహ్మదేవునిఁ బ్రార్థించి శుక్రప్రణీతమైన శిల్పశాస్త్ర మునంతను దనసొమ్మగునట్లు వరమడిగి దానింబడసెను. శిల్పకళాకౌశలమున నాతనికిమించిన వారెవ్వరును లేరు. అది యట్లుండనిమ్ము. కర్తవ్యాంశము వినుము. ఇది యొకమహో న్నతమగు పర్వతరాజము.

కం. అనిమిషపతి దైత్యులతో
నని మున్నొనరించువేళ ♦ నతిరయమెసఁగం
దన వజ్రమెత్తి వేయుడు
ఘుఃఘుట్టన నిన్నగమునఁ ♦ గందరమయ్యెన్.

దీనికి "ఋక్షబిలమని" పేరు. వివిధశిల్పశాస్త్రవేదియగు నమ్మయుఁడు దీనిని వృద్ధిపఱచి తనవిచిత్రశక్తిచే నిందుఁ బద్మకైరవకల్హారాదిపుష్పవిలసితనిర్మలవారిపూరితములగు చక్కని జలాశయములును, ఆదరిని రమ్యములగు చిత్రకాంచనరత్నలతామంటపములును, సుగంధికుసుమఫలభరితంబులగుసుందరతరుబృందములును, మరకతమాణిక్యాద్యనర్ఘమణులచే నలంకృతములైన విశాలరమణీయహర్మ్యములును జిత్రవిచిత్రగతుల నిర్మించెను. అతఁడు హేమాభిధానయగు నచ్చరలేమం దగిలి మనోజరాగమత్తుఁడై యిందుఁ గొంతకాలము సుఖమ్ముగ వసియించియుండెను. ఇది యెఱింగి దేవేంద్రుండు దుర్వారక్రోధభీషణుండై కరవాలంబుచేఁ బ్రహరింపఁగా నాతఁడు మడిసెను. ఆతని మరణానంతరము బ్రహ్మదేవుఁ డీవిచిత్రవనము హేమకిచ్చె. ధర్మజ్ఞుఁడైన మేరుసావర్ణికి నేనుకుమారికను. నన్ను 'స్వయంప్రభ' యందురు చిరకాలసఖ్యంబునం జేసి హేమ నన్నిచ్చటనే యుండునట్లు నియమించి దేవలోకంబునకుం జనియె. అదిమొదలు నేను సిరిపెంపుసొంపారు నీప్రదేశమును రక్షించుచుఁ దపోనిష్ఠతో నిచటఁ గాలము గడుపుచున్న దానను. భాగ్యసంపన్నంబైన యీమహాబిలము నెట్టివారికిఁగాని చొచ్చుట యసాధ్యము. ఇచ్చటికి వచ్చినవారు ప్రాణములతో మరలిపోవుట దుష్కరము. ఇందుఁ దడయుట మీకుఁ బ్రమాదకారణమగును." అని చెప్పి "మీరెవ్వరు? ఏకారణమున నిటకువచ్చితిరి? వినిపింపుఁడ"నిన నాంజనేయుం డిట్లని చెప్పం దొడంగె.

"తపస్వినీ! దశరథరాజపుత్రుఁడగు రాముఁడు సతీసోదర సహితుఁడై యరణ్యమందుండ నాతనిసతియగు సీతను రావణుఁడు బలాత్కారముగఁ బట్టుకొనిపోయెను. ఆతని కత్యంత మిత్రుఁడును, మాకురాజునునగు సుగ్రీవుఁడు సీతాన్వేషణార్థమై శక్తిసంపన్నులగు కపివరుల నెల్లకడలకుఁ బంపెను. వారిలో మేము దక్షిణదిక్కునకుఁ బంపఁబడినవారము. మేము సీతను వెదకుసందర్భమున నలుగడలఁ దిరుగుచుండఁ దలవని తలంపుగ మాకు సాంద్రతిమిరావృతంబైన యిప్పర్వతగుహం జొచ్చుట సంభవమయ్యెను.

కం. జనకసుతను మాసములోఁ
గనుఁగొని చనుదెండటంచుఁ ♦ గపిపతి యనుపం
జనుదెంచి కాలమంతయుఁ
జనఁజెడి యున్నార మెందుఁ ♦ జనలే కిచటన్.

మాకేఁడేర్పఱచిన గడువు నతిక్రమించిన వారమైతిమి. అతఁడు మమ్ములను గఠినశిక్షలపాలు గావించును. రావణాపహృతయగు జానకీదేవిని వెదకుటయను ఘనతరకార్యమును నెఱవేర్ప మేము సత్వరముగ నేగవలసినవారము. కావునఁ బరమకరుణాస్వభావురాలవైన నీవెట్లైన ననుగ్రహించి దుర్గమమగు నీగుహంజిక్కువడిన మాకు నిరపాయంబుగఁ దొలఁగిచన ననువయిన యుపాయంబును దెలిపి పుణ్యంబుఁ గట్టికొనుము." అని దీనముగఁ బ్రార్థించె. అపుడత్తపస్విని వారి

భయంబు మనంబున నెఱింగి "వానరపుంగవులారా! దేవ దానవుల కైనను జొరనశక్యమగు నీశైలకందరమును జొచ్చి మీరు మహాసాహసకార్యంబుఁ జేసితిరి. దీనింజొచ్చినవారు తిరుగఁ బ్రాణములతోడఁ బైటఁబడరు. అయినను రామకార్య భరపూజ్యులగు మిమ్ము మదీయ తపోమహిమవలన నీగుహా విముక్తులను జేసెదను. మీరొక్కపరి కన్నులు మూసికొనుఁడు." అనియెను. వారందఱు నట్లే నిమీలితనేత్రులైరి. అంత నాతపస్విని వారినెల్లరఁ గ్రుటిలో నాబిలమునుండి వెలికిఁజేర్చి "మీకు జయమగుంగావుత!" మని యాశీర్వదించి నిజబిలమునకు మరలిపోయెను.

వీరులగు నవ్వానరులందఱును హర్షోల్లసితమానసులై యాతపస్విని మహిమాతిశయం బెన్నుచు బహుభంగులఁ బ్రస్తుతించి కొంతదవ్వునడచి శాఖాపరివృతమైన యొక వృక్షమును జేరి యావృక్షచ్ఛాయ నుపవిష్టులై యిట్లు వితర్కింపఁ దొడఁగిరి. "రామకార్యనిర్వహణార్థమై మనమష్టకష్టములకు లోనై తిరుగరాని చోటులెల్లఁదిరిగి పడరాని పాటులెల్లఁ బడితిమి. మనకష్టమునకుఁ దగిన ఫలమొనఁ గూడదయ్యె. ఎవ్విధముననైన మనమిక్కార్యము నెగ్గించి మనస్వామిని సంతసింపఁజేయవలెను. లేనిచో మనమాతని యాగ్రహాము నకుఁ బాత్రులమగుదుము." అని సుగ్రీవభయశంకితులై, దీర్ఘాలోచనాయత్తచిత్తులై రామునిమనోరథ మెట్లీడేరఁగలదో యని విచారించుచు జటాయువుభక్త్యౌదార్యములు, సాహస

త్యాగములు, వీరమరణములు మొదలగువానిని గుఱించి యొం డొరులతోఁ జెప్పికొనసాగిరి. తదవసరమున నాచేరువ కందర మున నున్న జటాయువున కన్నయగు సంపాతియను పక్షీంద్రుఁడు భ్రాతృవధంబువిని వారియొద్దకేగుదెంచి వారివలనఁ దన తమ్ముని మరణవార్త నెఱింగి కొందలంపడి వారికి రావణుఁ డను కఱకురక్కసుఁడు వైదేహిని బట్టికొనిపోయినదియు నద్దేవి శతయోజనపరిమితంబగు మహార్ణవముచే నావరింపఁబడిన లంకాపట్టణమునందు రాక్షసస్త్రీ పరివృతయై యుండు నదియు నాదిగాఁగల వృత్తాంతంబు సాంతంబుగాఁజెప్పి వెండియు నిట్లని యె. "మీరిఁకఁ దడవుసేయవలదు. సముద్రలంఘనంబు నం దుపాయంబుం జింతింపుఁడు. దాన మీరు సఫలీకృతమనోరథు లయ్యెద"రని నుడివి తనయిచ్చం జనియె. అంతట నవ్వానరోత్తములు "ఔర! ఏమి! పరమేశ్వరుని సంఘటనాసమర్థత! "వెనుకఁబోయినతీవ పదములంబడినట్లు" అప్రయత్నముగ నీసంపాతి మనదృక్పథమునఁబడియె'' నని నిరుపమానందభరిత స్వాంతులై, సీతాదర్శనలాలసులై యచ్చోటబయలువెడలి సముద్రతీరమును జేరి మున్నీరు కన్నారఁజూచి యమ్మహార్ణవంబును దరించుటకు విగతధైర్యులైరి.

శ్రీ ర స్తు.

శ్రీ వేంకటరమణ పరబ్రహ్మణేనమః.

# శ్రీరామకథామృతము.

## సుందర కాండము.

### హనుమంతుఁడు లంకకుఁబోవుటకు నుద్యుక్తుఁడగుట

అపుడతివృద్ధుండును, బలవంతుండునగు జాంబవంతుండు వాయునందనుని ప్రభావం బెఱింగినకతంబున శతయోజనాయతంబయిన సముద్రంబుఁదరించి రాక్షసాకులంబయిన లంకాపురిఁ బ్రవేశింపఁగలవీరుం డతండొక్కఁడేయని నిశ్చయించి యుక్తి విశేషంబున బహువిధస్తుతులొనరించి గంభీరమధుర స్వనమున,

కం. "నీవిక్రమంబుఁ జూడఁగ
నీవానరులెల్ల వేడ్క ♦ నెసఁగుచునున్నా
రో వాయుతనయ! చూపుము
నీవీర్యమహాత్త్వమెల్ల ♦ నివ్వేళ పటుపన్."

అనియన్నంతనె జాంబవంతునకు నమస్కరించి, వాలేయ (అంగద), నల, నీలులం గౌఁగిలించుకొని మరున్నం

దనుండగు హనుమంతుం డనంతసత్త్వుండయి విషాదోద్రేక భీషణరోషంబు లెడనెడఁ బెనంగొనఁ బరప్రోత్సాహంబునం గాక స్వోత్సాహంబునన చివ్వనలేచి,

కం. "వినుఁడీ! మీసమ్మతిఁగొని
చనుచుంటిఁ దలంచినపని ♦ జగిగెడు వఱకున్
గనుమూసి నిద్రవోవను
పని తీఱినపిదప క్షణము ♦ వ్యర్థముసేయన్.

ఏను సర్వప్రకారంబులఁ గృతకార్యుండనయి యనతి కాలంబున మగడివచ్చెదను. నావచ్చునంతకు నందఱు నిచ్చో టన యుండునది" యని పలికి గొబ్బున నవ్వనచరు లచ్చెరు వడునట్లతిజవంబున మహేంద్రగిరీంద్రం బెక్కి తదీయశృంగశృం గాటకంబులమీఁదనుండి యవలీల శతయోజనపరిమాణోన్న తముగఁ బెఱిఁగి బాహువులల్లార్చి వాలంబువంచి యుంకించి చండమారుతోద్దండవేగంబున, వియన్మార్గంబున లంకాపురాభి ముఖుండయి పోవుచుండెను. అప్పుడు తేజోరాశియైన మైనాక మహీధరంబు తనకభిముఖంబగుటచేఁ దచ్ఛిఖరంబుమీఁది విశాలశిలాతలంబు నొక్కింతస్పృశించి మరల లంఘించి గరు త్మంతుడుంబోలె జవాతిరేకంబున నిరాలంబంబగు గగనంబు నకు నెగసి వాయుమార్గంబున నమోఘరయంబునం జనియె.

## హనుమంతుఁ డశోకవనమందు సీతం జూచుట.

అట్లు చనుచుండ 'ఛాయ'యను ఘోరరాక్షసి వికృతం బుగా వక్త్రంబుఁ దెఱచి యాతని మ్రింగనరుదెంచె. కామ రూపుఁడగు హనుమంతుఁ డాక్షణంబంగుష్ఠమాత్రుండయి తద్వ దనగహ్వరంబుఁ జొచ్చి యుదరంబు వెడలి ప్రభావసంపన్నుం డయి శతయోజనాయతంబగు లవణార్ణవం బవలీలఁ దరించి యుత్తరంబుననున్న సువేలాచలంబుఁ జేరె. అందుఁ గొండొక తడవలయికఁ దీఱ విశ్రమించి యనంతర మాగిరికాననమహీ రుహంబులు గంపింపనుఱికి యటనుండి పశ్చిమాభిముఖంబుగా జనుచు నగాధమ్ములగుపరిఖలను, సుందరమణిమయప్రాకార మ్ములను, నిర్మలజలప్రపూర్ణజలజాకరమ్ములను, దీర్ఘదీర్ఘిక లను, సుందరోద్యానవీథులను, విశాలరథ్యలను, రమ్యహర్మ్య ములను, సముదగ్రబలులగు శూరులను విపక్షజనశిక్షణదక్షు లగు రక్షోవీరులను గలిగి యతులితమై, నయనానందకరమై, యప్రమేయమై, యద్భుతావహమైయొప్పు లంకాపురంబుఁ గాంచి విస్మయావిష్టహృదయుఁ డయ్యెను. అంత నతఁడు తన రూప మేరికిం గనుపడకుండునట్లు మహోన్నతంబైన తనశరీరం బుఁ గుఱుచపఱిచి వృషదంశకమాత్రగాత్రుండయిచని యన్న గరమహనీయద్వారంబుఁ దఱియంజొచ్చె. అట నద్ద్వారరక్షణ మొనర్చుచుండిన ఘనబలయుతయగు 'లంకిణి'యను రక్కసి బాహుదండంబులుసాచి తనయావచ్ఛక్తిని వినియోగించి వాని నిలునిలుమని ప్రతిఘటించి నిరోధించెను. అపుడు హను

మంతుఁడు కోపాయత్తుఁడయి ధైర్యసాహసములతో శైలంబు పోలెఁ జలింపక నిలిచి తనముష్టిఘాతమ్ములఁబొడిచి యతి ప్రయాసంబున దాని జయించి నగరంబుఁజొచ్చెను.

ఇట్లు జయించి ద్విగుణీకృతోత్సాహుఁడయి, సీతా న్వేషణలాలసుఁడయి నలుదిక్కులు. కలయం బరికించుచు నొక్కెడ మహోన్నతమ్మును, వివిధమణిప్రభాధగద్ధగాయ మానమ్మును, మయనిర్మితమ్మును, మహనీయకాంతి సమంచి తమ్మును నగు రావణునిమహాసౌధముఁగాంచె. కాంచి తదీయ విభవంబున కాతఁడు హర్షించుచు నందెల్లెడలును వెదకి కడ మేడమీఁదఁ దనరూపము ప్రతిబింబించుచున్న పటికంపుగోడల సౌరున కచ్చెరువొందుచుఁ జని రావణుని శయనాగారం బరసి తన్మధ్యభాగంబునందుఁ గెంబట్టు పుట్టంబు దట్టంబుగఁ బఱచి మెత్తని నెత్తావివిరుల వఱలు కనకరత్నప్రభాభాస మానంబగు హంసతూలికాతల్పంబునందు రావణుమేన మేను సేర్చి సురుచిరలక్షణంబులనొప్పుచు శయనించి మహానాగిభంగి నూర్పులు నిగిడించుచు నిద్రించుచున్న మండోదరినవలోకించె. అద్దేవి యంచితభాగ్యలక్షణధన్యయగు జనకజయే యని భ్రమసి యప్పవననందనుఁడు పరమవ్యాకులహృదయుఁడై, నృశంసుఁడగు రావణుని దౌర్జన్యంబునకు గర్హించుచుఁ జప్పుడు గాకుండ మెల్లన యొక్కింతముందునకుంజని యొక్కమాఱు కనుఁదమ్ములువిచ్చి కఱవు దీర వీక్షించి భ్రమించి మఱలవిలో

కించి ముక్కుపై వ్రేలిడుకొని, "ఔరా! దశరథుని ముద్దుకోడ లును, సత్యపరాక్రముడగు శ్రీరాముని భార్యయును, రాజర్షి సత్తముడగు జనకునకుఁ బుత్రికయు నగు సీత, భువనైక మాత యేడ? దుర్మార్గుడును, మలీమసచిత్తుడునగు రావ ణుఁడేడ? భ్రమకులోనైతి. ఈమె సీతకాదు, కాదు." అని కృతనిశ్చయుఁడయి యాగర్భాగారమును నిర్భయమునవీడి సర్వప్రదేశములను గాలించిగాలించి విసివి జనకనందన నెం దును గనక దుఃఖాక్రాంతుఁడయి, నిర్విణ్ణుఁడయి, కర్తవ్య మెఱుఁగక నిరుత్సాహుఁడయి ప్రాయోపవేశ మొనరించి మేనువిడువ నుద్యుక్తుఁడయి తనకారణంబున నిక్ష్వాకువంశ మును, కపివంశము నంతమొందునని భీతివడి, "బ్రతికియుండిన భద్రములఁగాంతును. నాకంఠమునఁ బ్రాణములున్నంతదనుక సీతను వెదకెదఁగాక! లేదేని లంకనుద్ఘాటించి సముద్రమునఁ ద్రోసెదఁగాక" యని ధైర్యసాహసోపేతుఁడయి కలయం జూచుచు నల్లంతదవ్వున బహువృక్షలతాశోభితమగు నశోక వనముఁగాంచి యందన్వేషింతుఁగాక! యని అచ్చున నవ్వన మ్మున కుటికి యందొక శింశుపాతరుమూలమ్మున,

కం. ఉడుగక కన్నీరొలుకఁగ
నడలుచు, హా! రామ రామ! ♦ యను రవమెసఁగ
న్నుడువుచు దానవకాంతల
నడుమన్విలపించుచున్న ♦ నాతిం గనియెన్.

ఇట్లు మేఘావృతయగుచంద్రరేఖచందమున, సింహాభిముఖయగు గజరాజడింభపోలె దీనయై, భీతమృగేక్షణయై శోకరసాధిదేవతయుంబోలెఁ జూపట్టుచు రోదనమ్ము సేయుచున్న నాతింగాంచి యప్లవమాననందనుండు భువనైకపూతయగు సీతయని భావించి భయశోకసంభ్రమంబులు హృదయంబునఁ దొట్రిలఁ బునఃపునరవలోకనాయత్తచిత్తుండయి హృదయముప్పొంగ నామె సీతయేయని నిశ్చితమనస్కుఁడయ్యెను.

ఆహారనిద్రలేమాత్రంబును లేకుండుటవలనను, సమధికంబగు మనఃక్లేశంబు వలనను నమ్మగువ శల్యావశిష్టయైయుండె. ఆమె నేత్రములనుండి యశ్రుబిందువులు సాతతధారగాఁ గురియుచుండెను. ముఖము రాహుగ్రస్తపూర్ణచంద్రమండలమువోలెఁ గళావిహీనమైయుండెను. శోకధ్యానభయంబుల నడలుచు నిరానందయై చింతించుచున్న జానకినవలోకించినంత నాతనిమనస్సు వికలతఁజెందెను. పరస్పరానురాగసంవర్ధితమగు నాదంపతుల వియోగవ్యధవలన నాతనిహృదయము సంతోషమునకుఁ దావొసఁగదాయెను. అయినను రామాయత్తచిత్తయగు సీతామహాలక్ష్మినిఁ జూచుటయను భాగ్య మబ్బినందుల కమ్మారుతి సంతోష తరంగితాత్ముఁడయి వైదేహీరక్షణోద్యోగినులైన రాక్షసాంగనలు తన్నుఁ జూతురనుసందియము మనంబున నందడింప నచ్చేరువనున్న యగణితశాఖాలంకృతంబై, యతిసుందరంబైయొప్పు నొక మహామహీరుహంబు నవలీల నధిరోహించి

తదీయశాఖాపర్ణంబులనడుమనుండి యద్దేవిం బరికించుచుండె. అట్టిసమయమునం దప్పాలదిండిమెకిమీఁడు జగన్మోహనంబగు సీతాకాంతరూపంబుఁ దలంచి చిత్తచలనంబునొంది మన్మథపరవశుఁడయి, "ఆలస్యాదమృతంవిషం" అను ప్రమాణమ్మునను సరించి వివిధమాల్యాభరణభూషితుఁడయి దనుజాంగనలు కరన్యస్తదీపికాకళికలై యిరుగెలంకుల నడచుచుండఁ దానయ్యేడకరుగుదెంచి యప్పొలఁతిని వశపఱచుకొనుటకై బహుభంగులఁ బ్రార్థించియుఁ బ్రతిహతమనోరథుఁడయి కర్ణకఠోరంబులగు దురుక్తులాడెను. నిందాకలితంబులగు నాదురాత్ముని పల్కులు ముల్కులగములై యయ్యబలడెందంబునందు నాటి మాటిమాటికి గాటంబుగ వేదననొదవించుచుండెను. దాన నజ్జనకరాజనందన మదోన్మత్తుండును, గామోద్రేకంబునసీతిబాహ్యుండునై వలసినయట్లు ప్రేలుచున్న దురాత్ముండగు రావణుని ధర్మదూషణమ్ములగు భాషణమ్ముల కుల్లంబునఁ దల్లడిల్లి కుముదలోచనయయ్యును గోపావేశమ్మునఁ గల్హారపత్రనేత్రయై వానిఁ దృణప్రాయంబుగా నెంచి క్రోధకలుషితాంతరంగయై యిప్పాపాత్ముండు బెట్టిదంపు వచనంబులంగాని చక్కఁబడఁడని తలఁచి "ఓరి, దురాత్మ!

తే. గీ. పుడమిలో సత్కులంబునఁ ♦ బుట్టి సత్కు
లంబుసొచ్చి పుణ్యుండగు ♦ రాఘవునకుఁ
బత్నినై, సాధ్వియనఁబెంపు ♦ వడసి యిట్టి
నీచకార్యంబుఁ గావింప ♦ నేర్తునటర?

"వినాశకాలేవిపరీతబుద్ధిః" అను విబుధోక్తి సరణి నీకిట్టి దుర్బుద్ధిపుట్టుటయే నీకుఁ గాలముమూఁడినదనుటకు నిదర్శనము. మున్ముందు దీనిఫలము నీవనుభవింతు"వని పలికెను. పరుషంబులగు సీతావచనంబులాకర్ణించి రాక్షసాధిపుఁడగు రావణుఁడు తామ్రాక్షుండై బడబానలంబుభంగిమండుచు పండ్లుపటపటకొఱుకుచుఁ గుబుసంబువీడినమహానాగంబుభంగి మెఱయు కరవాలమును నొఱనుండి పెఱికి యత్తెఱవను నఱుకఁ గమకించుచుఁ జైనుఁఱుకు నాకఱకురక్కసున కడ్డమునిల్చి ప్రియవాదినియు, ధర్మజ్ఞయునైన "త్రిజట" యనురక్కసి జనకనందనకు జరుగుచున్న మహోపద్రవమును గన్నులారఁగని యద్దనుజేంద్రుని దౌరాత్మ్యంబునకు మనంబునం గలుషించుచు దానంతికంబుననుండియు నమ్మానవతీలలామమానంబు రక్షింపక యూరకుండుట నింద్యంబని మదినెంచి తగినతెఱఁగున శోకముమాఁకలజేని వారించిచూచెదంగాక యని యూహించి యిట్లనియె.

తే. గీ. "వెలఁదిని వధింప నీకిట్లు ♦ వేగిరింప
నేల? నేనొలి నీకను ♦ కూలపఱతు
శాంతినొందుము; కోపింప ♦ శుక్రవహ్ని
యమముఖాశాధిపతులుగా ♦ రబలగాని.

పరహింస పరమపాతకము. సత్యయుతమగుశాంతము సమస్తదుఃఖనివారకము. కష్టములనుండితరించుట కదియె

యుత్తమమార్గము. మోక్షసంప్రాప్తికది ప్రధానసాధనము. ఎట్టికార్యమునకైనను వేగిరపాటు వలనుగాదు. కార్యములు నేర్పుతోడన సాధించుకొనవలయును.” అని తత్కాలోచిత సాంత్వనవచనంబుల ననుగ్రహించిన నతఁడును నమ్మగువ వాక్యంబులకు సమ్మతించి రాక్షసాంగనాపరివృతుండై నిజ మందిరంబునకుం జనియె.

అంతట త్రిజట దానవనాథుఁడు తన్ననుచితకార్యంబునకు నియోగించుటకు నిర్వేదనంబునొంది రామాంగనం జేరం జని, “దేవీ! నీవు ధీరవు. నీకు రావణునివలని భయంబు లేశమునువలదు. మహాపదలకుంబరిహారణంబు హరిస్మరణంబు, కావున నీవు చింతదక్కి నీహృదయంబున నప్పుండరీకాక్షుని నిక్షేపించుకొనుము. నీకు మేలగును.” అని యామెనోదార్చు చు నత్తెఱంగుననైన నామెవిచారము నడంపఁదలఁచి తనశక్తి కొలఁదిని యత్నించుచుండెను. కాని సంతతపతిధ్యానతత్పర యగుసీతాకాంత భయవిచారముల నెడఁబాయఁజాలక ఖిన్నయైయుండెను. అనుదినము నాదురాత్ముండగుదానవేంద్రుని దురాలాపంబులచే నాధాత్రీతనయ యంతరంగం బగ్గలంబగు వ్యాకులత నొందుచుండెను. అక్కతన నద్దేవి దురంతదుఃఖ తాపంబునఁ బడలుపడుచు, “ఓ దైవమా! నాకీకష్టముల నేల తెచ్చిపెట్టితివి? నేను నీకేమి యొగ్గొనర్చితిని? నన్నీదుఃఖాబ్ధి బడఁద్రోయుట నీకుధర్మంబె?” అని బాష్పధారాపరిప్లుతానన

మై యేడ్చుచు, "నాథా! నాప్రాణనాథా! నామొఱాలింప వా? లోకైకవీరుఁడవగునీవు దలంచినచో నీకటాక్షామృతవర్ష మున నాదుఃఖదావానలము శాంతింపదే?" అని కన్నీరుమున్నీరై పాఱ వెక్కి వెక్కి యేడ్చుచున్న సీతంగాంచి త్రిజట, "దేవీ ఇట్లేల భీరులవోలె బాష్పాకులితలోచనవై యున్నదానవు? ధైర్యంబు వహించి మనోవ్యాకులత్వంబుఁ బరిహరింపుము. దేహధారి, "జంత్రగాని చేతి జంత్రపుబొమ్మకైవడి" నీశ్వరతంత్ర పరాధీనుఁడై సుఖదుఃఖంబులందు వర్తనంబులు సల్పుచుండు. లోకమునఁ గష్టము వెంటసుఖమును, సుఖము వెంటఁ గష్టమును గలుగుట ప్రకృతిధర్మంబు. దుఃఖంబులు వాంఛితంబులుగాక చేకుఱు తెఱంగున సుఖంబులును గాలానుసారంబులై లబ్ధంబు లగుచుండు. సుఖదుఃఖములు పుణ్యపాపరూపంబులు. విధాతృ నియోగంబున దేహధారులకుఁ బుణ్యపాపంబు లనుభావ్యం బులు గాని యూరక పోనేరవు. దైవమానుషంబులు కర్మఫల ప్రాప్తినిమిత్తంబులు. కావున మానవులు కర్మసిద్ధియగునని నిశ్చయించి కర్మమునందుఁ గృతోత్సాహులుగావలయు. అట్టి వారికి దైవంబు సహాయంబై కర్మసిద్ధిఁగావించు"నని యింక నెన్నియో శాంతవచనంబుల నూఱార్చిన సీతయు నూఱడిల్లెను.

అట దశకంఠనియుక్తలైన రాక్షసభామలొకకొందఱు వివిధ తర్జన భర్జనంబుల సీతామహాసాధ్విని భయపెట్టి నిదుర గదురకొన కాయంబులు మఱచి యందఱు నిద్రవోయిరి.

అహర్నిశంబు నారక్షోంగనలచే బోధింపఁబడుచుండినను నమ్మహీతనయ తనపాతివ్రత్యమును గాపాడికొనుచు భర్తృవియోగదుఃఖంబునఁ గన్నీరువిడుచుచు బుద్ధిబలంబునం జిత్తంబు ధైర్యాయత్తంబుసేసి తన భర్తృపాదంబుల మనంబున నెన్నుచుఁ దనవల్లభుఁడెప్పుడరుదెంచునోయని తదాగమనంబుఁ బ్రతీక్షించుచుఁ బతిదర్శనలాలసయై చంద్రకిరణంబులకుఁ జకోరములట్లనుక్షణమ్మును శ్రీరాముని ధ్యానించుచుఁ బ్రతీక్షించుచుండె.

## హనుమంతుఁడు రామ వృత్తాంతము సీతకుఁ జెప్పుట.

ఆసమయంబున వృక్షశాఖాంతరస్థితుండగు హనుమంతుఁడు జనకాత్మజ చిత్తంబునంగల శోకంబు నివారించెదం గాకయని నిశ్చయించి వృక్షంబుడిగ్గి పాదన్యాసంబునం జప్పుడుగాకుండ నద్దేవిచేరువకుఁ బ్రాకివచ్చి దుఃఖార్తయైయున్న భూసుతందగ్గఱి భయభక్తివినయ సంభ్రమంబులు పెనంగొన సాష్టాంగదండప్రణామంబాచరించి యల్లన చెవికిఁజల్లనగురీతి మృదుభాషావిశేషంబుల హర్షంబుఁబుట్టించుచు సందియంబు వాయ నిట్లనియె.

ఉ. "ఏ రఘురాముదూత నతఁ డిద్దెస నిన్వెదుకంగఁబుచ్చె ని
వ్వారిధిదాఁటి యిప్పురికి వచ్చి నినుంబురసౌధసీమలం
దారసి కానకివ్విపిన మందునురోయఁగఁగంటి శింశుపా
భూరుహమూలమందిచటఁ బుణ్యవశంబునఁ గన్నతల్లిరో!"

అన నద్దేవి యావానరపుంగవుఁడు మాయోపాయ ధురంధరుండగు దశకంధరుఁడు గానోపునని తలంచి యేమియుం బలుకక మిన్నకుండె. అపుడమ్మారుతి యమ్మగువమనోభావం బెఱింగి, "తల్లీ! రామలక్ష్మణు లత్యంత కుశలంబున నున్నవారు. మందాకినీతీరంబున నీవు నిద్రించుచుండ నీకుఁ గాకాసురుఁడొనరించిన కృత్యంబుగ్గడించి తన ముద్రాంగుళీయకం బానవాలుగానొసంగి భవచ్ఛిరోరత్నం బడిగి తెమ్మని శ్రీరామచంద్రుండు నన్నుఁబుత్తెంచె. ఏనహర్నిశంబు నిద్రాహారంబులువర్జించి బహుప్రయాణక్లేశంబున నాతనికుశలంబు నీకెఱింగించు వేఁడుక నియ్యెడకరుదెంచినాఁడ రావణాసురుని యనర్ఘ రత్నఖచితకనకమయమందిరంబు సర్వంబును బరిశోధించి మదీయపుణ్యావిశేషంబున సమస్తభువనభాగ్యసంధాత్రివగునిన్నిచ్చటఁ బొడఁగంటి. ఇదియ రామనామాంకితంబగు నయంగుళీయకంబు. అమ్మహానీయుఁడు దీని నీయభిజ్ఞానార్థంబుగా నాచేతికిచ్చె. దీనింగొనుము. నీవు శోకంబు పాలుగాక తక్కుఁడు" వని పలికి దాని నద్దేవికొసంగెను.

రాక్షసమాయాకవ్యథితమానసయైనసీత, నిజభక్తుఁడయిన హనుమంతుని సాక్షాచ్ఛ్రీరామునిదూతయని భావింపక శంకింపఁదగుదురవస్థపాలు గావలసెఁగదా! ఆ సుదతీమణి వదనారవిందమున నెలకొన్న మందహాసముంగని మరున్నందనుం డుప్పొంగుచు, "తల్లీ! ఇఁక రిక్తహస్తంబుల రామచంద్రుని

కడకుఁ జనుట దూతధర్మంబు కానేరదు. రాఘవునకు నభి జ్ఞానార్థంబుగా భవచ్ఛిరోరత్నంబుఁ గృపసేయుము." అని మోడ్పుఁగేలెత్తి వినయపూర్వకంబుగఁ బ్రార్థించె. అపుడు జనకనందన భర్తృకరవిభూషణంబైన యంగుళీయకముంగని యాశ్చర్యహర్షాయత్తచిత్తయై నిజనాథుంజూచినట్లు తా మనం బున సంతసిల్లి వినయభక్తిసంభ్రమములతో దానిం గన్నుల నద్దికొనుచు మూర్ఛిల్లి క్రమ్మఱందెలివొంది విస్మయమున నెనరును వెలికిఁదోఁపఁజేయు తనమొగమాంజనేయునివైపు ద్రిప్పి యాతని నిక్కంబుగా రామదూతయని నిశ్చయించి,

ఆ. "సకలకార్యవేది ♦ వకలంకచరితుండ
వతిబలాన్వితుండ ♦ వగచరేశ
నీతిశాలివీవు ♦ నీకతమ్మునమంటి
వింటి రామువార్త ♦ వీనులలర.

నీకారుణ్యంబునంజేసి ఇయ్యంగుళీయకంబును బడసి తిని. దీనిం దిలకించుభాగ్యంబు చేకూఱుటంబట్టి నేఁడు కడు సుదినంబు. నీకు మాయందుఁగల గాఢతమభక్తివిశ్వాసము లవిచ్ఛిన్నములు. నీవు స్వామినియుక్తకార్యంబుఁ బరిపూర్తిఁ జేసి నీయచంచలస్వామిభక్తిని వెల్లడించి ననుంగడుధన్యం గావించితి"వని బహుప్రకారంబులఁ బ్రస్తుతించి హనుమంతు నకుఁ దనచెఱంగున ముడిచి దాఁచియుంచిన దివ్యంబైనచూడా మణినొసంగి రామునకు మనఃప్రియంబుసేయ నిదియచాలునని

పలికి వెండియుఁ దనకుఁ బాటిల్లినపాటుపకుం గొండొకతడవు విచారించి, "మారుతీ! నన్ను మాతవలెభావించి యెంతయు భక్తిమెయిఁజూచుచు నాయెడ ససమానమగువినయము గనఁ బఱచుచుండిన లక్ష్మణుని శోకసంతాపకర్శితనై నేననరాని ప్రల్లదంబుల నొవ్వనాడితి. భర్తృవియోగశోకాతిశయంబునఁ బుట్టినక్రోధంబున నేను నిష్ఠురంబులు గొన్నిపలికితిని అజ్ఞానంబుచే స్త్రీచాపల్యంబున నేను పరుషంబులు వలికినను,

కం. ఆమాటలు మదిఁబెట్టక
ప్రేమను నను గావుమనుచు ♦ వినయనయగుణో
ద్దాముఁడు రాముని తమ్ముఁడు
సౌమిత్రికిఁ జెప్పుమయ్య ♦ సాహసివర్యా !

అనిపవిని యమ్మారున్నందనుఁడు ప్రహసితముఖార విందుఁడయి, "తల్లీ! అతివీరులైన నల, నీల, గజగవయ, గంధమాదన, శతబలి, దధిముఖ, సుషేణాంగదాదులగు పెక్కండ్రు సేనానాయకులు చతురంగబల కార్యకరణసమర్థులయిన తరుచరకోట్లఁ గూర్చుకొని సమరసన్నద్ధులయి, ఏక్షణమున నెటకరుగుమన్నను బయలుదేర నాయత్తులయి యున్నవా"రని విన్నవించి యద్దేవి యనుమతివడసి శ్రీరామచంద్రసందర్శన కుతూహలుఁడయి గమనోన్ముఖుఁడయ్యెను.

## అశోకవనభంగము

ఇట్లు శ్రీరామపాదారవింద భక్తుండగు నాంజనేయుండు పురంబు వెడలి చనుచుఁ దన యంతరంగంబున "జనకతనయా న్వేషణార్థినయి చనుదెంచిన నేను మిన్నకపోరాదు. కావున మదీయాగమనంబు రావణుం డెఱుంగునట్లు నాదు పౌరుషంబు దీపింపఁజేసి, నాబలపరాక్రమంబులు లోకమున వెల్లడిఁజేసెదఁ గాక!" యని నిశ్చయించి మగిడివచ్చి పురంబుసొత్తెంచి యనంతబలసంపన్నుఁడై విజృంభించి,

సీసమాలిక.

మేదినిసమముగా ♦ మేడలుపడఁద్రోచి
కేళీగృహంబులు ♦ నేలఁగలిపి
వాజిశాలలుసొచ్చి ♦ వాయువేగముఁగల
ఘోటకంబులధాత్రిఁ ♦ గూలఁదన్ని
జలజాకరంబులఁ ♦ గలఁచిగారలుపెట్టి
వృక్షజాతంబులు ♦ విఱుగఁదన్ని
యాయుధశాలల ♦ కరిగిమహాధను
ర్వశిఖాదికంబులు ♦ విఱిచివైచి
పుష్పగుచ్ఛంబులు ♦ పుణికిపారఁగవైచి
తేనెలుదాల్చి పూఁ ♦ దేనెలుడిపి
పొదరిండ్లనన్నింటిఁ ♦ జదియంగనుగ్గాడి
జప్పరంబులు గూలఁ ♦ జరచి చరచి

తే. వనము గాంచెడి దానవ ♦ వర్గములను
వీరవరుల బలిమిఁ బడి ♦ వేలఁ ద్రుంప
సీతకడనున్న రాక్షస ♦ స్త్రీలు బెదరి
పారిపోయిరి రావణు ♦ పాలికపుడు.

ఇట్లు వారుక్కసెడి భయభ్రాంతలై శిరోజంబులువీడ, నంగంబులువడంక, నిట్టూర్పులునిగుడ, స్వేదబిందుసందోహంబులుస్రవింప సారెసారెకుఁ దిరిగితిరిగి చూచుచు, సింగంబుఁగన్న లేళ్ళచందంబునఁ బ్రాణభయంబునఁ బఱచి రాక్షసనాయకుండగు రావణునకు మ్రొక్కి యప్పటికి జరిగిన చొప్పెల్లను విస్పష్టంబుగా నెఱింగించిరి. అంత నతఁడు ప్రబల రోషకషాయితాననుండై ధీరతఁజూపుట కిదియ యదనని యూపాక్ష, విరూపాక్ష, దుర్ధర, ప్రఘస, భాసకర్ణ, ప్రభృతులగు బలియురైన సైన్యనాయకులఁబనిచె. వారలు ససైన్యులయి తెరలి హనుమంతునిచేరువకుం బాఱిన నతఁడు శంకింపక యమ్మహాబలులైన రక్కసులతోడ నుక్కున నొక్కరుండయి నిలిచి రణంబుసేయ సమకట్టి యవార్యధైర్యగాంభీర్యంబుల నొండొరులం బట్టియుఁ గిట్టియు, నడిచియుం బొడిచియు రాచియుం ద్రోచియు, నిట్లు ఘోరరణంబుసేసి నిమిషమాత్రంబున నద్దనుజకింకరుల నుక్కడంగం బెక్కండ్రం జంపె. అప్పుడు హతశేషులగు రాక్షసులు భయభ్రాంతులయి పఱతెంచి దనుజవీరులాంజనేయునిచే నిహతులైరని యసురేం

క్రమున కేతెంచినవిని ప్రళయకాలానలుని తెఱంగున మండి పడి తనకొమరుండగు నింద్రజిత్తునవలోకించి "నీవస్త్రవిదుఁడవు. ఆత్మరక్షణమాందేమరక యనేక శస్త్రాస్త్రప్రయోగ రహస్య నిపుణత్వంబునంజేసి యాసమీరనందనుని నిర్జింపుము." అని నియోగించిన నవ్వీరుఁడు విలయకాలకృతాంతుని చందంబున నుగ్రుఁడయి యమంద రయంబునం జని తగువిధంబున భీతి పుట్టించి రెట్టించి వెనుకదారింబట్టించి యెట్టకేలకునికిపట్టు మెట్టించెదనని యప్పవమాననూనునిం జుట్టుముట్టి యట్టహాసంబున సాధారణాస్త్రప్రయోగంబునఁ గొంతవడి కయ్యముసలిపి పిదప బ్రహ్మాస్త్రంబనుసంధించి యాతనినేసె. అంత నయ్యమోఘాస్త్రంబన్నలువ వచనంబుపెంపున హనుమంతుం జంపనోల్లక బద్ధుంగావించిన నతండు బ్రహ్మాస్త్రపాశబద్ధుండై చేష్టలుదక్కి ధరణీతలంబునం బడియె.

అప్పుడక్కడ నుండిన రక్కసులక్కరువలిపట్టిం సంకెలలఁ బెడకేలుకట్టి కాష్ఠముష్టిప్రహారంబులం బీడించుచు మంత్రిబాంధవ పరివార పరివృతుండయియున్న రాక్షసేశ్వరుని సన్నిధికిం దోడితెచ్చిరి. అద్దనుజవల్లభుఁ డప్పావనింగని రోషారుణితలోచనుండయి భీకర కరవాలంబుఁ గేలందాల్చి మహీవలయంబు పదాహతంబుల గడగడ వడంక,

కం. "ఖండించెద నీచేతులు
తుండించెద నడుము రెండు తునియలుగాఁగ

ఖండించెద కత్తులచే
దండించెద నూనెలోన ♦ వాయుజ నిన్నున్."

అని కఠోరకంఠనాదంబొనర్చి వానింబరిమార్ప నుద్యుక్తుఁడయ్యె. అయ్యవసరంబున విభీషణుని నీతివచనంబులు మన్నించి దూతనువధించుటకంటె నవమానించిపుచ్చుటయే శ్రేష్ఠంబని యెఱింగి యద్దానవేంద్రుండవ్వానరశ్రేష్ఠుని వాలాగ్రంబునకుఁ దైలమునఁదడిపినపుట్టంబులుచుట్టి యనలంబుదరికొల్పి ప్రదీప్తంబగువాలంబుతోఁ బురంబునల్లడలం ద్రిప్పికొనిరండని యసురభటులకానతిచ్చిన వారునట్ల చేసిరి. అప్పవననందనుండింద్రజిత్ప్రయుక్తబ్రహ్మాస్త్రబంధనవిముక్తుండగుటం జేసి, మింటమంటనెగయుచుండఁ దనయుల్లంబున ఖేదక్రోధమ్ములుక్రమ్మంజిమ్మరేఁగి యకుంఠితబలంబున శృంఖలంబులను జూర్ణంబు గావించి, డిటవుదప్పకకుప్పించి యుప్పరంబెగసి విభీషణుని ప్రాసాదంబొక్కండుదక్కఁ దక్కినసకలదైతేయసౌధపటలంబులను, నికేతనములను దనవాలంబున దగ్ధంబులఁగావించి, "చూచిరమ్మనినఁగాల్చివచ్చె" నను సామెత భూమిపై వెలయునట్లు తన మహాద్భుతప్రభావం బెల్లవారికిఁదెల్లంబుసేసె.

అతఁడు సముద్రమునకరిగి తజ్జలంబులవాలంబుఁ జల్లార్చి కృతార్థుండయి తన కౌతూహలంబు భూలోకమాతయగు సీత కెఱింగింపఁదలఁచి యతిశీఘ్రగమనంబునం జని యద్దేవికిఁ బ్రదక్షిణపూర్వకంబుగానమస్కరించి, తనచేసినవిధంబంతయు

ససంభ్రమంబుగాఁజెప్పిన విని యాతని ధైర్యస్థైర్యంబులకును, బరాక్రమంబునకును బ్రముదితహృదయయై యిట్లనియె. "ఆంజనేయా! ఇఁక వ్యర్థముగాఁ గాలయాపనము సేయఁదగదు. నీవు నాయందుఁ గృపాంతరంగుఁడవై సత్వరముగ శ్రీరామచంద్రుపాలికిఁజని యమ్మహానీయునకు నాయున్నచాందం బెఱింగించి త్రిలోకకంటకుండగు దశకంఠుం దునుమాడుటకయి యాతని సైన్యసమేతంబుగ నిటకుఁదోడ్కొనిరమ్ము. దురాత్ముండైన దశగ్రీవుని దెసం గృపఁజేయవలదు. నన్నిట్టి కష్టములపాలుసేసిన యానృశంసుఁడెల్లభంగుల వధ్యుండు. అప్పరమపాపాత్ముని ఆపరమనీచుని, ఆపరస్త్రీవంచకుని వధించుటయ మదీయమనోరథంబు"అనిన నట్లచేయువాఁడనని యద్దేవికి నమస్కరించి వీడ్కొని వాయుజుండరిగె.

## హనుమంతుఁడు మరల సముద్రమును దాఁటి అంగదాదులంగలసికొనుట.

అత్యంతమతిమంతుఁడైన హనుమంతుఁడు జానకీదేవి చేత ననుజ్ఞాతుండై లంకాపురంబు నిర్గమించి పారావారంబుఁ దరించి తన్నిరీక్షణ తత్పరులై యున్న జాంబవ దంగద నల నీల ప్రభృతులం గలిసికొనియె. వారలప్పావనిం బరివేష్టించి ఫలమూలంబులు సమర్పించి కుసుమంబులం బూజించి సీతాన్వేషణ కథాశ్రవణకుతూహలాయత్తచేతస్కులై యడిగిన జాంబవదాదులకతఁడు సవినయంబుగా నమస్కరించి,

కం. రఘువరుఁ డిచ్చిన ముద్రిక
రఘువల్లభుదేవికీయ ♦ రభసంబున నా
రఘువరున కానవాలిడె
రఘుపతిసతి తనశిరంబు ♦ రతనము వేడ్కన్.

కానిని గొనివచ్చితినని తనపోయివచ్చినకార్యంబు తెలియంగాను పూర్వకంబుగా సెలవింగించిన వారలు పరమానందంబుంబొంది వెలుఁగుపడి యాతనింబొగడిరి. తదనంతరమున నందఱు సుఖవృత్తినచట నారేయిగడపి, మఱునాఁడు ప్రభాతంబున నచ్చోటు గదలి సాల, రసాల, తాల, తమాల, తక్కోల, హింతాల, నారికేళ, ఖర్జూ, రార్జున, జంబీర, కదంబ, కుంద, చందన, పిచుమంద, మందారప్రముఖ తరునిచయంబులు గల సుగ్రీవుని మధువనంబుఁజొచ్చి పరమోత్సాహులై యందలి యమృతకల్పంబులగు ఫలంబుల యథేచ్ఛమెసవి సుధారసోప మానంబులగు దివ్యసరోవరసలిలంబులఁద్రావి పరితృప్తులై యిఁక నిచ్చటఁ దడవుసేయుట కర్తవ్యంబుగాదని యందఱుం గూడికొని ప్రమదంబున శ్రీరామ సందర్శనంబునకుం జనిరి.

హనుమంతుఁడు సీతావృత్తాంతము రామునకుఁ జెప్పుట.

శ్రీరామచంద్రుని చిత్తమంతయుఁ దన ప్రియకాంతా మణియందు లగ్నమైయుండుటంజేసి యతఁడు క్షణమొక్కొక యుగమ్ముగాఁ గడపుచు సీతావృత్తాంతాకర్ణనోత్కంఠుండై యుండెను. అట శ్రీరామసందర్శనలాలసులై వెడలిన జాంబ

వత్ప్రముఖవలీముఖశ్రేష్ఠులందఱును ఋశ్యమూకపర్వతంబు నధిగమించి రామలక్ష్మణసుగ్రీవులసన్నిధిం జేరిరి. అప్పుడు సమీరనందనుఁడు, కౌసల్యానందను చరణంబులకుఁ బ్రణమిల్లి సౌమిత్రికభివందనమాచరించి కపిలోకగ్రామణియగు సుగ్రీవునకు జోహారులొనర్చి, తక్కంగల జాంబవత్ప్రముఖ నానావలీముఖులకు మోదంబుఁగూర్చి తాఁజన్నతెఱంగు నంజలిఘటించి యిట్లని చెప్పఁదొడఁగె. "రామా! భవదాశీః ప్రభావమున శతయోజనవిస్తీర్ణమగువారిధి లంఘించి లంకం జేరి భువనైకపూతయగుసీతంగాంచి యూఱడించి తామొసంగిన ముద్రికనిచ్చి కుశలంబుఁజెప్పి తచ్ఛిరోరత్నముం గైకొని, సెలవువడసి, యశోకవనంబువిధ్వంసంబుఁగావించి, రక్కసుల నుక్కడఁగించి, బ్రహ్మాస్త్రబద్ధుఁడనై లంకంజేరి లంకాదహనము గావించి వచ్చితిన"ని యామూలాగ్రముగ నెఱుంగఁ జెప్ప దాశరాముఁడానందబాష్పధారాసిక్తవదనుఁడయి కుశల సంప్రశ్నముఁ గావించుచుండ నద్దేవియొసంగిన శిరోరత్నంబ మ్మారుతియా రాముని కరకమలంబులనిడిన నతఁడద్దానిఁ గన్నులనద్దికొని పులకితగాత్రుఁడయి తిరిగి కన్నులనద్దికొనుచు సంతసించుచు శోకించుచు, హా! సీతా!! సుగుణోపేతా!!! యనుచు, హా! యనుచు, ననుంబాసితివా! యనుచు, దుఃఖితాత్ముఁడయి హనుమంతు నభినందించుచు, సుగ్రీవునివంకకుఁ దేఱి చూచి, "మిత్రమా! నీస్నేహప్రభావమ్మున నేను ధన్యుఁడ నైతిని. ఈహనుమగావించిన మహోపకారమునకు నేనెట్టి

ప్రత్యుపకృతి చేయనోపుదు?" నని సుగ్రీవుని, నాతనిమంత్రి హనుమంతునిఁ దక్కినవనచరవర్గమును గాంచి యందఱనన్ని తెఱంగుల బహూకరించెను. ఇట్లు బహూకరించిఁ "సుగ్రీవా! యుద్ధమ్మునకు సర్వసైన్యముల నాయితపఱుపవే" యనిన సుగ్రీవుఁడును వల్లెయని ప్రయాణశంఖముపూరించి శౌర్య నిధులగు వానరనాయకుల రావించి, సైన్యశాఖల విభజించి లంకారాజ్యము నఱిముఱినుఱుమాడ సంసిద్ధుఁడయి యుండె.

## రాముఁడు సేతుబంధనము గావించుట.

ఇట్లు సమరసన్నాహంబునకుఁ గట్టాయితంబులైన శత సహస్రాయుతసంఖ్యగల మహాసైన్యసమూహంబు లిరుగడల నడువ శ్రీరామచంద్రుఁడును రణోత్సాహంబుదీపింప ననికి వెడలె. లక్ష్మణ హనుమత్సుగ్రీవాదులును, సైన్యంబులతోడం దోడుపడువారై వెడలిరి. అమ్మహాసైన్యంబులయుం దొక్కఁడును దూరపుఁబయనంబనియుఁ గ్రూరరాక్షసవీరసంగ్రామం బెయ్యది యేరీతినగునోకో యనియును శంకఁగొనక నొక్క ముహూర్తంబైన నొక్కచోఁ గాలూదినిలువక నడచుచు, నం దందవిడియుచు యుద్ధాభికాంక్ష మనంబునం జెంగలింప నుద్దా మగమనంబునం జనిచని కతిపయవాసరంబులకు దక్షిణలవణ పారావారముం జేరిరి. అయ్యెడ రాఘవేంద్రుండుపవసించి దర్భాస్తరణంబుపయిం బ్రాఙ్ముఖంబుగానధివసించి యతిగంభీ రుఁడును, సర్వజనదర్శనీయుఁడును, సకలరత్ననిలయుఁడును, జడ

జంతుసంతానాశ్రయుండునునగు సముద్రునిం దలఁచి ప్రార్థించె. అతండు విలంబనంబుఁ జేసి పొడచూపకుండుటంగని యమ్మహనీయచరిత్రుండు రోషసంరక్తనయనుండై యమ్మహాంబుధి శోషింపఁజేయఁదలంచి బ్రహ్మాస్త్రంబు సంధించె. అంత నాపగావిభుఁడగు సముద్రుండుఁ గరుణాసముద్రుండగు శ్రీరామభద్రునకుఁ బొడచూపి కృతప్రణాముఁడై యిట్లనియె. "దేవా! మహానుభావా! వనచరుల నెల్ల రావించి యబ్ధిదాఁటుటకనువగు సేతువుఁ గట్టునట్లాజ్ఞాపింపుము. ఏనద్దాని మునుఁగకుండ నొదల ధరియించెదను." అనిపలికి యాతనిం బ్రశాంతచిత్తునింజేసిన నతఁడును తద్వచనానంతరంబున వానరయూథంబులను బిలువంబనిచి సేతుబంధనంబు సేయ నియోగించె.

శ్రీరస్తు

శ్రీ వేంకటరమణ పరబ్రహ్మణేనమః

# శ్రీరామకథామృతము.



## యుద్ధకాండము.

### విభీషణుండు రాముని శరణు సొచ్చుట.

రాముని శాసనంబున నవ్వనచరులు శతసహస్రంబు లొక్కొక్కమొత్తంబయి సముల్లాససన్నాహంబున నతిరభసంబున నలుదిక్కులకుంజని పాషాణవ్రాతంబుఁ గరంబుల, నురంబుల, శిరంబుల, మూఁపులఁ గొని తెచ్చి యతిగంభీరంబు నపారంబునగు పారావారంబునఁ బడవైచుచు వార్ధికడ్డముగ నతిదృఢంబగు సేతుబంధనంబు నిర్మించిరి. అయ్యది చూడ్కికి వేడ్క సేయుచు నొప్పె.

అయ్యవసరంబున దానవాన్వయభూషణుండగు విభీషణుండు, కనకరత్నప్రభాంచిత కిరీటాలంకార సంశోభితుండై కొలువుకూటంబునఁ బ్రకాశించు రావణుం గనుంగొని, "దేవా! రాముఁడు పరంధాముఁడు. గాధేయసవనసంరక్షణధురీణుఁడు.

ధనుర్ధరులలో నెల్ల నగ్రగణ్యుఁడు. హరువిల్లువిఱిచిన వరపరా
క్రమ ధురంధరుఁడు. పరశురామగర్వనిర్వాపణోపార్జితమహా
యశుఁడు. విరాధుఁ బడవైచిన ధీరుఁడు ఖరదూషణాదుల
ఖండించినవీరుఁడు. అట్టి నిస్తులబాహుబలసంపన్నునితో శత్రు
త్వము సకలవినాశహేతువు. కావున వానితోడివిరోధంబుఁ
బరిహరించుటలగ్గు. నావచనంబు ధర్మోపేతంబు. దీని నతిక్ర
మించి కాలహరణంబుసేయక భూలోకమాతయగు సీతా
కాంత నాతనికినర్పించి యెప్పటియట్లయుండుట కార్యంబు.
ఏను నీకు హితంబుఁ గోరెడు వాఁడనని నిశ్చయించి నాయుప
దేశమును వినుము.'' అని సద్బోధఁజేసె. రావణుఁ డనుజాపలు
కులు సైకొననొల్లక యాతని ధిక్కరించి పరిభవించి యిల్వెడల
నెట్టిన నతఁడు తత్పరాభవము సహింపనోపక క్రుద్ధుఁడయి
యాతనికిఁబ్రతీకారంబు సేయఁదలఁచి, శాంతిదయానిధియైన
రాముఁడు ప్రాణభయార్తులై శరణుసొచ్చినవారిని రక్షించునని
మదినెంచి యచ్చోటువాసి రామదేవుపాలికరిగె. అరిగి యాతనికి
భక్తియైనమస్కరించి, "మహాత్మా! ఏను రావణానుజుఁడను.
విభీషణుఁడను వాఁడ. మదనుజునిచే భవదర్థంబవమానితుఁ
డనై భవదనుగ్రహంబపేక్షించి చనుదెంచినాఁడ. ఆర్తశర
ణ్యుండవగు నీ వనన్యశరణుండనగునన్ను రక్షింపవలయు''నని
యన్నచేత నవమానితుఁడై వచ్చినవృత్తాంతమును, దానవనాథు
బలాబలంబులను నేర్పడఁజెప్పె. అంత నాశరణాగతరక్షకుఁడు
కరుణాభరితాత్ముఁడయి,

చ. "దనుజ కులావతంస! మది
డాఁపక నీ వెఱిఁగింప నద్దశా
స్యుని తెఱఁగెల్ల వింటిఁ గమ
లోద్భవుఁడడ్డమువచ్చి కాఁచినం
బనివడి పుత్రమిత్ర జన
బాంధవమంత్రి సమన్వితంబుగా
నని మొనవాని గీటడఁచి
యాసురరాజ్యము నీకొసంగెదన్".

అని శపథంబుసేసి యభయంబిచ్చె. రాముడు తన యెడలఁజూపిన కృపారసమ్మునకు నచ్చెరువంది సంతసించిన యప్పరమభాగవతోత్తముఁడగు విభీషణుఁ డాతనియెడఁ జాల కృతజ్ఞుఁడై నిశ్చలభక్తితో నిష్కాపట్యముతోఁ బ్రవర్తించుచుండె. దాన నయ్యిరువురనన్యసామాన్యమైత్రింగలిగి వర్ధిల్లుచుండిరి.

అత్తఱి శుకుఁడనునిశాచరుండు రావణప్రేరితుఁడై వానరాకారంబుఁదాల్చి పరిసరారణ్యములం గ్రుమ్మఱుచున్న నెఱింగి వానింబట్టికొని తరుచరులు రామచంద్రునిసన్నిధికిం జనుదెంచి వాని విహితవిధానంబున దండింపఁబోవ నద్దనుజుఁడు భయవిహ్వలుఁడై "యేనుదానవేంద్రునిచారుఁడను నన్నుహింసింపకుఁడ"ని ప్రార్థించె. శరణాగతుఁడయినశుకునియెడ, భగవానుఁడైన శ్రీరామచంద్రమూర్తి కరుణించి పొమ్మని యనుజ్ఞ

యిచ్చిన నవ్వనచరులు రామునాజ్ఞను వాని విడిచిపుచ్చిరి. అద్దశముఖుండును లఘుగమనంబునంజని దశాననునింగని కపిసైన్యంబు దుర్జయంబని యెఱింగించిన నతండు దాని సరకు గొనకుండె.

## రాముఁడు లంకాపట్టణంబుఁజొచ్చుట.

సేనానియమములను జక్కఁబఱచినపిదప శ్రీరామ భూకాంతుఁడు సంగరోత్సాహుఁడై తత్తత్కపిసైన్యంబులను యథావిధి విభజించి తత్తద్భాగంబులకు వివేకభూషితులును, ప్రతాపమహితులునగువారి నధిపతులుగఁ జేసి మహారాజనీతి ధురంధరుఁడగు సుగ్రీవునకు సర్వసైన్యాధిపత్యమొసంగి కాల్న డను వారిసాయమున సేతుబంధనంబున సముద్రముతరించి వానరవీరులనెల్లరను యుద్ధసన్నద్ధులైయుండ నేమించె. అంత నాతఁడాపంక్తికంధరుని యభిప్రాయం బెఱుంగఁదలఁచి వాలి సూనుఁడగు నంగదుని రావించి, "నీవు రావణుఁడున్న యెడకుం జని యతనికిం దగిన తెఱంగున బుద్ధిఁ గఱపి వైదేహిని విడు చుట మేలని చెప్పుమ"ని పనిచె. ఆవీరుఁడును దశగ్రీవనివేశం బునకుం జని సముచితంబుగా సందర్శించి శ్రీరామదేవుశాసనం బునం దాను దూతయైవచ్చుటయు వాలిపుత్త్రుఁడననియు, నంగదుఁడను నామంబునఁ బరగువాఁడననియుచు విన్నవించి సాంత్వనపూర్వకంబుగా సంధివచనంబులాడుతఱి రావణుండు రోషమొకపొంత యీసడింపొకచెంత నుట్టిపడఁ గనులఁ

గొంజాయుదోఁపఁ బ్రచండకోపోద్దీపితుఁడై యుత్కటంబగు కోపభరమ్మున నాతనిపై దారుణశరవర్షముం గురియించె. అంత నంగదుఁ డాతనియాగ్రహంబునకు నిగ్రహపడక డాలుం బలకయుఁ గేలందాలిచి త్రిప్పుచు నవలీలగ నాశరవర్షమును నివారించుకొనుచు మిక్కుటముగ వానితోఁడఁబోరి వానిం బొడిచి వానికిరీటమునుమాత్ర మెుక్కుమ్మడి పుడమిం గూల నేసి శిబిరమధ్యమునకు లంఘించి రామచంద్రునకుఁ దనపోయి వచ్చినతెఱంగెఱింగించె.

రాముఁడాతనివలన వృత్తాంతమంతయువిని యద్భుత పడి తుదకు సమరంబవశ్యకర్తవ్యంబని నిశ్చయించి నాలుగు ద్వారంబులకడ సైన్యంబుల నుండనియమించె. కపివీరులెల్లరు సమితోత్సాహులై తదాజ్ఞను నియమితప్రదేశముల నిలిచి శత్రుసైన్యంబుల నుఱుమాడనుంకించుచు సింహనాదముల నభోంతరాళములఁబ్రతిధ్వనింపఁజేయుచు గంతులిడుచు భుజా స్ఫాలనమాచరించుచుఁ జలింపక నిలిచియుండిరి.

రణకర్కశుండగు రావణుండును సమరసన్నాహంబులం జేసి సంగ్రామశూరులగు పెక్కురుదానవవీరుల ననికనిచెను. సంగరము ప్రారంభమయ్యెను. ఇరుగడలవారును రోషప్రవృద్ధమానసులై క్రమ్మఱ నద్భుతప్రకారంబునఁ గదనంబునకుం దలపడి పోరాడఁదొడంగిరి. రాముఁడపారబలపరాక్రమ సంపత్తిని వైరివ్యూహంబులను భేదించుచు భండనంబున వైరి

తండములను జండగతిం జెండాడుచుఁ బిండిపిండిగా నుగ్గాడుచుండెను. అట్టితఱి రావణుచారులైన శుకసారణులను రక్కసులిరువురు హరిరూపధరులై వానరసైన్యంబుసొచ్చి యందలి మర్మంబులం గనుచుఁ దత్సేనాసమూహంబు నన్వేషించుచు, గణించుచు నెల్లెడలం దిరుగుచుండ శాత్రవభీషణుండగు విభీషణుండు వారింబట్టిబద్ధులఁగావించి శ్రీరామునకు సమర్పించి "వీరు రావణాసురునియనుజ్ఞ మనసేనామర్మంబు లరయవచ్చిన వేఁగువాండ్ర"ని విన్నవించె. అంత వారు భయభ్రాంతులయి శరణమ్మువేఁడినకతమ్మున నద్దయాసముద్రుఁడగు రామభద్రుఁడు వారియందుఁగరుణించి విడిచిపుచ్చుట కాజ్ఞయొసంగ నాతం డట్లు కావించె.

ఇట్లు బహుప్రకారంబులం బోరుచుఁ బ్రొద్దు గ్రుంకినప్పుడు రణంబుపసంహరింపుచు రేపకడఁ దొడంగెడి యుభయసైన్యంబులకు సర్వలోకభయావహంబయిన యుద్ధంబు ప్రవర్తిల్లె. అమ్మహాభయంకర నంకుల సమరంబుఁ జూడ నంతరిక్షంబున గుమిగూడిన సురసిద్ధసాధ్యవిద్యాధరులు మొదలగు వారికిఁగూడఁ దదుభయసైన్యంబుల జయాపజయమ్ములు నిర్ణయింప నలవికాకుండె. రాక్షసబలంబునందుఁ గొందఱు రుధిరసిక్తాంగులై, కొందఱు విచ్ఛిన్నపక్షులై, కొందఱు భిన్నోత్తమాంగులై, కొందఱు రుధిరోద్గారితముఖులై, కొందఱు విలూనకంఠులై, కొందఱు విదారితశరీరులై, కొందఱు గతాసువులై పుడమిం ద్రెళ్లిరి. కదనరంగం బెల్లఁ బీనుంగుపెంటలచేతను,

రుధిరప్రవాహంబులచేతను నిండినిబిడీకృతంబై యతిభయంకరంబై యొప్పె. ఇట్టి సంకులసమరసమయంబునఁ గొందఱు దనుజాంగనలు రావణప్రేరితలై విద్యుజ్జిహ్వుఁడను దానవునిచే నఱుకంబడి రక్తసిక్తంబై, ధూళిధూసరితంబై, భయంకరంబైయున్న రఘురాము మస్తకముంబోలు శిరంబొకండుకొని తెచ్చి సీత పదనికటంబునం దునిచిన నద్దేవి యమ్మాయాకల్పితశిరంబును, దానిముఖవర్ణంబును, నేత్రంబులను, కేశంబులను విలోకించి మోహంబున నిక్కంబుగ రాముఁడు హతుఁడయ్యెనను తలంపున శోకోపహతచేతస్కయై యిట్లని విలపించె.

తే. "హా! రఘూత్తమ! హా! కరు ♦ ణాలవాల!
హా! సుమిత్రాతనూజ! పు ♦ ణ్యాత్మ! హా! మ
హానుభావ! హా! కౌసల్య! ♦ హా! సుమిత్ర!
పాసితినిమిమ్ము శోకవా ♦ రాసిఁ బడితి.

అకటా! నేఁడెట్టిదుర్దినము. నేనెంతటి యభాగ్యను? గతజన్మమందు నేనేదంపతుల నెడఁబాపియుంటినో తద్దోషఫలం బిపుడు నాకుఁజేసేత శత్రుకృతంబై యుత్తెఱంగున నన్నిక్కట్టుల పాలుచేసె. నేను జన్మాంతరమందొనర్చిన దోషమునకు ననుగుణమగుఫలమును నేఁడనుభవించుచున్నదాన. ఇంతకు నానోఁచిన నోముల ఫలమిట్లున్నది. ఇఁక నాజీవితము వలనఁ బ్రయోజనమేమి? నాకేల దుఃఖభాజనంబైన యీబ్రతుకు? పతివియోగినినై మనుటకంటె నాకిచ్చట జలంబులఁ

బడియైనఁ జిచ్చులోనురికియైనఁ బాశంబులచే నురిగొనియైన విషంబుఁగ్రోలియైనఁ బ్రాణత్యాగంబు సేయుట మేలని తల పోయుచు నేత్రద్వంద్వమునందు ముత్యములలీలంగాఱు బాష్ప ములఁ బాణిపల్లవమున సమ్మార్జనము సేసికొనుచుండె. అద్దేవి యుత్తలపాటును బ్రత్యక్షముగఁ జూచుచున్న విభీషణుని భార్య 'సరమ' యనురక్కసి యా-మెకు దుఃఖనివారణంబు సేయఁ దలఁచి, "తల్లీ! ఏల, నీవిలీల జాలింబడియెదవు? ధైర్యగాంభీర్యంబులఁ దేజరిల్లు నీబోఁటిధీరలకు విచారింపనుచితమే? ఇయ్యది రాక్షసమాయాకల్పితమగు రామశిరముగాని నిక్కముగ రామచంద్రునిమస్తకము కాదు. నీవధైర్యపడకుము. సహజంబైన నీపరమపాతివ్రత్యమహిమంబునఁ గష్టములను సాధించి కృతార్థవయ్యెదు. విచారింపకుమని" యుపశమనవాక్యంబుల ననునయించె. జనకజయు నాసరమా వాగమృతవృష్టిచేఁ గించి దుపశమితపరీతాపయై చిత్తము శ్రీరామాయత్తముఁ గావించి విలపించుచుండె.

## రామలక్ష్మణులు మూర్ఛిల్లుట.

కొండొకసమయంబున జగదేకశూరుండగురఘువీరుండాశీవిషశరపాశబద్ధుఁడై యనుజసహితంబుగా నిశ్చేష్టితుండై మహీతలంబుపయిం బడియె. తదీయ వార్తాశ్రవణంబున జనకనందన ఖండితకదళీతరుకాండంబుచందమ్మున మూర్ఛిల్లె. అద్దేవిని

రాక్షసాంగనలు శీతలజలంబులం బరిషేచనంబు సేసిన మూర్ఛఁదేఱి, మహాపురుషలక్షణలక్షితులగు నా రామలక్ష్మణులను దలంచి, "ఆహా! ఎంతటిదారుణప్రవృత్తి వింటిని? తరింపఁజాలని యీదుఃఖమును నే నెట్లు కడుపఁజాలుదును? నా కెద్ది తెరువు? ఎవ్వగుశరణంబు? మత్పురాకృతంబును నిట్లున్నది. ఏమి సేయుదును" అని చేయునది లేక కన్నీరుమున్నీరై పాఱ నేడ్చుచుండెను. సుశీలయు, సరళహృదయయుఁ బరమపావనియునగు,

కం. జనకునికూతురు దశరథ
జనపతికోడలును రామ ♦ చంద్రునిసతిభూ
తనయయగు "సీత" కిటువిధి
వని నిడుములు గుడువుమనుచు ♦ వ్రాసె నదయుఁడై.

జనకునంతటివానికిఁబుత్రియై పరిచారికాసహస్ర మనిశంబును సేవలఁజేయుశుద్ధాంతసౌధంబునందు మెలంగు నాగర్భశ్రీమంతురాలగు నయ్యంగనామణి క్రూరరాక్షసమృగపాలితంబగుకాననమునకు నాథుని వెంబడించిచని దుస్సహములగు నిక్కట్టులకు లోనయ్యె. ఔరా! పురాకృత కర్మఫలమ్మను భవింపక తీరదుగదా! "అవశ్యమనుభోక్తవ్యంకృతంకర్మ శుభాశుభ" మ్మనువాక్యంబు నిరర్థకంబగునే! ఎంతవారైనను కర్మమునుద్రోసి మనజాలరు. ధీరయైనను సీత నిరంతరదుర్భరవిషాదమునకు లోనైమనుట దైవికము. చింత్యము.

## లక్ష్మణుఁడు మూర్ఛఁదేఱుట.

అట రాఘవేంద్రుఁడు కొండొకసేపునకు నల్లన మేలఁ కువఁగని గాఢమూర్ఛాపారవశ్యంబునమైమఱచి చచ్చినక్రియం దనచెంగటఁబడియున్న సౌమిత్రింగాంచి దుఃఖాశ్రువులు గన్నులఁగ్రమ్మఁదేఱ భాతృస్నేహంబున విషణ్ణహృదయుఁడై "అయ్యో! ఏమి నాయదృష్టము? నాకెంతకష్టము ప్రాప్తించె. ఏమిసేయుదు? త్రికరణశుద్ధిగ నాయభ్యుదయంబుఁగోరుచు, నాకన్నివిధంబుల కుడిభుజమైయుండిన పరమభక్తుఁడగు నా తమ్మునిం గోలుపోయితి. నేను హతభాగ్యుఁడను. నన్నుఁ బోలు పరమనిర్భాగ్యుఁడు భూమండలమందింకొకఁ డుండఁడనుట నిక్కువము" అని శోకపరీతచిత్తుఁడయియుండె. అమ్మహా వీరుఁడగురాముఁడు మహావిష్ణ్వంశసంభూతుండగుటంజేసి గరుత్మంతుం డయ్యెడకరుగుదెంచినఁ దదాగమనంబుచే నాగాస్త్రంబు మఱుఁగువడియె. అంత మూర్ఛితుఁడయినలక్ష్మణుఁడు చయ్యన మూర్ఛంబాసి తేఱి నిద్రితుండగుపురుషుండు మేల్కాంచినతెఱంగునఁ దెప్పరిల్లి లేచి బలవీర్యతేజంబులఁ బ్రకాశించుచుండె.

## రామరావణయుద్ధము.

ఒకప్పుడింద్రజిత్తు దుర్వారబలంబున బాణాసనంబులఁ గేలనందికొని బ్రహ్మాస్త్రంబుఁబ్రయోగించె. అక్కతన రామలక్ష్మణులును వనచరసైన్యంబులును రణరంగంబునంబడి బిట్టు

మూర్ఛిల్లిరి. అపుడు జాంబవంతుఁడు వెలుఁగుపడి దైవగతిం జింతించి శోకింపక వాయుపుత్త్రుంబిలిచి, "ఓషధీనిలయంబగు పర్వతమునందలి దివ్యౌషధంబులు గొనితెచ్చి రాఘవప్రీతిగా స్మృతిఁదప్పిన మేటివీరుల ప్రాణంబులెత్తి కీర్తివడయుమని" ప్రార్థించె. జాంబవత్ప్రేరితుండై యమ్మారుతనందనుండు ప్రియంబునఁ బ్రచండవేగంబునంజని జాంబవనుక్తౌషధిపర్వతంబుఁ బెకలించి దానినెత్తికొని రయంబునంజనుదెంచె. అమ్మహీధరంబునంగల దివ్యౌషధుల నాఘ్రాణించుటంజేసి రామలక్ష్మణులును రణంబున నిహతులైన హరివీరులందఱును లబ్ధప్రాణతేజస్కులైరి. ఆహా! మణిమంత్రౌషధంబులప్రభావంబు వర్ణింప నజునకైన నలవి కాదుగదా! అనంతరంబ వాయుజుం డద్దరాధరేంద్రంబుఁ జెచ్చెరకందుకంబుచందంబున మగుడంగొనిపోయి తొల్లింటియట్ల నిజస్థానంబుననిడి క్రమ్మఱఁ జనుదెంచె.

లంకాపురాధీశ్వరుఁడైన రావణుఁడును ముక్కుడి రక్కసులచేఁ బెక్కుమాయలం బన్నించుచు ఘోరముగ యుద్ధము సలిపెను గాని లబ్ధవిజయుఁడు కాఁజాలక దైవయోగమున కుంభకర్ణుఁడు, ఇంద్రజిత్తు మున్నగు దానవప్రముఖులాలంబున మడిసిన యనంతరంబునఁ దాను వదనదశకంబునఁ జిడిముడిపాటుగదురనుదీర్ణవిక్రముఁడై బహువిధాయుధాలంకృతవింశతిబాహుఁడై సంగ్రామరంగంబుసొచ్చి తా

నొక్కరుండ సుస్థిరుండై నిలిచి రఘువీరు నెదిరించి మోహారించి దురంబుసలిపె. రఘురాముఁడును వానిందలపడి తన చూపినంత పెనంగుచుండె కాని యెంతరణక్రీడసలిపిన నొక్కంతయుఁ బ్రయోజనము లేకుండుటచే నాతఁడు నిరాశాసంతప్తచిత్తుఁడై నిలిచె. త్రిలోకాధిపతియై సకలదానవవీరుల సంహరించి జగదేకవీరుండని ప్రసిద్ధిఁగాంచిన పరమార్థవిదుండగు పాకశాసనుండు, రాఘవుండు ససైన్యంబుగా దైన్యంబునొందినంగని నిజసారథియగు 'మాతలిం' బిలువంబనిచి "నీవు శీఘ్రంబున మదీయరథంబుఁ గొనిచని శ్రీరామచంద్రునకు సారథివికమ్మని" నియోగించిన నాతఁడట్లు కావించె. అప్పుడయ్యంభోజాతమిత్రకుల పవిత్రుండగు సీతాకళత్రుండు సంతుష్టాంతరంగుండగుచు మాతలిసారథికంబగు నింద్రస్యందనంబు నధిరోహణంబుఁగావించి వీరరసోద్రేకంబున విజృంభించి రాజఠీవి మెఱయ రావణుతోడ ఘోరావహంబు సలిపి యతని శిరంబుల ఖండఖండంబులుగ ఖండించి చెండాడుచుండె. కాని యవి మగిడి యంకురించుటం జేసి యాతఁడు మరణింపకునికి నిఁక నాతని జయించుట దుర్ఘటంబని తలపోసి రావణవధోపాయంబుఁ జింతించుచు శరసంధానంబుసేయుటకుం దోఁపక వెఱఁగుఁపడి విన్ననై యుండె.

## రావణుఁడు నిహతుఁడగుట.

అపుడా యోధుల యాయోధనంబుఁ జూచువేడ్క వేల్పులతోఁగూడఁ జనుదెంచి యంబరంబుననున్న యగస్త్యమహా

క్షింపుమీఁడు శ్రీరామునకీ యుద్ధంబున విలాసమాత్రంబున విజయంబు సంపాదించుతలంపున నాతనికాదిత్యహృదయనామకంబైన స్తోత్రంబుపదేశించి వింటబాణమును సంధింపుమనియె. అజ్జనకజాప్రియుండును నూతనసంభ్రమంబొప్ప నల్లమంత్రోచ్చారణము చేసి రయంబున విల్లుమోపెట్టి బ్రహ్మాస్త్రంబు సంధించి దశకంధరునిపయిఁ బ్రయోగించె. అయ్యమోఘాస్త్రంబు రయంబునంజని ప్రబలవీరసేనాసమన్వితుండగు దానవనాథు శిరంబుఁద్రుంచి వజ్రంబు పర్వతశిఖరంబుంబోలె నేలంగూల్చి విగతాసుం జేసిన నమ్మస్తకంబు కిరీటకుండలాలంకృతంబును రుధిరసిక్తంబునునై మహావాతపతితంబగు తాళఫలంబుకరణి ధరణిపయిం బడియె. శ్రీరామచంద్రున కప్రతిహతంబగువిజయం బప్పటికిఁ జేకూరె. తరుచరవీరవరులు పరమాహ్లాదంబునొంది సింహనాదంబులు సేయుచు రాముని విజయంబుఁ గొనియాడిరి. రామునిరథంబుపైఁ బుష్పవర్షంబు గురిసె. సుగ్రీవవిభీషణాదులగు సుమిత్రులు సౌమిత్రిసహితంబుగా రఘువరునికడకేగి రావణవధమ్మున సంతోషితస్వాంతులై యమ్మహాత్మునిఁ బ్రియసత్కారంబులఁ బూజించిరి.

### మండోదరి రావణుంజూచి దుఃఖించుట.

ఇట్లు చతుర్దశ భువనకంటకుండగు దశకంఠుండు గతాసుండయి రణమేదినిం బడినంజూచి హతశేషులైననిశాచరులు హతనాథులై శోకంబునంబడిరి. పురమందలి రాక్షసభటులం

డఱు మిన్నుముట్టునట్లెలుఁగెత్తి విలపించిరి. రాముని చేత రావణుండు రణంబున నిహతుఁడగుటవిని మండోదరీప్రముఖ శుద్ధాంత కాంతాజనంబులు శోకాకవడి నిర్విణ్ణలైయుండి మగుడఁదెలిసి సదనంబు వెలువడి యెవ్వరెంత నివారించిన నిలువక సముద్రతరంగంబులంబోలె నుబికి యుబికివచ్చు దుఃఖము నాఁపికొనఁజాలక భర్తృమరణదుఃఖాక్రాంతలై యాక్రందనం బుసేయుచుఁ గ్రొమ్ముడులు సడలఁ, గొప్పకప్పుకొప్పులకుం జుట్టినవిరులు విరిసిపడ, ముంగురులు నిటలతటంబునఁ జలింప, జిటలిపెటలిపడు నొడలితారహారమ్ములు కరతాడనంబున నంచలితంబులై నేలపయిఁబడఁ జెక్కులఁ జెమ్మటలూరఁ గొనులసియాడఁ బయ్యెదలు దొలఁగఁ గరంబుల శిరంబులు మోదికొనుచు రణాంగణంబునకుం జనుదెంచి రామరాజ సింహవిదళితరావణమదవారణంబుఁ గాంగిలించుకొని యుచ్చైః స్వనంబున రోదనంబు లొనరించిరి. అందగ్రసతియగుమండో దరి దీనస్వరంబున, "హా! నాథా! సర్వప్రపంచవిజిగీషాపర వశుఁడైన నీకట్టిపాటు వాటిల్లునని యెఱుఁగికదా పరాంగ నాపహృతికిఁ బూనుకొనవలదని నానేర్చినకొలఁది నెన్ని విధంబుల బోధించిన నయ్యది సర్వజనరుచికరంబైన యాహా రంబు రోగాతురునకు నరుచికరంబైనయట్లు నీకు రుచియింప దయ్యె. మదీయ వచనం బాదరింపక త్రోసిపుచ్చుటవలనఁగదా మహాబాహుబలుండ వయ్యును, హిరణ్యగర్భవరప్రథితుఁడ వయ్యును నీవిట్టియవస్థం బొందితివి. ఆహా! దైవసంకల్పము.

నలువచెద్దుంబుఁ దొలంగిపాఱ నేరికిఁదరంబు? విధికృతంబు లెబ్భంగుల నలంఘ్యంబులు." అని పెక్కుతెఱంగుల విలపించుచు శోకార్ణవపరిప్లుతయై కన్నీరుమున్నీరుగా రోదనంబు సేయుచుండె. ఆమెవిలాపంబుఁజూచి సపత్నులందఱు దుఃఖార్ణవమగ్నలయిరి. సంతాపదగ్ధహృదయులగు నయ్యన్నులమిన్నలు కన్నుల కొలంకులనుండి జాఱంగు వేఁడి కన్నీటిచే రావణుమృతకళేబరంబున కభిషేకంబుసేయఁజొచ్చిరి.

## రాముఁడు విభీషణుని లంకారాజ్యపట్టాభిషిక్తునిం జేయుట.

రాఘవేంద్రుని పంపువడసి విభీషణుఁ డన్నిశాటపతికి నగ్నిసంస్కారాది విధులు వైదికతంత్రోక్తక్రమంబున నిర్వర్తించి క్రమ్మఱ నాతని సన్నిధానమున కరుదెంచి సాష్టాంగదండప్రణామం బొనర్చి తద్వృత్తాంతంబెఱిగించె. ఇట్లువచ్చి ప్రెుక్కిన విభీషణునిఁ జూచి దరహాసితవదనుండయి రఘుపుంగవుండు తన యనుగ్రహం బపేక్షించిన విభీషణుని లంకాసామ్రాజ్యాభిషిక్తుం జేయందలంచి సోదరునిం బిలిచి, "లక్ష్మణా! నీవు విభీషణుని పట్టాభిషేకోత్సవప్రయత్నమునకుఁ గడంగుము. రాజులను, దండనాయకులను, బంధుమిత్రజనంబుల నందఱ నాహ్వానింపుము. తత్కార్యమునకుఁ గావలసిన సమస్తపదార్థములను సమకూర్పుము." అనవుడు నాతఁడు పట్టాభిషేకమహోత్సవమునకు వలయు యత్నములు గావించి తత్సంభారములు సిద్ధపఱచెను. ఉపాయనంబు లర్పించుట కమూల్యవస్తు

వులనుగైకొని యనేకులేతెంచిరి. ఆహ్వానింపఁబడినవారెల్లరు సభాసీనులై మహానందముగ నుత్సవమును జూచుచుండిరి. దైవజ్ఞనిరూపిత శుభముహూర్తంబున మంగళవాద్యధ్వనులు మ్రోయఁ బుణ్యాంగనా జనమ్ములు నీరాజనమ్ము లిడుచుండ విధ్యుక్త ప్రకారమ్ముగ విభీషణునకుఁ బట్టాభిషేక మహోత్సవంబు నెఱపి యాచంద్రతారార్కముగ రామతారకనామమ్ము జగమ్మున నుండువఱకు లంకారాజ్యంబుఁ బూజ్యంబుగఁ బరిపాలనంబుఁ జేయుదువుగాక! యని లక్ష్మణుఁడు దీవనలిడియె. జనంబులు విభీషణునకుఁ గానుకలిచ్చి భోజనతాంబూలంబులం బరితృప్తినొంది నిజావాసంబులకుం జనిరి. విభీషణుఁడును డెందంబున నానందంబు నొందియుండె.

## రాముఁడు సీతం దనయొద్దకుఁ బిలిపించుట.

రాఘవుఁడు కతిపయదినములకు సీతాదేవిం దోడ్కొని రండని విభీషణమహిషియగు సరమ మొదలుగాఁగల పుణ్యాంగనల కాజ్ఞాపించెను. వారలమితోత్సాహినులై వెడలిచని వైదేహికి మంగళాభిషేకంబులు గావించి వస్త్రాభరణ కుసుమ గంధాదుల నలంకరించి,

కం. ఇందిర సన్నిభయగు నా
సుందరిఁ ద్రైలోక్యమాత • సొబగొందఁగ వా
రందలమునఁ గొని తెచ్చిరి
కందర్ప సముండు రాము • కడకును బ్రీతిన్.

అప్పుడవ్వైదేహరాజ తనయ చిరకాలదర్శనోల్లాసితం బయిన శ్రీమత్పురుషోత్తమ పరిపూర్ణావతారుండగు శ్రీరామ చంద్రుని సుందరాకారంబు మెల్లన మోమెత్తి చూచి వినయ భక్తితాత్పర్యంబులు వెలయం బ్రణమిల్లి యుల్లాసంబు వెల్లివిరియం దొల్లి పల్లవించు లక్షణంబున నల్లన తనవల్లభుతోఁ బలుకనుద్యుక్తురాలగుచుండ శ్రీరాఘవేశ్వరుండును సకలజ్ఞుం డుగావున నిజవల్లభను విగతకల్మషయని నిజాంతఃకరణమ్మున నెఱింగి, "పరిశోధనసేయక ప్రతిగ్రహించినయెడ జగంబుల జనంబులు నన్నుసతీసంసర్గుఁడని నాయందు గర్హణంబును బర గృహవాసినియని మత్సతియందు దోషంబును నారోపింతురు." అని తలంచి యట్టి లోకాపవాదభయంబునకుం దలరి లోకపరీవాదనివృత్తికొఱకు, "ఓ జనకపుత్రీ! నీవు రావణాపహృతవు, నిందనీయవు, త్యాజ్యవు. నీదెస నాచిత్తంబు ప్రియమై యుండదు. కావున నిన్ను నేనొల్ల. నీతండ్రికడకేనియు నొండుకడకేనియు నీయిష్టంబగుచోటికి నరుగుము. ఇఁక నాకంటఁ బడకుము—పొమ్ము." అనియద్దేవిం బరిత్యజించె.

## సీత యగ్ని ప్రవేశము సేయుట.

ఇట్లు నిజనాథునిచేతం బరిత్యక్తయైనను నమ్మానిని నిజోత్సాహభంగంబులగు నప్పురుషవాక్యంబుల నాకర్ణించి యయ్యవి యప్రియంబులు, నపూర్వంబులునైనను బతిభక్తి పరాయణయగు రమణీమణి కావున నొక్కింతయైనఁ బరిభవ

వికారంబు నొందదయ్యె. అద్దేవి తన నామమున కపవాద కళంకము గలగెననికాని, తనకగౌరవము వాటిల్లెననికాని యిసుమంతయు వగవదయ్యె. నిజేశునకుఁ దనయందుఁగల యచలితస్నేహానురాగములను గూర్చి యప్పరమపతివ్రతా లలామంబు మనంబున లవలేశమును సంశయింపక తనలో నిట్లని వితర్కించుకొనియె. "నేను నాహృదయేశ్వరునిఁ బర మేశ్వరునిగఁ బూజించుకొనుచు ధర్మపథంబున నున్నదాన. నామనోవాక్కాయకర్మంబుల నేదోసంబును లేదు. నేను పర గృహావాసమ్మొనరించిన కారణమ్మున నన్నిపుడు భర్త ప్రతి గ్రహించినయెడల నేను విశుద్ధచరిత్రనను విషయమెఱుంగని పామరజనంబులు మనసునకు వచ్చినరీతి నెల్లఁ జెప్పికొనుచు నన్నే యుదాహరణంబుగా గ్రహించి బహువిధదురితపంక కళంకితచిత్తులై ధర్మపథమును బరిత్యజించి నీతివిదూరులై చరి యింతురు. మత్పాతివ్రత్య విషయ సంశయవచనంబు సహింప నోల్లను. నితాంతనిరపరాధిని ననుటకుఁ దగుప్రమాణమును జూపి మదీయహృదయనైర్మల్యమును లోకమునకును, సంశ యాత్మకుఁడగు రామునకును జాటుటకయి నేనగ్నిప్రవేశము సేయుదును." అని నిశ్చయించె. ఇట్లు కృతనిశ్చయయై యయ్యం గన శుచిస్నాతయై, నూతనపరిధానశోభితయై, నిశ్చలభక్తిప్రే రితయై, నిజనాథునకు సకలపాపప్రాయశ్చిత్తంబుగాఁ బ్రజ్వ లిల్లి యనలోపేతంబును, గర్పూరాది సుగంధబంధురంబునై

ధగధగమంచుచున్న యగ్నికుండమునకుఁ గృతాంజలియై ప్రద
క్షిణంబు లాచరించి యిట్లు ప్రార్థించె. "హా! సర్వేశ్వరా!

సీ. అవిశంబు మచ్చిత్త ♦ మాత్మనాథునియందుఁ
దవిలివర్తించుట ♦ తథ్యమేని;
వితతదుష్టత్వశం ♦ కితనైన యేనుర్వి
నతిశుద్ధచారిత్ర ♦ నైతినేని;
మానసవాక్కాయ ♦ మాన్యకర్మల మనో
ధిపుమాటమీఱి వ ♦ ర్తింపనేని;
రవిచంద్రదిగ్వాయు ♦ రాత్రిసంధ్యాదిన
భూనభంబులు సర్వ ♦ భూతములును

తే. సకల దిక్పాలకులు నాదు ♦ సచ్చరితము
సర్వమునెఱింగియుండుట ♦ సత్యమేని;
సకలలోకముదావహ ♦ సరణిగాఁగఁ
జిత్రభానుండు నన్నుర ♦ క్షించుఁగాక!"

అని యిట్లు నిష్కళంకంబగుమనంబుతో బెట్టిదంబుగాఁ
బలికి దేవర్షులు, మహర్షులు, సుగ్రీవాదికపిసమూహంబులుఁ
జూచుచుండఁగా జనితోత్సాహంబునఁ జిత్యారూఢయయ్యె.
అంత నందలియగ్నిజ్వాలాశిఖ లాకాశమార్గంబునకుబికి భయం
కరగర్జనంబులు సేయందొడంగె. అగ్నిస్ఫులింగములచేత గగన
మండలం బదృశ్యంబయ్యె. ఆభయంకరజ్వాలాసముల్లోలంబగు
పావకమధ్యంబున నుండియు,

ఉ. కందనిదోః ప్రకాశములు
        కాంతియడంగని మోముదమ్మియున్
క్రుందవి చన్నుఁజక్కవలు
        మాయని కుంతలమత్తభృంగముల్
డిందనికన్నుఁగల్వలును
        తేవదలిర్పఁగ నగ్నిజానకి
సుందరి నొప్పెనక్కొలనుఁ
        జొచ్చివెలింగెడులక్ష్మియో యనన్.

అపుడాయమముఖవర్చస్సు మఱింత హెచ్చెను. దేదీప్యమానప్రభలతో వెలయుచు నామె దరహాసిత వదనయై కేల్మోడ్చి నిలిచియుండె. హవ్యవాహనుఁడామె సతీత్వశుద్ధికాత్మనలరి కరుణారసార్ద్రచిత్తుఁడై యద్దేవిని వెంటనిడికొని నిజరూపసాక్షాత్కారంబున నెల్లరు నాలింప గంభీరస్వరమున నిట్లనియె. “రామా! ఈరామ సత్యపథాభిరామ, పావనగుణసీమ, సాధ్వీలలామ.” అనిపలికి యంతర్హితుండయ్యె.

బ్రహ్మాదులు శ్రీరాముని నుతించుట.

అయ్యద్భుతకర్మంబుఁ గాంచి చరాచరాత్మకంబయిన లోకత్రయంబంతయు సంతోషంబునొందె. యక్షకిన్నరకింపురుష విద్యాధరగంధర్వ మిధునంబులు సుందరవిమానారూఢములై యంతరిక్షమున గుమిగూడి జయజయ శబ్దంబులు సేయుచుఁ బరమపావనియు, విశుద్ధచరిత్రయు నగు సీతావధూటిపయి

మందారమల్లికాదికుసుమవర్షంబులు హర్షంబునం గురియించిరి. బ్రహ్మరుద్రేంద్రసిద్ధసాధ్యపురస్సరులైన దేవముఖ్యులద్దేవి యతి పరిశుద్ధచరిత్రయని యంగీకరించి, "రామభద్రా! జానకీదేవిసర్వప్ర త్తుండగు రావణునిగృహమ్మునం దొంటిగఁ జిరకాలమ్మందు టచేఁ గలిగినలోకాపవాదమ్ము నివారణమ్ముకొఱకందఱు నెఱుఁగ దందహ్యమాన మహాభీలకోలాహలజ్వాలాకరాళంబగునగ్నిం బ్రవేశించి యత్యద్భుతపరీక్షనుండి యుత్తీర్ణయై తనపరిశుద్ధ వర్తనమ్మును లోకమ్మునకుం దెలియఁజేసె. ఇఁక నీవద్దేవిం బట్టపుదేవిగాఁ బరిగ్రహించి యనన్యజనసామాన్యసౌఖ్యవైభ వానందమూర్తివై పరమసౌఖ్యంబులం గొను"మని యొక్క పెట్టున నెల్లరు జయజయధ్వానంబులఁ బ్రస్తుతించిరి. అపుడు భువనైక పవిత్రచరిత్రుఁడగు రామచంద్రుఁడు పరమహర్షసం పూర్ణహృదయుఁడయి, పతివ్రతాశిరోమణియై యెల్లరస్తోత్ర ములకుఁ బాత్రమైన వైదేహిం బట్టమహిషిఁగాఁ బరిగ్రహించె. అంత నద్దేవిహర్షప్రఫుల్లవదనకమలయై వల్లభునకుఁ బ్రదక్షిణ పూర్వకముగ నమస్కరించి యలనాఁ డద్దానవేంద్రుఁడు తన్న వమానమునకుఁ బాల్పఱుపనుద్దేశించినతఱి సమక్షమునందుండిన విభీషణుతనయ, "త్రిజట" న్యాయతత్పరయై తనకుఁ గావించిన మహోపకారంబు తెఱం గెఱింగించిన విని యతండెంతయు హర్షించె. అంతనామె విభు ననుమతంబునఁ ద్రిజటను రావించి ప్రీతిపూర్వకముగా నమూల్యభూషణాంబరంబుల నొసంగి

యాదరించిన నామెయు నానందభరితయై నమస్కరించి యద్దేవివీడుకోలువడసి చనియె.

రాముఁడు నంది గ్రామమున కేగుట.

అనంతరంబ దుష్టరాక్షసవిరాముఁడగు శ్రీరఘురాముఁడు సీతాలక్ష్మణసహితంబుగా దేదీప్యమానంబగు దివ్యవిమానంబారోహించి కపివీరులు తోడరా నయోధ్యకుఁదరలిపోవుచు మహారణ్యంబు దరియంజొచ్చి చారుచంద్రనిభాననయగు జనకజ నవలోకించి యద్దేవికిఁ బ్రియంబు సంపాదించువాఁడయి, "ప్రేయసీ! చెచ్చెర వీక్షింపుము. అదిగో సమక్షంబున, (1) రావణకుంభకర్ణాది రాక్షసులబలంబుల సంహరించిన చోటు; (2) అల్లదె, సముద్రంబు బాధించిన సేతుబంధనంబు; (3) ఇదియె నీతివిద్యావిశేషుండగు విభీషణుండు శరణమ్మువేఁడినతావు; (4) అదె, సువేలాచలంబు; (5) ఆ కనిపించునది సుగ్రీవుని కిష్కింథానగరంబు; (6) ఆ లతాకుంజంబె వాలింగూలనేసిన ప్రదేశంబు; (7) ఈ శిలాతలంబె నమ్ముల భానునందనుఁడు పొడగన్న చోటు; (8) ఇదియె జటాయువు రావణునింగొట్టి పోరి మడిసిన ధరాతలంబు; (9) ఆ వటకుటీరంబె శరభంగునితపోవనంబు; (10) ఆ దవ్వునఁ బొడచూపునదె యత్రిమునిపత్ని యనసూయాదేవి నీకుఁ బతివ్రతాధర్మంబు లుపదేశించినచోటు." అని హర్షోత్కర్షంబున నచ్చటి యచ్చెరువులెల్ల మచ్చెకంటికి నచ్చువడఁజూపుచు భార

ద్వాజాశ్రమంబుఁజేరి యమ్మునిపుంగవు నతిప్రీతిగౌరవంబుల నర్చించి తదాశీర్వాదంబుల నభినందితుఁడయ్యె.

హనుమంతుఁడు భరతునకు రామాగమనంబుఁ దెల్పుట.

అంతఁ గొండొకసేపునకు రామచంద్రుఁడు హనుమంతునివంకఁజూచి, "అనిలజా! నీవు నందిగ్రామంబునకరిగి మదీయాగమనంబుఁగూర్చి భరతునకెఱింగింపుము. ఏను వెనుక వచ్చెదను." అనిన రాఘవుని యానతిం దలఁదాల్చి యాక్షణంబ హనుమంతుండు వియద్గమనంబునంజని భ్రాతృభక్తిభరితుండగు భరతునకెరఁగి రామాగమనవృత్తాంతంబుఁ బ్రకటించిన నతఁడత్యంతసంతోషాక్రాంతస్వాంతుఁడై యాసందేశంబు సాకేతంబునకుం దెలిపె. శత్రుఘ్నుఁడును, వసిష్ఠుఁడును, సుమంత్రాదిమంత్రివరులును నసంఖ్యాకులగు నగరవాస్తవ్యులును శ్రీరామచంద్రుఁడు చిరకాలసమాగతుఁడగుటం జేసి యాతనింజూచుతలంపు లుల్లంబుల వెల్లిగొన నతిత్వరితగమనంబున నందిగ్రామంబునకరిగి యాతనియాగమనమును నిరీక్షించుచుండిరి.

అట మార్తాండవంశమండనుఁడగు రాముఁడు భరద్వాజాశ్రమంబున నాఁటిపగలును రాత్రియునుండి ప్రభాతంబున మణిమయప్రభాభాసురంబైన కాంచనరథారోహణంబు సేసి సీతాలక్ష్మణసుగ్రీవవిభీషణాదులు వెంటనరుగుదేర నవ్విమానగమనవేగంబునకు మెచ్చుచు ననేకగిరిసరిదరణ్యంబులఁ

గడచి వివిధమణితోరణాదివిచిత్రాలంకృతంబు నతివైభవోపేతంబు నైన నందిగ్రామంబుఁ బ్రవేశించి వీథింజనుచుండఁ బౌరజానపదమిత్రామాత్యబంధుజనంబు లట్టియెడ మురజమృదంగపణవశంఖకాహళనిస్సాణవేణువీణాప్రముఖనిఖిల మంగళవాద్యరవంబులును జెలంగ నెదురుగాఁజనిరి. ఆసమయంబున సూతమాగధవందిగాయకపాఠకజనంబు లమందానంబున నభినందించిరి. పురాంగనలు సౌధోపరిభాగములనుండి పుష్పంబులు సేసలుచల్లిరి. భూసురాంగనలు కర్పూరదీపకళికల నివాళించిరి. అత్తఱి భ్రాతృవత్సలుఁడగుభరతుఁడు రామపాదుకలుశిరంబున నిడికొని శత్రుఘ్నసహితుఁడై సుహృద్బాంధవపురోహితామాత్యప్రభృతు లైనప్రజలు తోడరా నెదురువోయి రామునకుఁ గృతప్రణాముఁడై యాతనిందోడ్తెచ్చి యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి కాంచనాసనంబున నాసీనుం జేసి కుశలంబడిగిన రామచంద్రుండు సర్వంబును గుశలసంపన్నంబయని యందఱ నభినందించి తమ్ములనాలింగనంబున సత్కరించె. అంత భరతుఁడు సద్యస్సంకల్పితంబులగు నభిమతాహారంబులు దెచ్చి రామనృపాలునకును, బ్రాహ్మణభృత్యామాత్యప్రముఖాశేషజనంబులకును దృప్తిగాఁ గానించె. అయ్యంభోజాతమిత్రకులపవిత్రుండగుసీతాకళత్రుండును బౌరులిచ్చిన తాంబూలమాలికాగంధంబులును బహువిధంబు లైనకానికలును బరిగ్రహించి గురుఁడగువసిష్ఠునకు నర్ఘ్యసత్కారంబులాచరించి దీవనలంబడసి ప్రధానశేఖరులతోఁ బరస్పరక్షేమసమాచార వివరణంబుగా

వించి వారలఁ బ్రీతచేతస్కులం జేసి తన్నుఁ బ్రొక్కువారలకు మక్కువ దీవనలొసంగె.

రాముఁ డయోధ్యం బ్రవేశించుట.

సకల జగజ్జన జేగీయమాన కళ్యాణ గుణధాముఁడగు శ్రీరామచంద్రుఁడు మూఁడు వాసరంబులు నందిగ్రామంబున నుండి యొకదినంబున ననుజవధూసహితంబుగా సమస్తమంత్రి సామంతబంధుమిత్ర సేనానాయక భటవర్గంబును బౌరజనంబును దనవెంట నరుగుదేర నఖిలసామ్రాజ్యలక్ష్మినివాసంబైన యయోధ్యానగరంబునకుం జనుదెంచి శుభలగ్నంబున జయఘోషంబులుప్పతిల్ల శ్రీయుతంబై హిమవచ్ఛిఖరసంకాశంబైన తనగృహంబుఁ బ్రవేశించె. తత్క్షణంబ యుద్ధరారమణుండు శోకకర్శితయై నిజనిరీక్షణతత్పరయైన జనని చెంతకరిగి యద్దేవికిహర్షంబుఁ బుట్టించుచు నయవినయంబులు పెనంగొనఁ జయ్యన నమస్కరించి వీడ్కొని యనంతరంబ సవతితల్లులగు కైకేయీ సుమిత్రలకు వేర్వేఱ భక్తిప్రియపూర్వకంబుగా నభినందనార్చనంబులు సేసె. తమపరి సర్వజననయన పర్వంబుగ సీతాదేవి తనయత్తలచరణంబుల కెఱఁగి ఋషీంద్రులకు నమస్కరించి కనకాద్రినిరసించు నలపుష్పకరద్వీపంబున నడచిన విశేషంబులు పరితోషంబున నుగ్గడించినన్వారి యందఱు విభ్రాంతహృదయులయిరి.

## శ్రీరామచంద్రుని పట్టాభిషేకము.

అంత నొక్కనాఁడు దిగంతవిశ్రాంత యశోవిరాజితుఁడగు శ్రీరామచంద్రుఁడు పురోహితశ్రేష్ఠుఁడయిన వసిష్ఠుని యనుమతంబున శుభముహూర్తంబున మునిగణం బాశీర్వాదంబుల ననువదించుచు "తథాస్తు, తథాస్తు" అనుచుండ భద్రసింహాసనంబునఁ బట్టభద్రుఁడయ్యె. ఇట్లు విశ్వవిశ్వంభరాభరణుండు సామ్రాజ్యాభిషిక్తుండై, యామ్నాయాధ్యయనాధిక భాసురులగు భూసురాగ్రేసరులకు గో, భూ, హిరణ్యదానాదులనేకంబులొసంగి వెండియు నర్థులకు నిష్టార్థంబులిచ్చి విభీషణ సుగ్రీవ జాంబవదాది వానరపుంగవులఁ బ్రియాలాపంబుల సంభావించి వారివారికిఁదగిన ప్రశస్తరత్నఖచితంబులగు సువర్ణ భూషణంబులను సువర్ణచేలంబులు నుపాయనంబులుగా నర్పించి వీడ్కొలిపిన వారలు కృతప్రణాములై యనుజ్ఞవడసి నిజస్థానంబులకు సంప్రీతి నేగిరి.

రాజనీతికార్యధురంధరుండగు శ్రీరామచంద్రుండు సింహాసనం బలంకరించి యప్రతిహతప్రతాపంబు దీపింప దుష్టనిగ్రహశిష్టప్రతిపాలనంబులు సహజఖేలనంబులుగా భవ్యమార్గంబునం బ్రజాపాలనంబుఁ గావించుచు వారికిం బూర్వప్రకారంబుకంటె నతిశయిల్లు నెల్లవర్తనంబుల సంప్రీతిం జెల్లించుచుండె. మఱియునతఁ డనంతయశోవిరాజితుండై, దళితశత్రుండై, జనరంజకుండై లోకసమ్మతంబుగా మహోన్నతంబైన సామ్రా

జ్యంబుఁబరిపాలించుచుఁ బరమవైభవంబున లక్ష్మీసదృశసౌశీల్యసౌందర్యాది సమస్తసద్గుణసమన్వితయు, భూలోకమాతయునగు సీతాసతింగూడి యిష్టోపభోగంబు లనుభవించుచు నయోధ్యాపురంబున మనోరథఫలప్రాప్తిఁజెంది పెద్దకాలంబు రాజ్యంబుసేసె.

సర్వాంతర్యామియుఁ గరుణాగుణ బంధురుండును, శరణాగతత్రాణ బిరుదాంకితుండును, ఆర్తజనావనదీక్షితుండును, భక్తజనపోషణుండునై యొప్పు శ్రీమహావిష్ణువు రామాభిధానంబున దేవకార్యార్థంబు రాజత్వంబునొంది సముద్రనిగ్రహము, రావణవధము మున్నగు నసమానుషకర్మంబులాచరించె. అట్టి లోకారాధ్యుండును, సుధామధురనామ ప్రథితుండును నగు శ్రీరామచంద్రుని పవిత్రచరిత్రంబు వినినవారల దుశ్చరితంబులు దొలఁగు. మంగళంబులు సిద్ధించు. అద్దేవదేవుని దివ్యచరిత్ర పఠనం బైహికాముష్మిక సుఖంబులం బొందుటకు పరమ సులభోపాయంబు కావున,

క. "శ్రీరామకథామృతము"
వ్రాసిగ విన్నట్టివారు ♦ వ్రాసినవారున్
గోరిపఠించిన వారును
శ్రీరాముని కరుణమేలు ♦ సెందెద రెందున్.

ఉ. ధాత్రిని నాదివెల్మకుల
 ధాముఁడు, లక్ష్మయనాయకాఖ్యుసత్
పౌత్రుఁడు, బాపనయ్యయను
 ప్రాజ్ఞసుతుం డయినాలవంశ్యుఁడున్
జిత్రకవిత్వ తత్వసువి
 శేషుఁడు, వేంకటసామి రమ్యచా
రిత్రుఁడు, మంజుశైలిఁ బ్రచు
 రించెను లోకహితార్థమీకృతిన్.

సమాప్తము

శ్రీ. శ్రీ. శ్రీ.



శ్రీరామముద్రాక్షరశాల, రాజమండ్రి:—1938.

# ప్రకటన.

# అజామిళీయము

గ్రంథకర్త:—అయినాల వేంకటస్వామినాయఁడు,
విశాఖపట్టణము.

ప్రతి 1కి వెల రూ 0—4—0. పోస్టు ఖర్చులు, ప్రత్యేకము.

ఇది భగవత్కథామయంబగు శ్రీమహాభాగవతమునుండి సంగ్రహింపఁ బడినది. అజామిళుఁడను విద్వత్సంపన్నుఁడగు విప్రవరుఁడు సౌందర్యఖనియైన వెలయాలింగాంచి మన్మథపరవశుఁడయి ముసలులగు తల్లిదండ్రులను, జవ్వనియగు జాయను బాసి, శౌచాచారంబుల విసర్జించి యా వెలవెలంది గృహమె స్వర్గతుల్యంబుగ నెంచుట; వార్ధకదశకువచ్చి మృత్యుగహ్వరమునఁ బడనున్న సమయంబున యమకింకరులు పీడించునెడ నాపుణ్యాంగనకు జన్మించిన పుత్రదశకంబునఁ గనిష్ఠుఁడు నారాయణాహ్వయునిపైఁగల ప్రేమావేశంబున, "నారాయణ, నారాయణ", యని నుడువుట; అంతమాత్రంబున భగవద్దూతలు ప్రత్యక్షంబై యమభటుల మొర నిరాకరించి, (యమ, విష్ణుదూతల సంవాదము—చదివి తీరవలయును) వారితోడఁ బోరాడి వారి బారినుండి వానిం దప్పించుట; పిమ్మట నాదాసీపతి జ్ఞానవైరాగ్యంబులచేత బ్రహ్మనిష్ఠుండై కొండొక కాలము జీవించి ముక్తినొందుట; అను విస్మయకర విశేషాంశములు మృదుమధురమైన శైలిలోఁ జదువరుల కుల్లాసము గలిగించుచుండును. మఱియు నీతివిదూరులై నిజపత్నుల నొల్లక వెలయాండ్ర వాగురం జిక్కి సర్వధనంబును బోనాడిన వేశ్యాలోలురకు అవసరమైన కులాచారధర్మములు దెలుపఁబడినవి. గ్రంథము బహునీతిబోధకము. భక్తిపూరితము. దీనిం జదివి చూచినఁగాని చవి పూర్తిగాఁ దెలియదు.

☞ మొదటికూర్పు ప్రతులు చాలతక్కువగనున్నవి. కావున వెంటనే కొనువారలకు మాత్రము ఈగ్రంథము లభించును. వలయువారే తద్గ్రంథకర్తగారి పేర విశాఖపట్టణమునకు వ్రాసికొనవలయును.

ఈ గ్రంథమును గురించి పండితులొసంగిన

# అభిప్రాయములు.

మ. రా. శ్రీ దేవగుప్త సన్యాసిరాజుపంతులుగారు,
కశింకోట, విశాఖపట్టణముజిల్లా.

మీరు కరుణామయులై యంపిన "అజామిళీయము" ఆమూలాగ్రముగం జదివి యందలి కథామాధుర్యమునకు, మీపద్యరచనాచమత్కారమునకు, మీయాంధ్రభాషాపాండిత్యమునకు, మీవిష్ణుభక్తివిశ్వాసమునకు, మీపరోపకారపారీణతకు, మీబుధవిధేయతకు, వేయేల! మీసహజసౌజన్యమునకును, పరమానందభరితుఁడనై యిట్టిలోకోపకారమహనీయుల నాయురారోగ్యసంపదున్నతలుగాఁ గటాక్షించునట్లు శ్రీపరమేశ్వరునిఁ బ్రార్థించుచున్నాఁడ. మీచేరచింపఁబడుపాత్రములన్నియు ఆబాలగోపాలమందఱును బఠింపవలయునవియే యని నాయాశయము.

---

బ్రహ్మశ్రీ నాదెళ్ళ పురుషోత్తమకవిగారు,
మచిలీపట్టణము, కృష్ణాజిల్లా.

ఉ. ప్రేమవహించి నాకునని ♦ పెన్నిహితుం డయినాల వేంకట
స్వామి సమాహ్వయుం డిపుడు ♦ చక్కని శైలి రచించినట్టిదౌ
శ్రీమదజామిళీయము వి ♦ శేషముదంబునఁ గాంచితిన్బుధ
స్తోమము సంతసింపఁదగు ♦ చొప్పుననొప్పుట మెప్పిదం బెడున్.

---

పిఠాపురము హైస్కూల్ హెడ్మాష్టరు
మ॥ రా॥ శ్రీ కూచి నరసింహముపంతులుగారు, బి. ఏ;—

ఆర్యవర్యా! తమరు దయాపూర్వకముగా నాకంపిన భవత్కృతాజామిళీయమును బూర్ణముగాఁ జదివి యానందించితిని.

గ్రంథము నీతి భక్తి ప్రధానమైన సద్గ్రంథము. భాష నాతికఠినమై శుద్ధమైయున్నది. అకలంకరామభక్తుఁడగు శ్రీ పోతన్నగారి పద్యరూపమైన వాగమృతము నక్కడక్కడఁ జల్లినారు. కథనుగూడ విపులముగా వ్రాసినారు. ప్రాపంచిక సౌఖ్యమే పరమార్థ మనుకొను నీకాలములో నిట్టిగ్రంథము లవశ్య పఠనీయములని నాయభిప్రాయము.

## మునిసిపల్ హైస్కూల్ పండితులు

### బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు, కడప.

చ. నిరుపమ నీతిదాయకము ♦ నిర్మలభక్తిరసప్రదీపకం
బురుతర పాపతూల నివ ♦ హోగ్రధనంజయ సన్నిభంబునై
పరఁగు "నజామిళీయము", భ ♦ వత్కృతి శాశ్వత కీర్తిఁ గాంచుచున్
ధరణినిమించుఁ గాక! రుచి ♦ ధామ శశాంకులెసంగుదాఁకఁ దాన్.

తే. సరసమై భక్తిభావసం ♦ భరితమగుచుఁ-జారుశైలిఁ జెలంగి భా ♦ షావిశుద్ధిఁ
దగినయీకృతి సజ్జన ♦ స్తవముఁ గాంచి-మీకుఁ గీర్తినొసంగుచు ♦ మించుఁగాక!

---

## ఎ. ఇ. యల్. ఎం. హైస్కూల్ పండితులు

### మ॥రా॥శ్రీ శలపాక వేంకటసూర్యప్రకాశంగారు, పెద్దాపురము.

ఓ సుధీమణీ! భవత్ప్రేషితాజామిళీయము నాకడకుం జేరి సులభపద ఘటితసమాసాంచితంబై, మృదుమధురపదవిరాజిత వాక్యసముదయంబై, పండితపామరజనపఠనయోగ్యంబై, బాలబాలికానుబోధ్యంబై, భగవద్భక్తిప్రపూరితంబై, యనేకపురాణ నిదర్శనలోకోక్తి ప్రదర్శకంబై, కరంబు ముదంబుధి నోలలాడించుచున్నదని విన్నవించుచున్నవాఁడను.

---

## అనేక బిరుదవిభ్రాజితులును శతావధానులునగు

### బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రులుగారు.

కం. మీరంపించిన కబ్బము - సారసితిఁ దదీయరచన ♦ కలరె మనంబున్
సారెకునిటు గ్రంథమ్ములఁ - గూరుపఁగా నీశ్వరుండు ♦ కూర్చుత మీకున్.

---

## తిరుపతి సంస్కృతకాలేజీ పండితులు

### శ్రీమాన్ విద్వాన్ చక్రవర్తి భట్టాచార్యస్వామిగారు.

అయ్యా! తాముపంపిన "అజామిళీయము" చేరినది. సమగ్రముగఁ జూచితిని. పుస్తకమునందు కథాసందర్భానురూపముగ చక్కని సామెతలు చేర్పఁబడియున్నవి. శైలిమృదుమధురముగనున్నది. మఱియు నాంగ్లేయభాషయందు వ్రాయఁబడిన భూమిక (Introduction) యందు, "His style is simple and natural...present day" యీ మొదలగు నంశముల నెవ్వరుగాని వ్రాసియే తీరవలయునని వ్రాయుట యతిశయోక్తి కాఁజాలదు. భాషాభిమానులగు మీరిట్టి గ్రంథముల నుత్తరోత్తరము వృద్ధిపఱచుచు పాఠకుల కానందము నధికముచేయుదురని కోరుచున్నాను.

బ్రహ్మశ్రీ చక్రావధానుల మాణిక్యశర్మగారు,
ముత్యాలపల్లి, నర్సాపురముతాలూకా, కృష్ణాజిల్లా.

సీ. శ్రీమదయినాలవంశాబ్ధి ♦ శీతకిరణ! - వేంకటస్వామినాయక! ♦ విబుధవినుత!
చిరతరైశ్వర్యమాయువు ♦ శ్రేయములును - కలుగుఁ గావుత మీకున ♦ ఖండముగను.

చంపకమాలిక.

కవిజన గౌరవంబున స్వ ♦ కల్పితమైన యజామిళీయమున్
దవిలి పఠించి తద్గుణ వి ♦ ధంబును దెల్పఁగ మీరు పంప, నే
నువిడిచి యన్యకృత్యముల క ♦ రంగుటచేఁ దమ పాత్రమప్పుడే
చవిగొనఁ జాలనైతి నది ♦ నైపుడి; పిమ్మట దానిగాంచి, సా
రవిహితమై, సమస్తగుణ ♦ రాజితమై, సకలోపకారమై,
పరివిమల భక్తియుక్తమయి ♦ భాసిలునట్టిదిగాఁ దలంచి, సం
స్తవమున కర్హమంచు మన ♦ సార వచించితి; దీని బాలికా
నివహము బాలకుల్ జదువ ♦ నిస్తుల సాహితి నందఁగుందురే!

---

బ్రహ్మశ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రిగారు,
మహాబూబు కలాశాలోపాధ్యాయులు, శికిందరాబాదు.

అయ్యా! తమరు మదభిప్రాయ నిమిత్తమై క్షేమపూర్వకముగాఁ బంపిన "అజామిళీయము", అను గ్రంథమును జాలవఱకుఁ జూచితిని. ఇది శైలీయజాతీయపద బంధురమై, భక్తిరసప్రధానమై, యాంధ్రలోకపాఠ్యమై యున్నదని నాయాశయము.

---

మ. రా. శ్రీ ఎ. వి. నరసింహంగారు, ఆంధ్రోపాధ్యాయులు,
దొరతనమువారి స్త్రీలకళాశాల,
Government College for Women, Madras. మైలాపూర్

గీతములు.

వినికిచేతఁగాని ♦ వీక్షించి యెఱుఁగని - మిత్రవరుఁడ! కృపను ♦ మీరుపంపు
పుస్తకంబుఁజదివి ♦ పొదలిన మదిలోని - రసముచొప్పుఁగొంత ♦ వ్రాసినాఁడ.

---

వన్నెతోడసార ♦ ధంబుఁ గాంచినపైఁడి - జాతిశయ్యప్రమదిమఁ ♦ బరిఢవిల్లి
యవసరోచితమ్ము ♦ లౌపదజాలమ్ము - లమృతసిక్తములుగ ♦ హార్దములయి
రాచికత్వమూని ♦ రహిమీ "యజామిళీ - యంబు" నీరదంబు ♦ ననుకరించి
నీతిదంబయగుచు ♦ నెగడె నాంధ్రావనిఁ - బౌనరభాషకొక్క ♦ భూషగాఁగ.

---

